# చతుర

డిసెంబర్ 2000

రూ. 7/-



మందపాటి సత్యం : చీకటిలో చందమామ

# రుచి రైస్‌తో పసందైన వంటకాలని తయారుచేయండి

ఈ రోజు స్పెషల్

## రుచి వెజిటబుల్ రైస్




**కావలసిన వస్తువులు :** 200 గ్రాములు రుచి రైస్, 50 గ్రాములు రిఫైన్డ్ నూనె, 50 గ్రాములు ప్రతీది ముక్కలుగా చేయబడిన క్యారట్, బీట్‌రూట్, బఠాణీ, ఉల్లిపాయ, టొమాటో, 200 గ్రాములు తరిగిన క్యాబేజీ, 2 పచ్చిమిరపకాయలు, ½ టీస్పూన్ ఆయిల్, ఉప్పు మరియు మిరియాలు రుచికి టొమాటో మరియు చిల్లిసాస్ (అవసరముంటే)

**తయారుచేయు విధానం :** తక్కువ మంటతో ఫ్రైయింగ్ ప్యాన్‌లో రుచి రైస్‌ని కొంచెం వేయించండి. ½ టీస్పూన్ ఉప్పు కలిపిన 2 లీటర్ల నీటిని మరిగించండి. మరుగుతున్న నీటిలో రుచిరైస్‌ని వేసి, మంటపై 5 నిమిషములు ఉడికించండి. తదుపరి నీటిని పారబోయండి. ఉడికించబడిన రుచి రైస్‌ని చల్లని నీటితో కడిగి ప్రక్కనే ఉంచండి. ఫ్రైయింగ్ ప్యాన్‌లో 50 గ్రాముల రిఫైన్డ్ నూనె వేసి వేడిచెయ్యండి. తరిగిన ఉల్లిపాయలు మరియు కూరగాయల్ని వేసి ఉల్లిపాయలు కొంచెం గోధుమ రంగు వచ్చువరకు వేయించండి. మిరియాలు, టొమాటో, చిల్లీసాస్ కలపండి. అంతా కలిపి వేడివేడిగా వడ్డించండి.




● ఉడికించవద్దు ● కొంచెం వేయించండి ● 5 నిమిషములు ఉడికించండి

- 100% పరిశుద్ధమైన గోధుమల నుండి తయారీ
- క్రొవ్వు తక్కువ
- ఇటాలియన్ మరియు దక్షిణ కొరియా విజ్ఞానంతో




మంచి రుచి. మంచి ఆరోగ్యం.


Om Oil & Flour Mills Limited
Type II, No. 8, Industrial Estate Cuttack 753 010, Orissa. India
Tel.: 0671-344439/341321/341322 (O) Fax : 0671-344538 (O)
e-mail : ruchi @ cal12.vsnl.net.in
Website : www.ruchispices.com.


ఓమ్ ఆయిల్ & ఫ్లోర్ మిల్స్ లిమిటెడ్ వారి నుండి ఒక ఉత్తమమైన ఉత్పాదన. స్పైస్ హౌస్ సర్టిఫికెట్ గెలుపొందినవారు.




అన్ని ముఖ్య దుకాణాలలో దొరుకును
డీలర్‌షిప్‌కు విచారణలు ఆహ్వానిస్తున్నాము.

# ఏరిన ముత్యాలు

★ వెలుగుతున్న దీపమే ఇతర దీపములను వెలిగించగలదు. నిరంతరం నేర్చుకునే వారే ఇతరులకు నేర్పగలరు.

-రవీంద్రుడు

★ వర్తమానం గతానికి ఫలం, భవిష్యత్తుకు విత్తనం

-వినోబాభావే

★ చీమకంటే ఉత్తమ బోధకుడులేడు. చీమ ఏమీచెప్పదు.

-బెంజిమిన్ ఫ్రాంక్లిన్

★ అధముడు జీవించడానికి, మధ్యముడు మృత్యువుకు, ఉత్తముడు అవమానానికి భయపడతాడు.

-విదురుడు

★ గొప్పవాళ్ళ కథలన్నీ ఒలాగే ఉంటాయి. పేదవాళ్ళకథలే రకరకాలుగా ఉంటాయి.

-మాక్సిమ్

★ ఉపయోగపడని శాంతికంటే, ఉపయోగకరమైన ఘర్షణ మేలు.

-గోర్కి

★ ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని ఇంకొకరిలో కలిగించడానికి చేసే ప్రయత్నమే కళ.

-టాల్‌స్టాయ్

★ జ్ఞానాని కన్నా ఊహ గొప్పది.

-ఐన్‌స్టీన్

★ ప్రపంచాన్ని అర్థంచేసుకోవాలనే కోరికా, దాన్ని మార్చుకోవాలనే తపన ఈ రెండూ మానవ ప్రగతికి ప్రధాన ప్రేరకాలు

-రస్సెల్

★ మనుషులను గాయపరచడం ఎంత తప్పో, మనసులను గాయపరచడం అంతకంటే తప్పు.

-సోక్రటీస్

★ సమస్యలకు పరిష్కారాలు మన దగ్గరే ఉంటాయి. కానీ మనం ఎవరో పరిష్కరిస్తారనుకుంటాం.

-షేక్స్‌పియర్

★ తక్కువ కళతో ఎక్కువ విషయాల్ని చెప్పడమే నిజమైన కళ.

-షేక్స్‌పియర్

★ నీపై నీకు నమ్మకం లేనిదే, దైవంపై నమ్మకముండదు.

-వివేకానంద

సేకరణ: వాకాడ దుర్గాప్రసాద్

# చతుర ప్రపంచం

## కళ్లజోళ్ల చరిత్ర

చాలామందికి లైఫ్‌లాంగ్ కంపానియన్ కళ్లజోడు. ఈ రోజుల్లో చిన్న పిల్లలకికూడా కళ్లజోళ్లు వచ్చేస్తున్నాయి. పాతికేళ్ల క్రితం అరుదుగా పిల్లలు కళ్లజోళ్లు ధరించేవారు.

కళ్లజోడుని కనుగొన్నది సాల్విన్ డి అర్మటో అనే ఇటాలియన్. 1317 లో అతను మరణించాక అతని సమాధి మీద ఆ విషయం రాశారు. ఫ్లోరెన్స్‌కి సమీపంలో వున్న ఈ సమాధి టూరిస్ట్ అట్రాక్షన్‌గా మారింది.

అయితే అంతకు పూర్వమే చైనీస్ రెండు ఫ్రేముల్లో రెండు లెన్స్‌లుంచిన కళ్లజోళ్లని వాడేవారు. ఇప్పట్లా టీ వీ లు, సినిమాలు లేవు కాబట్టి మనిషిని పోల్చుకోవడానికి ఓ హ్యాండిల్ కట్టిన ఆ ఫ్రేమ్‌ని ఓసారి కళ్ల ముందుంచుకుని చూసి తీసేస్తూవుండేవారు. ఎముకతో చేసేవారు ఆనాటి కళ్లజోళ్లని.

15వ శతాబ్దంలో అచ్చుయంత్రాన్ని జాన్ గూటెన్ బర్గ్ కనుగొన్నాక పుస్తకాల చరిత్ర ఆరంభమయింది. దాంతోపాటు కళ్లజోళ్ల చరిత్ర కూడా పునఃప్రారంభమయింది.

చాలాసేపు హ్యాండిల్ కళ్లజోడుని పట్టుకుని పేజీలు తిప్పుతూ చదవడం కష్టం కాబట్టి రెండు హ్యాండిల్స్‌ని చెవులకి తగిలించుకునే కళ్లజోడు పాప్యులర్ అయింది.

సాల్విన్ కనిపెట్టిన కళ్లజోడు నమూనాతో పాఠకుల కోసం విరివిగా కళ్లజోళ్లు తయారుచేయసాగారు. బంగారం, వెండిలతో చేసినవి ధనికులు వాడేవారు. పేదలు ఇనుము, రాగిలాంటి లోహాలతో చేసిన ఫ్రేములుగల కళ్లజోళ్లని వాడేవారు. అది అప్పట్లో ఫ్యాషన్‌గా కూడా మారింది.

1801 లో థామస్‌యంగ్ అనే అతను వైర్‌తో కళ్లజోడు ఫ్రేమ్‌ని చేసి, చెవి దగ్గర జారిపోకుండా చివర్లని కొద్దిగా వంచాడు. దాంతో ఇప్పుడు మనం ధరించే కళ్లజోడు కనిపెట్టబడింది. కళ్లజోడు జారిపడని ఆ డిజైన్‌ని మించింది ఇంకోటి ఇంతదాకా లేదు.

1827 లో బైఫోకల్ లెన్సెస్... అంటే



హ్రస్వదృష్టి, దీర్ఘదృష్టి లకి ఉపయోగించే రెండురకాల లెన్స్‌లు ఒకే కళ్లజోడులో ఉంచగలగడం థామస్ యంగ్ మళ్లీ కను గొన్నాడు.

అంతకుముందు మోనొకల్ అనే ఒకే లెన్స్ గల ఫ్రేమ్‌ని చదవడానికి ఉపయోగించేవారు.

మనిషి కంటికున్న దృష్టిలోపాన్ని సవరించడానికి నేడు 1,11,32,544 రకాల లెన్సులు తయారుచేయవచ్చు. కానీ వెయ్యిలోపే లెన్సులు సామాన్య ప్రజలకి అందుబాటులో ఉన్నాయి.

కొత్తగా లేజర్‌తో రెటీనా లోని లోపాన్ని కరెక్ట్ చేసే పద్ధతి ఇండియాకి వచ్చింది. అయిదునిమిషాల్లో అయిపోయే ఈ చికిత్సానంతరం జీవితాంతం ఇక కళ్లజోడు అవసరం లేకుండా కంటిచూపు సరిదిద్దబడుతుంది. అయితే ఈ చికిత్సకోసం కంటికి 15000 రూపాయలు ఫీజ్ అవుతుంది. కాలం గడిచేకొద్దీ ఈ ఫీజ్ సామాన్యునికి కూడా అందుబాటులోకి వస్తే భవిష్యత్తులో కళ్లజోళ్లు కేవలం మ్యూజియంలకే పరిమితం కావచ్చు.

## ఆర్.జి.యస్

ప్రపంచంలో కొత్త విషయాలని తెలుసుకోవడానికి డబ్బిచ్చి ప్రోత్సహించే సంస్థల్లో నంబర్‌వన్ రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ (ఆర్.జి.ఎస్). 1830 లో ఇంగ్లండులో దీన్ని స్థాపించారు. మొట్టమొదటి సారిగా ఎవరెస్ట్ ఎక్కిన ఎడ్మండ్ హిల్లరీకి ఆర్థిక సహాయం చేసింది ఈ సంస్థే.




ప్రపంచం మొత్తాన్ని దర్శించి, అది ఎంత ఉందో తెలుసుకోవాలన్న తపన 18 వ, 19 వ శతాబ్దపు బ్రిటిష్ నావికుల్లో అధికంగా ఉండేది. దీన్ని గుర్తించిన నలుగురు.... రిచర్డ్ బర్టన్, జాన్ హెన్నింగ్ స్పికి, డేవిడ్ లివింగ్‌స్టన్, హెన్రీ స్టేన్లీ ఈ సొసయిటీని స్థాపించి, నావికులకి ధన సహాయం చేయసాగారు.

లండన్ నగరం నడిబొడ్డున కెన్‌సింగ్‌టన్‌లో ఆర్.జి.ఎస్ హెడ్డాఫీస్ ఉంది. ఆఫ్రికా ఖండం మేప్‌ని తయారు చేయడం, నైలు నది పుట్టుకస్థానం కనుక్కోవడం కోసం తొలుత ఈ సొసయిటీ చాలామందికి ధన సహాయం చేసింది. దీని స్థాపకుల్లో ఒకరయిన డేవిడ్ లివింగ్‌స్టన్ స్వయంగా నైలు నది ముఖద్వారం కోసం ఐదేళ్లు శ్రమించాడు. లేక్ విక్టోరియా దాని పుట్టుక




స్థానంగా కనుక్కున్నాడు చివరికి.

ఆర్కిటిక్, అంటార్కిటిక్‌లకి ఆర్. జి. ఎస్ ఆర్థిక సహాయంతో ఎంతోమంది పరిశోధకులు వెళ్లి కొత్త విషయాల్ని కనుక్కొన్నారు. భూగోళశాస్త్రంలో ఎన్నో అధ్యాయాలని ఆర్. జి. ఎస్ సృష్టించింది.

ఇప్పుడీ సంస్థ ఒక్క భూగోళశాస్త్రానికే పరిమితం అవకుండా ఇతర శాస్త్రాల పరిశోధకులకి కూడా ఆర్థిక సహాయం చేస్తోంది.

బయోలజీ, ఎంటొమోలజీ, డెమోగ్రఫెల్స్, ఓషనోగ్రఫి, ఆంత్రోపాలజీ, అగ్నినిజం మొదలయిన శాస్త్రాల అధ్యయనానికి ఆర్. జి. ఎస్ సహాయం చేస్తోంది.

అడవుల నిర్మూలన వల్ల కలిగే చెడు ఫలితాల అధ్యయనం, నేపాల్‌లో, టాంజీనియాలో అరుదయిన జంతువుల రక్షణ మొదలయిన ప్రాజెక్టులని ప్రస్తుతం ఆర్. జి. ఎస్ చేపట్టింది.

ఔత్సాహికులయిన శాస్త్రజ్ఞులు ఆర్. జి. ఎస్ కి ఆర్థిక సహాయం కోసం పెట్టుకునే అప్లికేషన్లు కొన్నివేలు పెండింగులో ఉన్నాయి. ఇంతదాకా 190 ఏళ్లల్లో ఈ సంస్థ 100 దేశాలకి చెందిన 3000 పరిశోధనలకి ఆర్థిక సహాయం అందించింది. ఓ సముద్రం లోతు తెలుసుకోవాలన్నా, ఓ కొండ శిఖరం ఎత్తు కొలవాలన్నా శాస్త్రజ్ఞులు ఆర్. జి. ఎస్ తలుపు తడుతుంటారు.

ఆర్. జి. ఎస్ దగ్గర 8 లక్షల మేప్‌లు, ఛార్ట్‌లు ఉన్నాయి. అన్నిటిలోకి పాతది క్రీ. శ 1647 నాటి చిత్రపటం. ఇవన్నీ శాస్త్రజ్ఞులకి అందుబాటులో ఉంటాయి.

## రైనోసరస్ బీటిల్

ప్రస్తుతంభూమి మీద ఉండే జంతుజాలమంతటిలోకీ శక్తివంతమైనది 'రైనోసరస్ బీటిల్' అంటే నమ్మరుకదూ! ఎందుకంటే బీటిల్ అనగానే మనం అరచేతిలో పట్టికూడా ఆడించగలిగే పేడపురుగు గుర్తొస్తుందికాబట్టి. కానీ ఆ పక్కనే రైనోసరస్ పేరు కూడా కలిసివుండటంతో ఇది మనం ఊహించినట్టుండదు. మనం ఏనుగును అతి పెద్ద జంతువుగా, ఎక్కువ బరువు మోయగలిగే శక్తివంతమైన ప్రాణిగా చెప్పుకోవడం వాస్తవమే. అయితే సర్వే వివరాలు ఏం చెబుతున్నాయంటే ఓ ఆఫ్రికన్ ఏనుగు తన శరీర బరువులో 25 శాతాన్ని మాత్రమే తన వీపు మీద మొయ్యగలదు. అదే ఓ రైనోసరస్ బీటిల్ దాని శరీర బరువులో 850 శాతాన్ని మొయ్యగలదంటే ఆశ్చర్యమేమరి. మరి దీనికి పోటీ లేదు. ఈ జంతువుకి పెద్దపెద్ద కొమ్ములుంటాయి. పరిశోధనల్లో తెలిసిన విషయాల్లో మరికొన్ని ఏమిటంటే ఇవి శాకాహారులని. అడవిలో దొరికే పెద్దపెద్ద ఆకులను ఇవి ఆహారంగా



తింటాయి. ప్రమాదం వచ్చినప్పుడు క్షణాల్లో తమ పదునైన కొమ్ములతో భూమిని తవ్వేసి అందులో దాక్కుంటాయి.

## పనిజాప్యం

ప్రభుత్వ సంస్థల్లో ఫైళ్ల దుమ్ము గురించి అందరికీ తెలిసిందే. ఏ పని జరగడానికైనా జాప్యమే. సౌత్ ఆఫ్రికాలో కూడా ఈ మధ్య ఈ సమస్య ఎక్కువగానే ఉంది. అక్కడ ఓ గ్రామంలో 'ఆరెంజ్ గ్రోవ్' అనేప్రైమరీ స్కూల్లో ఓ టీచర్ పనిచేస్తోంది. ఈ స్కూలు హెడ్డాఫీసు ప్రిటోరియాలో ఉంది. అక్కడినుంచి ఏనెలకా నెల జీతాలు ఈ స్కూలుకి పంపుతారు. ఇంతకీ పై టీచరమ్మకి ఓ నెల జీతం అంద లేదు. ఆవిడకు సంబంధించిన శాలరీ ప్రిటో రియా నుండి రాలేదన్నారు అధికారులు. మెంటూ, ఫైలూ అక్కడ లేవని తెలిసింది. ఆవిడ తమ బ్రాంచ్ స్కూల్లో పనిచేస్తున్నట్లు ఆధారా లేవీ లేవని వాదిస్తున్నారు ఆ స్కూలు వాళ్లు. చివరికి ఈ సమాచారం ఒకళ్లనుంచి ఒకళ్లకి చేరుకుని ప్రతినెలా శాలరీ స్లిప్పులను టైప్ చేసే క్లర్కుగారిని నిలేశారు. ఆవిడకీ అర్థంకా లేదు. అయినా ఆ ఆఫీసుస్టాఫ్‌లో అందరిలోకీ అతి పొట్టిగా ఉండే ఆ క్లర్కుగారికే మెదడులో ఓ ఫ్లాష్‌లా వెలిగింది. వెంటనే తన సీటువ ద్దకు పరిగెత్తి అందులోంచి మూడు ఫైళ్లను బయటకి లాగింది. అందులో సదరు టీచర




దాన్ని గురించి హెడ్ ఆఫీసుకి ఉత్తరాలు రాయడం, అక్కడినుంచి వచ్చే సమాధానం కోసం వేచి చూడడంతో మరో నెల గడిచిపో యింది. చివరికి ఆవిడే స్వయంగా ప్రిటో రియా బయలుదేరింది. తనకు సంబంధించిన డాక్యుమెంట్స్, పే స్లిప్పులు అన్నీ తీసుకుని మరీ వెళ్లింది.

అయితే అక్కడ ఎన్ని సాక్ష్యాధారాలు చూపించినా ఆవిడకి సంబంధించిన ఏ డాక్యు మ్మగారి ఫైలు అడుగున దొరికింది. అదేమి టని నిలదీస్తే తేలిన విషయం ఏమంటే 3 నెలల క్రితమే ఆ ఉద్యోగంలో చేరిన ఆ పొట్టి మహిళకి టైపు మిషను అందక ఓ రెండు మూడు ఫైళ్లను సీట్లో వేసుకుకూర్చుంది. రెండు నెల్లుగా వాటి సంగతే మర్చిపోయిం దామె. అంతలో మరో రెండు ఫైళ్లకు సంబం ధించిన వ్యక్తులు కూడా తమ శాలరీ విషయం తేల్చుకుందుకు అక్కడికి చేరుకు న్నారు. అదీ ఆ ప్రభుత్వాధికారుల నిర్వాకం. ప్రభుత్వరంగాల్లో పని జాప్యానికుండే అడ్డ మైన కారణాల్లో ఇదొకటి. ఏదయితేనేం...?




# 'రంజని' పై సమీక్షలు

అక్టోబర్ చతురలో ప్రచురితమైన తనికెళ్ళ కళ్యాణి రచన 'రంజని' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## అభూతకల్పన

*(ప్రథమ బహుమతి రూ: 100/- పొందిన సమీక్ష)*

'రంజని' కథానాయిక 'కామాక్షి' ఏ కాలం నాటిదో తెలియదు కాని రచయిత్రి ఆమెను ఒక ఆదర్శ మహిళగా చిత్రించడానికి ప్రయత్నించారు. వివాహానికి ముందు 'నాన్నగారూ మీరు కుదిర్చిన ఈ సంబంధం నాకు ఇష్టం లేదు' అని తండ్రిని ఎదిరించి చెప్పి 'ఆ అబ్బాయికి చదువులేదు- ఒక స్థిరమైన ఉద్యోగంలేదు- ఎలా ఆ అబ్బాయిని పెళ్ళి చేసుకునేది? ' అని ప్రశ్నించగలిగినా కూడా తన నొసటి రాతను నమ్మి ఆ అబ్బాయినే భర్తగా స్వీకరించిన భారతనారి కామాక్షి.

ఆ భర్త తననూ, తన పిల్లలను నిర్లక్ష్యం చేసినా, పరస్త్రీలతో గడుపుతూ దేశాలుపట్టి తిరుగుతున్నా, ఎప్పుడో గాలివాటంగా తన ఇంటికి వచ్చినప్పుడైనా తనను, పిల్లలను నీచంగా నిందిస్తూ దారుణంగా హింసిస్తున్నా ఆ పతినే దేవునిగా సంభాషిస్తూ ఆరాధించిన ఆదర్శగృహిణి. ఆ పతిదేవుడు జేబు ఖాళీ అయినప్పుడు బొమ్మలు గీసి వాటిని ఇంటింటికి తిరిగి అమ్మి 'వందలు' (?) సంపాదించి జల్సాగా వేలు ఖర్చు చేస్తూ ఢిల్లీ, హైదరాబాదు వంటి నగరాలలో ఘనసన్మానాలందుకుంటున్న కళాకారుడు! అతని ధర్మపత్ని ఇంట్లో అప్పడాలు, ఆవకాయ తయారుచేసి అమ్మి వచ్చిన ఆదాయంతో ముగ్గురు సంతానాన్ని ఏ లోటూ లేకుండా పెంచి ఉన్నత విద్యలు గరిపించి తీర్చిదిద్దిన ఇల్లాలు! ఆమెకు సన్నిహితులై సహకరించిన సుబ్బమ్మ, నాగమ్మ, ఆనందు అందరూ దేవతామూర్తులే. అసలు ఈ నవలలో దుష్టపాత్రలు, దుర్మార్గాలు లేవు. ఆమె, పిల్లలు వ్యక్తం చేసిన భావాలు, సంభాషణలలో ఉపయోగించిన భాష పాఠకులను ఆశ్చర్యచకితులను చేస్తాయనడం అతిశయోక్తి కాదు.

గత శతాబ్దపు పూర్వార్ధంలో ప్రముఖ చిత్రకారులు, రచయిత శ్రీ అడవిబాపిరాజు తన నవలల్లో ఇటువంటి ఉదాత్తపాత్రలను, సన్నివేశాలను కల్పించి రాస్తే ఆ తరం పాఠకులు వాటిని ఆమోదించి హర్షించారు. బహుశా అప్పట్లో వారు కలలుకన్న సమాజం, అందులోని వ్యక్తులు అలా వుండాలని వారు కోరివుండవచ్చును. కాని ఈనాడు ఇటువంటి అవాస్తవిక సంఘటనలను, కాల్పనిక పాత్రలను పాఠకులు ఆమోదించరు.

**-పంతుల ఉమాకుమారి,**
బొబ్బిలి-535 558.

## స్త్రీలే బలిపశువులు

*(ద్వితీయ బహుమతి రూ: 75/- పొందిన సమీక్ష)*

కథావస్తువు పాతదే. అధికంగా ఉండే ఏ వ్యామోహమైనా వ్యసనమే. అన్ని వ్యసనాలూ ఉన్న భర్తను భరించి, ఇష్టం లేకున్నా బిడ్డలకోసమో, పరువుకోసమో సమాజంలో అనేకమంది స్త్రీలు బలిపశువులవుతున్నారు.

పాత కథ అయినా కథ నడిపిన తీరు బావుంది. పాఠకుల్ని పట్టువిడవకుండా చదివి



వించే పటుత్వం ఉంది. భర్త బాధ్యతల్ని విస్మరించి స్వార్థంతో తన సుఖం తాను చూసుకుంటున్నప్పుడు, భార్య పిరికితనంతో ఆత్మహత్య చేసుకోవడమో, మరేదైనా అవినీతికి పాల్పడడమో చేయకుండా ధైర్యంగా తన కాళ్ళమీద తాను నిలబడి బిడ్డల్ని పోషించుకోవడం, మంచి మార్గంలో నడిపించడం అనేది రచయిత్రి చూపిన చక్కని పరిష్కారం. ఒకవైపు భర్త చేసేపనులు నచ్చకపోయినా మరోవైపు బిడ్డలకోసం, బిడ్డల భవిష్యత్తుకోసం, కుటుంబ పరువు ప్రతిష్టల కోసం ఒంటరి పోరాటం సాగించిన కామాక్షి పాత్ర స్త్రీలందరికీ ఆదర్శవంతంగా కన్పించినా అయ్యో! ఇలాంటి స్త్రీలు జీవితంలో పొందిన ఆనందం ఏముంది? అనే సానుభూతి కలుగుతుంది. హక్కుల కోసం పోరాడడం, పంతాలకు, పట్టింపులకు పోవడంలాంటివి లేకుండా కామాక్షి కేవలం తన తెలివితేటలతో తన సమస్యలకు తానే పరిష్కారం వెతుక్కుంది.

నవల వాస్తవికతకు దగ్గరగా ఉంది. అసందర్భమైన వర్ణనలుగాని అశ్లీలంగాని లేవు. కానీ దున్నే ఎద్దునే పొడిచినట్టు బరువును మోసేవారిపైనే మరింత బరువును మోపడం ఎంతవరకు సమంజసం? ఇప్పటికే సమాజంలో ఎక్కువశాతం కుటుంబాలలో స్త్రీలే అధికశ్రమతో కుటుంబభారాన్ని మోస్తున్నారు. వ్యసనపరులైన భర్తలతో అనేక కష్టాలు పడుతున్నారు. ఇంకా వీరినే సర్దుకుపొమ్మనడం అన్యాయం.

బిడ్డల్ని పట్టించుకోని తండ్రిని చివర్లో బిడ్డలు కూడా పట్టించుకోరని, పైగా అసహ్యించుకుంటారని తండ్రులకు ఒక హెచ్చరిక కూడా ఇచ్చారు రచయిత్రి.

–డి. హేమలత,
విజయవాడ.

# సర్దుకుపోదాం

*(తృతీయ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

భర్త దుర్మార్గుడు కానీ, వ్యభిచారి కానీ, జూదగాడు కానీ, తిండి పెట్టకపోనీ, పిల్లల్ని కొట్టనీ, 'నీవే నా ప్రత్యక్షదైవం' అనుకుంటూ సర్దుకుపోయే సగటు ఇల్లాలిని చిత్రించిన నవల 'రంజని'. 'ఆకాశంలో సగం మేమే, మాకూ స్వేచ్ఛ కావాలి, దేశాన్ని పరిపాలించే హక్కులో భాగం కావాలి' అంటూ స్త్రీవాద సాహిత్యం వెలువడుతున్న ఈ కాలంలో 'రంజని' వంటి నవలల వల్ల ఏం ప్రయోజనం? భర్త సంసారాన్ని పట్టించుకోనప్పుడు జీవితంమీద విరక్తి చెందక, ఛాలెంజిగా తీసుకుని కష్టపడి రకరకాల పనులు చేసి పిల్లల్ని చదివించి ప్రయోజకుల్ని చేయడంవరకూ కామాక్షి పిల్లల తల్లి పాత్రలో ఆదర్శంగానే వుంది. కానీ పరస్త్రీ వ్యామోహంతో భార్యని, పిల్లల్ని నిర్లక్ష్యం చేసే భర్త కోసం ఎదురుచూస్తూ, వచ్చినప్పుడు అతడు







చేసే దుర్మార్గాన్ని భరిస్తూ వచ్చిన కామాక్షి పాత్ర మనువు ఆదేశాలని ఆదర్శంగా తీసుకున్నదే. పైగా అతగాడొక కళాకారుడనీ, కృష్ణుడి పేరు పెట్టుకున్నందుకు పరస్త్రీలతో తిరగడం ఆదర్శం అయినట్లు సర్దుకుపోవడం మానసిక బానిసత్వానికి నిదర్శనం. ఎప్పుడో బుద్ధిపుట్టినప్పుడు ఇంటికొచ్చిపోతూ జీవితమంతా పరాయిస్త్రీల సాంగత్యంతోనూ, స్థిమితం లేకుండా ఊరూరూ తిరుగుతూనూ గడిపిన రాధాకృష్ణకు చివరిరోజుల్లో భార్య 'రంజని'గా అనిపించడం ఓ వింత? రాధాకృష్ణ పాత్ర చిత్రీకరణ ఉండవలసిన విధంగా లేదు. జమీందారీ వంశీయుడైన తను రోజుల తరబడి కష్టపడి చిత్రించిన చిత్రాలను, ఇంటింటికీ తీసుకెళ్ళి అమ్ముకోవడం ఏమిటి? తను చాలా గొప్పవాడిననీ, కళాకారుడననీ గొప్ప వంశం వాడిననీ విర్రవీగే అతడు వందకూ, రెండొందలకు ఇంటింటికి తిరిగి అమ్ముకోవడం హేతుబద్ధంగా లేదు.

'రంజని' అని కాకుండా 'సర్దుకుపోదాం' అనే టైటిల్ ఈ నవలకు సరిగ్గా అతుకుతుంది.

**–సి. హెచ్. శివరామప్రసాద్,**
హైదరాబాద్-500 072

## మాతృస్వామ్య మాధుర్యం

*(నాలుగవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

రచయిత్రి కళ్యాణిగారు "రంజని" నవలను సృష్టించిన కోణం రెండుసార్లు చదివించేంత బాగుంది.

'అమ్మ' అనే మధురమైన పిలుపుతో ఈ లోకం పులకరించేస్తుంటే కన్నతండ్రే దూరపు బంధువులా ప్రవర్తిస్తుంటే స్త్రీ అబల కాదు సబల అనీ, ఏ పరిస్థితిని ఎలా అనుగుణంగా మలచుకోవాలో, పిల్లల్ని ఎలా తీర్చిదిద్దుకోవాలో ఆమెకు బాగా తెలుసుననే విషయాల్ని నిరూపించారు రచయిత్రి.

పిల్లల్ని కనడంతోనే తమపని అయిపోయిందనుకోకుండా వారిని కంటికి రెప్పలా కాపాడుకొని, ఆదర్శవంతమైన తల్లిలా పెంచి, వారిని వివేకవంతులుగా తీర్చిదిద్దటం చాలా చక్కగా ఉంది.

రచయిత్రి చక్కని ఇతివృత్తాన్ని ఎంచుకొని తమ నైపుణ్యాం చూపారు. పాత్రల రూపకల్పన ఎక్కడా అసహజంగా లేదు. ముఖ్యంగా సుబ్బమ్మగారి పాత్ర, పద్మ, గిరిజ, పండు, నాగమ్మ, ఆనంద్ వంటి వారు... సమకాలీన జీవనశైలికి అద్దంపట్టే పాత్రలు ఈ నవలలో చాలాచోట్ల కన్పించాయి.

రాధాకృష్ణమూర్తిలా వైవాహిక జీవితాన్ని బాధ్యతా రాహిత్యంతో దొర్లించాలనుకునే వారు ఎందరో ఉన్నారు. జీవితం సక్రమంగా సాగిస్తూ కళలను ఎలా వృద్ధి చేసుకోవచ్చో రాధాకృష్ణకు అర్థం అయ్యేసరికి ఆయన వయస్సు ఎదురు తిరగటం నేటి తరం గ్రహించదగ్గ అంశమే!

తల్లిదండ్రులు తమ బిడ్డల భవిష్యత్‌ను నిర్ణయించడంలో వారి ఇష్టాయిష్టాలను కూడా విచారించాలి అన్న అంశాన్ని చక్కగా చెప్పగలిగారు రచయిత్రి.

తమ జీవితాన్ని తామే చక్కబరుచుకోవటంలో ఎంత మాధుర్యం ఉందో వివరించే "రంజని" ఒక ఉత్తమ కథనం గల నవల అనటంలో అతిశయోక్తి లేదు!

**–వేపూరి వేణుగోపాల్,**
మణుగూరు-507 117

## 'మనో'రంజని

*(అయిదవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

స్వతంత్ర భావాలు, స్వేచ్ఛా మనస్తత్వం, గొప్ప గొప్ప ఆశలున్నవారు పెళ్ళి చేసుకున్న తర్వాత తమ పంథా కొంతైనా మార్చుకో



కుండా "లోకమే ఇల్లు" అన్న చందాన ఊళ్లు పట్టుకు తిరిగితే అది వారికేకాకుండా వారి మీద ఆధారపడి జీవించేవారికి కూడా శాపంగా మారుతుందనీ, అదే సమయంలో ఆత్మవిశ్వాసం, కృషి, పట్టుదల ఉన్నవారు తమ జీవితాలను చక్కదద్దుకోవడమే కాకుండా మరికొందరికి ఆశ్రయం కల్పించగలరని భార్యభర్తల ద్వారా విభిన్న కోణాల లోంచి చూపిన తీరు "రంజని" నవలకి ఆయువు పట్టునిచ్చింది.

తల్లిదండ్రులు తమ పిల్లల భవిష్యత్తుకై ఎంతో తపిస్తారు. వారికి విద్యాబుద్ధులతో పాటు చాలా విషయాలలో స్వతంత్రం ఇచ్చి తమమీద ప్రేమాభిమానాలు పెరిగేలా చేస్తారు. కానీ అన్నింటికన్నా ముఖ్యమైన "జీవిత భాగస్వామి ఎంపిక" విషయంలో వారికి స్వాతంత్ర్యం ఇవ్వక శాసిస్తారు. ఈ ఒక్క విషయంలో కూరలో అన్ని దినుసులు వేసినా ఉప్పు మరచిన చందాన తమమీద పిల్లలకున్న గౌరవాన్ని, భయభక్తులను పోగొట్టుకునేలా చేసుకుంటున్నారు. ఈ తీరుగనే కామాక్షి మాటలను పెడచెవిన పెట్టిన తండ్రివలన ఆమె జీవితాంతం అశాంతి, శ్రమలతో జీవించాల్సివచ్చింది.

"నిజాన్ని నిర్భయంగా చెప్పేవారికి ఈ లోకంలో కష్టాలు తప్పవు", "ఆడదానికి ఆడదే శత్రువు" అన్న సామెత కామాక్షి విషయంలో జరగకపోవడం కొంత ఊరట కలిగించే అంశం. తన మంచితనంతో సాటివారిని ఆకట్టుకున్న కామాక్షిలాంటి వారికి "మానవుడు సంఘజీవి. పదిమందికి ఉపయోగపడు, పదిమందిని ఉపయోగించుకో" అన్న విషయంమీద అపారమైన నమ్మకం.

"మా తాతలు నేతులు తాగారు. మా మూతులు వాసన చూడండి" అని గత వైభవాన్ని తలుచుకుంటూ మూఢనమ్మకాలను పట్టుకు వేలాడే రాధాక్రిష్ణమూర్తిలాంటివారు వాస్తవాలను మరచి భవిష్యత్తును రంగుల రాట్నంగా ఊహించుకుని కష్టాలను కొని తెచ్చుకోవడమే కాకుండా దానివలన నేలవిడిచి సాము చేసిన చందాన నడ్డి విరగగొట్టుకుంటారనీ, సాధించేది ఏమీ ఉండదనీ రచయిత్రి వివరించిన వైనం శ్లాఘనీయం. అలాంటివారు తమ బాధ్యతలను మరచిపోవడమే కాకుండా తమ స్థానాన్ని నిలుపుకునేందుకు హక్కులను, అధికారాన్ని చలాయిస్తారని, ఎదుటివారి అభిప్రాయాలకు విలువివ్వకుండా వారిని చులకన చేసి మాట్లాడతారని, తమ అభిప్రాయాలను ఎదుటివారిపై బలవంతంగానైనా రుద్దడానికి ప్రయత్నిస్తారని చెప్పిన తీరు బావుంది.

భారత స్త్రీమూర్తి మన సంప్రదాయాలకు, సంస్కృతికి విలువనిచ్చి "పతియే ప్రత్యక్ష దైవ"మని నమ్మి అతడెన్ని కష్టాలు పెట్టినా భరిస్తుంది. కాని ఆ స్త్రీమూర్తే ఒక తల్లిగా తన పిల్లల విషయంలో తనకు జరిగిన అన్యాయమే జరుగుతుందని భయపడినప్పుడు తన పతినే ఎదిరించటమేకాక వారి బంగారు భవిష్యత్తుకై ఆటంకం కలగకుండా చేసే ప్రయత్నంలో అవసరమైతే తన ప్రాణాలనైనా త్యజించి "అమ్మ" స్థానాన్నికున్న విలువను చాటిచెప్తుంది. అటువంటి మహోన్నత విలువగల భారత స్త్రీమూర్తి స్థానాన్ని కామాక్షి భర్తీ చేశారు. తన పిల్లల విషయంలో "తీగ చెట్టుకు బరువా" అని ఊరికే చెప్పటంకాక చేసి చూపిన వైనం కంట తడిపెట్టిస్తుంది.

నవల ఆద్యంతం ఆసక్తికరంగా, చదువుతున్నంతసేపూ మనసును రంజింపజేసే దిశలో సాగింది. ఒక మంచి నవల చదివామన్న ఆనందాన్ని మిగిల్చింది. ఏదేమైనా 'కష్టేఫలి', 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న శ్రమ జీవన సౌందర్యపు మధురిమలను కొత్త కోణంలో గుబాళింపజేసిన రచయిత్రి, ఆ సువాసనలు మేము ఆస్వాదించేలా చేసిన 'చతురవారు' అభినందనీయులు.

—యం. చినవెంకటరావు,
మహాదేవపురం-507 203.




# ఏరిన ముత్యాలు

★ సర్వేజనా సుఖినోభవంతు అని ప్రార్థించండి. మనకు ఏది మంచిదో భగవంతుడికి బాగా తెలుసు.

-సోక్రటీసు

★ మనకు తెలియని విషయాల గురించి తెలిసినట్లు నటించడం సిగ్గుపడవలసిన విషయం.

-లియోటాల్‌స్టాయ్

★ ఏ పాళ్లలో మనుషులు ఆధ్యాత్మిక శక్తి కలిగివుంటారో! అదేవిధంగా వారు ప్రపంచంలో దృఢంగా వుంటారు.

-ఎ. మెకంజి

★ ఒక మంచి మనిషి జీవితంలోని ఉత్తమమైన భాగం దయతో, ప్రేమతో తను చేసి మరచిపోయిన చిన్న పనులే.

-వర్డ్స్‌వర్త్

★ ప్రపంచశాంతిని, తమ షరతుల ప్రకారం ఆశించే దేశాలే యుద్ధబీజాలను నాటుతున్నాయి.

-బ్రౌన్

★ జీవించడం అన్నది ముఖ్యం కాదు. ఈ కొద్దిజీవితంలో మనం ఏమి చేశామన్నది ముఖ్యం.

-నెహ్రూ

★ ఐకమత్యంలేని బహుసంఖ్యాకులకు వ్యతిరేకంగా అల్పసంఖ్యాకులు కలిసికట్టుగా పనిచేస్తారు కాబట్టే రాజకీయ యంత్రాంగం గెలుస్తుంది.

-విల్‌డ్యురాంట్

★ నీ తప్పును ఒప్పుకోవడంవలన నిన్నటికంటే నేడు నీవు వివేకవంతుడవని తెలుస్తుంద.

-నెపోలియన్

★ ఎక్కువగా నమ్మడంవలన మోసపోవచ్చుకానీ అసలు నమ్మకమే లేకుండా బతకడం దుర్భరం.

-క్రేన్

★ పనిచేయనివాడికి తినే హక్కు లేదు.

-న్యూటెస్ట్‌మెంట్

★ మనలను మనం జయించగలగడం మాత్రమే చిరకాలం నిలుస్తుంది. ఈ విజయం ఎలాంటి విచారాన్ని కలిగించదు.

-నెపోలియన్

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతుర

డిసెంబర్ : 2000
సంపుటి : 23
సంచిక : 11

క్షణక్షణం తాను మృత్యువును సమీపిస్తున్నట్టు తెలుసుకున్న అతను భార్య, కూతురుపట్ల తనకున్న బాధ్యతల్ని, చేయవలసి వున్న విధులనూ నిర్వర్తిస్తున్నాడు. సన్నిహితులందరి గుండెలనూ మెలిపెడుతోందతని ప్రవర్తన.

**ఒరోజు తన ప్రాణమిత్రులొకరి చేతిలో ఓ కాగితం వుంచగా... అది చూసి చలించిపోయాడతను... ఏమిటది?**

వయసు తక్కువే అయినా మృత్యువు అతి త్వరలోనే తనను సమీపిస్తోందన్న నిజం తెలిసిన మనిషి మనసుకు, అతని భార్యాపిల్లల హృదయావేదనకు అక్షరాకృతి. మందపాటి సత్యం రచన

## 'చీకటిలో చందమామ'

ఈ నెల చతుర సమగ్ర నవల.



సమయం రాత్రి ఎనిమిది గంటలు.

కారుని డ్రైవ్ వేలో పార్క్ చేసి, అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టాడు ప్రకాష్.

ఫోన్‌లో మాట్లాడుతున్న కమల "ఉండు సరోజా! ప్రకాష్ యిప్పుడే ఆఫీస్‌నించి వచ్చాడు. అతనితో మాట్లాడుదువుగాని" అంటూ ప్రకాష్‌కి ఫోన్ అందించింది.

ఫోన్ అందిస్తూ "సరోజ లైన్లో వుంది. రాజుగారు యివాళే వచ్చారుట ఇండియా నించి. ఆయనకు వంట్లో బాగాలేదుట" అంది.

ప్రకాష్ ఫోన్ అందుకున్నాడు.

సరోజ చెబుతున్నది "రాజు ఇవాళ మధ్యాహ్నం వచ్చాడు ఇండియానించి. అక్కడ ఏం తిన్నాడో ఏమో పది రోజుల నించీ తిన్నదంతా బయటకు వచ్చేస్తున్న దిట. ప్రయాణం కూడా చేయలేని పరిస్థి తిలో వచ్చాడిక్కడికి. ముందు ప్రయాణం యింకో వారం రోజులకు వాయిదా వేద్దామ నుకున్నాడు కానీ, శెలవులేక వచ్చేశాడు. రాగానే నీరసంగా మంచంమీద పడిపో యాడు. మంచి నిద్రలో వున్నాడు. బాగా చిక్కిపోయాడు కూడాను"

ప్రకాష్ అన్నాడు "గాబరాపడకు సరోజా! చాలా సంవత్సరాల తర్వాత, మనం అమెరి కానించి ఇండియా వెళ్ళటంవలన, అక్కడ మనవాళ్ళు ఆప్యాయంగా ఎన్నో వంటలు చేస్తారు. మనమూ కాదనలేకా, అక్కడ మనకు వేరే ఏమీ పనిలేక పోవటంవలనా, మనకు కావలసినవాళ్ళ చేతివంట యిక్కడ మిస్సవుతాము కనుకా, కొంచెం ఎక్కువగానే తినేస్తాం. కడుపు అప్‌సెట్ అవటం సహ జమే"

"అది కాదు ప్రకాష్! ఆయన చెప్పింది వింటే, అంతకన్నా వేరే ఏదో అయివుండాల నిపిస్తోంది. పది రోజులనించి అసలు ఆహా రమే లేదు. బాగా నీరసపడిపోయాడు"

"ఒక పనిచేయి సరోజా- ఎట్లాగో పడుకు న్నాడు కనుక యింక నిద్రలేపకు. ఇరవై మూడు గంటల విమానప్రయాణం ఎంతటి వాడినైనా డీలాపరుస్తుంది. రాత్రి ఏదయినా అవసరం అయితే ఫోన్ చేయి. వెంటనే వస్తాను. లేకపోతే రేపు పొద్దున్నే రాజుతో మాట్లాడుతాను. అవసరమయితే డాక్టర్ని చూద్దాం" అన్నాడు ప్రకాష్.

సరోజకు ప్రకాష్ చెప్పింది సబబుగానే అనిపించింది.

"మీకోసమని పూతరేకులూ, త్రివేణి వక్క పొడి కూడా తెచ్చాడు" అన్నది సరోజ.

ప్రకాష్ నవ్వాడు. "రేపు వస్తాం కదా... అప్పుడు తీసుకుంటాం. వంట్లో బాగాలేకపో యినా, మమ్మల్ని గుర్తుపెట్టుకుని అవి తెచ్చి నందుకు థ్యాంక్స్ చెప్పు" అని ఫోన్ పెట్టే శాడు.

కమల అంది "రాజు ఇండియానించి ఈ దేశంవచ్చిన తర్వాత, మళ్ళీ ఇండియాకి యిప్పుడేట వెళ్ళటం"

"అవును అతను అమెరికాకు వచ్చి, కాలి ఫోర్నియాలో ఇంజనీరింగ్‌లో మాష్టర్స్ డిగ్రీ చేసి ఉద్యోగంలో చేరాడు. వాళ్ళు గ్రీన్ కార్డుకి స్పాన్సర్ చేయటం, తర్వాత రెండే ళ్ళకి కానీ అది రాకపోవటం, గ్రీన్‌కార్డు వచ్చాక కూడా ఆఫీస్ పనితో అతనికి ఇండి యాకి వెళ్ళటం కుదరలేదు. ఎనిమిదేళ్ళ తర్వాత యిప్పుడు వెళ్ళివచ్చాడు. వెళ్ళేముం దర నాతో చాలా సార్లు అన్నాడు- ఎన్నో సంవత్సరాల తర్వాత వెడుతున్నాను. మన దేశం, కాలేజి, ఊరు ఎంత మారిపోయిందో అని. కాకినాడ ఇంజనీరింగ్ కాలేజీకి కూడా వెళ్ళివస్తానన్నాడు. అఫ్‌కోర్స్... మాకు తెలి సిన వాళ్ళెవరూ, యిప్పుడు అక్కడ వుంటా రని అనుకోను. మేము ఆ కాలేజీ వదిలి ఇరవైమూడు సంవత్సరాలయింది మరి"

ప్రకాష్, రాజు కాకినాడలో ఇంజనీరింగ్ కలిసి చదువుకున్నారు. తర్వాత ప్రకాష్ త్రివేండ్రంలోను, రాజు హైద్రాబాద్‌లోనూ వేరే ఉద్యోగాలలో వుండటంవలన, మళ్ళీ కలవలేదు.




ప్రకాష్ అమెరికా వచ్చి, టెక్సాస్ రాష్ట్రంలోని డల్లాస్‌లో నివాసం ఏర్పరుచుకున్న తర్వాత, అక్కడ హఠాత్తుగా ఎదురయాడు రాజు. తనూ డల్లాస్‌లోనే ఒక హైటెక్ కంపెనీలో, ఉద్యోగంలో చేరినట్టు చెప్పాడు. ఎన్నో సంవత్సరాల తర్వాత, ఎన్నో వేల మైళ్ళ దూరంలో, దేశంకాని దేశంలో, పాత మిత్రులు మళ్ళీ కలవటంలాటి సంఘటనలు చాలా విచిత్రంగా జరుగుతాయి.

ఒకసారి ప్రకాష్ కాలిఫోర్నియాలోని శాంటాక్లారాలో "పసంద్" రెస్టారెంట్లో ఉల్లిపాయ ఊతప్పం తింటున్నప్పుడు కలిశాడు సుందర్‌ని. అతను కూడా ప్రకాష్ పనిచేసే కంపెనీలోనే కాలిఫోర్నియా హెడ్‌క్వార్టర్స్‌లో పనిచేస్తున్నాడు. మాటల్లో తెలిసింది, ఇరవై తొమ్మిది సంవత్సరాలక్రితం గుంటూరు హిందూకాలేజీలో యిద్దరూ కలిసి చదువుకున్నారని. ఆనాటి సంఘటనలు గుర్తుతెచ్చుకుని మురిసిపోవటమే కాకుండా, ఆ స్నేహాన్ని మళ్ళీ కొనసాగించారు. ఇలాటి సంఘటనలు జరిగినప్పుడే, ఇక్కడ అమెరికాలో అంటుంటారు ఇటీజ్ ఎ స్మాల్ వరల్డ్ అని.

కమల అంది "రేపు సాయంత్రం నువ్వు ఆఫీస్‌నించి రాగానే వాళ్ళింటికి వెడదాం. నా వర్క్ కూడా రేపు మూడున్నరకు అయిపోతుంది"

ప్రకాష్ తలవూపి, డైనింగ్ టేబుల్ ముందర కూర్చున్నాడు.

మర్నాడు ఆఫీసునించే రాజుకి ఫోన్ చేశాడు ప్రకాష్. అప్పుడే డాక్టర్ దగ్గరకు వెళ్ళబోతున్నారు రాజు, సరోజ.

రాజు గొంతు కొంచెం నీరసంగా వున్నా, సరోజా పిల్లలూ దగ్గర వుండటంతో, అతని మాటల్లో ఉత్సాహం తెలుస్తూనే వుంది.

"సాయంత్రం తప్పకుండా రండి. రేపూ ఎల్లుండీ శెలవేకదా, ఇండియా కబుర్లు చెబుతాను. అంతేకాదు, నీకు ఇండియానించి త్రివేణి వక్కపొడి పొట్లాలు కూడా తెచ్చాను" అన్నాడు రాజు కవ్విస్తూ. రాజుకి తెలుసు ప్రకాష్ వక్కపొడికోసం ఎంతదూరమైనా వస్తాడని.

ఆరోజు శుక్రవారం అవటం వలన, ఆఫీసు పనిలో కొంచెం నెమ్మది కనిపిస్తున్నది. లేకపోతే, ఆసరికే ప్రకాష్ ఊపిరి ఆడకుండా నిండా మునిగి వుండేవాడు.

మధ్యాహ్నం కమల తను పనిచేసే స్కూలు నుంచి ఫోన్ చేసింది.

"సరోజ, రాజు డాక్టర్ని చూశారుట. ఆయన చాలా టెస్టులు ప్రిస్క్రైబ్ చేశాట్ట. ఇంకా రిజల్ట్స్ ఏవీ రాలేదుట. సాయంత్రం వెళ్ళినప్పుడు వివరాలు తెలుస్తాయేమో. రాత్రికి భోజనాలు అక్కడే అంది సరోజ. నేను యింకో గంటలో ఇంటికి వెడుతున్నాను" అన్నది కమల. కమల అక్కడ హైస్కూల్లో టీచర్‌గా పనిచేస్తుంది.

★ ★ ★

ఆరోజు సాయంత్రం ప్రకాష్, కమల, వాళ్లమ్మాయి అరవింద, రాజు వాళ్ళ యింటికి వెళ్ళేసరికి చీకటిపడింది. రాజు ఇంటికీ, ప్రకాష్ ఇంటికీ ముప్ఫయి మైళ్ళ దూరం వుంది. అయినా వెళ్ళేది హైవేలోనే కాబట్టి, అరగంటలో వెళ్ళవచ్చు.

వెడుతూనే "ఎలా వుంది మీ భారతదేశ యాత్ర. మీ వాళ్ళందర్నీ కలిశారా? " అడిగింది కమల, రాజుని.

"ఏమన్నాడు డాక్టర్... గుండులాగా వున్నావ్, నీకేం ఢోకాలేదన్నాడా? " అడిగాడు ప్రకాష్.

"ముందు కూర్చోండి. అన్నీ తీరిగ్గా మాట్లాడుకుందాం" అంది సరోజ నవ్వుతూ.

వాళ్ళమ్మాయి వినీత, పదేళ్ళ పిల్ల, తండ్రి పక్కనే కూర్చుని, ఆయన భుజంమీద తల పెట్టుకుని కూర్చుంది.

"హాయ్! వినూ... మీ నాన్నమీద బెంగ పెట్టుకున్నావా? " అడిగింది కమల.

"అవును కమలా- వాళ్ళ నాన్న ఇండియా వెళ్ళింది మూడువారాల శెలవుమీద. ఆ

# కారులో షాపింగ్




సూపర్ మార్కెట్‌కి వెళ్ళడం చైనాలో శ్రమకాదు. సరదా పని అది. షెన్లాంగ్ అనే ఓ సూపర్ మార్కెట్‌లో నడిచి తిరగక్కర్లేదు. ఎలక్ట్రిసిటీతో నడిచే ఓ బండిలో కూర్చుని కారు నడిపినట్లే డ్రయివ్ చేసుకుంటూ సరుకుల మధ్య నుంచి వెళ్ళి, చెయ్యి చాపితే అందే సరుకులని ఆ బండిలోనే వేసుకొని వెళ్ళి వాటి ధర చెల్లించవచ్చు. కాలితో బ్రేక్ వేసి నొక్కి వుంచితే బండి ఆగుతుంది. డ్రయివింగ్ వీలే ఉండదు కాబట్టి చేతులు ఫ్రీ గా వుంటాయి. చైనాలోని హాంగ్‌కాంగ్‌లో ఈ 'ఎలక్ట్రిక్ కార్ట్' లను ఇటీవలే ప్రవేశపెట్టారు షెన్లాంగ్ సూపర్ మార్కెట్లో.

కాస్తకే వినూ ఆయనకోసం దిగులు పడింది. అంతే కాదు, రాజు కూడా దాని కోసం దిగులుపడ్డాడు" అన్నది సరోజ.

"అవును- కూతురిని వదలి వుండటం అలవాటు లేదుగా మరి. మా ఆయనా అంతేలే" అన్నది కమల ప్రకాష్‌వేపు నవ్వుతూ చూస్తూ.

"ఇంతకీ డాక్టర్ ఏమన్నాడు? " అడిగాడు ప్రకాష్.

రాజు అన్నాడు "డాక్టర్ యిందాక ఫోన్ చేసి చెప్పాడు. ఇండియాలో ఏదో ఫుడ్ పాయిజనింగ్ అయివుండాలి, అంతకన్నా వేరే ఏంలేదు అని. ఫార్మసీని పిలిచి ఏవో మాత్రలు యివ్వమని ప్రిస్క్రైబ్ చేశాడు కూడాను"

"నేనూ అదే అనుకున్నాను. మనమిక్కడ, ఈ శుభ్రమైన నీళ్ళకి, తిండికీ అలవాటుపడే సరికి, మన ఇమ్యూనిటీ సిస్టమ్ చాలా సెన్సి టివ్‌గా తయారవుతుంది. ఇండియా వెళ్ళిన ప్పుడు యింట్లో శుభ్రంగా చేసుకున్న వేడివేడి భోజనం, వేడిచేసి చల్లార్చి ఫిల్టర్ చేసిన మంచినీళ్ళు తాగితే తప్ప బయట హోటల్ తిళ్ళకి మన శరీరాలు తట్టుకోలేవు" అంది కమల.

"పోయినసారి నేను గుంటూరు వెళ్ళిన ప్పుడు అదే జరిగింది. గుంటూరు బ్రాడీ పేట సెంటర్‌లో రోడ్డుమీద సాయంత్రం మిరపకాయ బజ్జీలు తినటం చిన్నప్పటి నించీ అలవాటు మాకు. పోయినసారి అక్క డికి వెళ్ళినప్పుడు, చిన్ననాటి ప్రియమిత్రులు రంగ, నరసింహారావ్‌లు అక్కడకు వెళ్ళి, అలవాటుప్రకారం బజ్జీలు తిందామంటారు. నా మనసు వద్దని చెబుతున్నా, మధురస్మృ తులు మొహమాట పెడుతుంటే కాదనలేక తిన్నాను. తర్వాత మూడు రోజులు 'బయట' వుండవలసి వచ్చింది" అన్నాడు ప్రకాష్ నవ్వుతూ.

రాజు, సరోజ, కమల కూడా పెద్దగా నవ్వారు.

వినీత, అరవింద మేడమీదకు వెళ్ళారు కంప్యూటర్ గేమ్స్ ఆడుకోటానికి.

రాజు యిందాక కమల అడిగిన ప్రశ్నకు జవాబు చెబుతున్నాడు.

"నా ఇండియా ప్రయాణం చాలా బాగా అయిందండి. కాకినాడ, మావూరు, విజయ వాడ, హైద్రాబాద్ వెళ్ళాను. చాలా మంది చుట్టాల్ని, స్నేహితుల్నీ కలిశాను. అఫ్‌కోర్స్, అందర్నీ చూడటం మూడువారాల్లో కుదరద నుకోండి!"

"ఇంజనీరింగ్ కాలేజీకి వెళ్ళావా? " అడి గాడు ప్రకాష్.

"వెళ్లాను కానీ, మనకు తెలిసిన వాళ్ళె వరూ లేరు. ఊరికే వెళ్ళి చూసొచ్చానంతే. బిలీవిట్ ఆర్ నాట్! అప్పటికీ, యిప్పటికీ అలానే వుంది. లాబ్స్‌లో ఇక్కడిలాగా లేటెస్ట్ టెక్నాలజీలు, ఎక్విప్‌మెంట్లూ ఏమీ కనపడలేదు. కనీసం బిల్డింగ్స్‌కి సున్నం కూడా కొట్టటంలేదు. మరి ఫండ్సన్నీ ఎక్క డికి పోతున్నాయో"

"ఆ విషయాలు మీరిద్దరూ తర్వాత మాట్లాడుకోండి. ముందు మీ ఆరోగ్యం గురించి చెప్పండి? " అడిగింది కమల.

రాజు అన్నాడు "నేను వెళ్ళినప్పటినించీ ఆహార విషయంలో చాలా జాగ్రత్తగా వున్నాను. కాచి వడబోసిన నీళ్ళు తాగటం, హోటల్ తిండి తినకుండా జాగ్రత్తపడటం లాటివి చేశాను. వెళ్ళిన వారంరోజులకు హఠాత్తుగా మొదలయింది. ఏమి తిన్నా వెంటనే బయటకు వెళ్ళిపోవటం. పూర్తిగా నీరసపడిపోవటం లాటివి. డాక్టర్‌కి చూపిస్తే, చాలా పరీక్షలు చేశాడు కానీ, ఆయనకు ఏమీ అర్థంకాలేదు. పూర్తి లిక్విడ్ డైట్ మీదనే వున్నాను యిన్నిరోజులూ. కాక పోతే మనవాళ్ళ మధ్య వున్నామన్న ఉత్సా హంవల్ల, ఆ పదిరోజులూ గడిచిపోయాయి"

రాజు బాగా బరువు తగ్గిపోయాడు. మనసు ఉత్సాహం చూపిస్తున్నా చేతల్లో, మాటల్లో నీరసం కనిపిస్తూనే వుంది.

"రేపూ ఎల్లుండీ. శని ఆదివారాల వలన శెలవులు కదా' ఇక్కడి డాక్టర్ సోమవారం ఫోన్ చేస్తానన్నాడు. అప్పటికి టెస్ట్ రిపోర్టులు కూడా వస్తాయిట. సోమవారం నించీ ఆఫీసుకి వెళ్ళగలిగితే చాలు"

"సరోజ వుంది కదా... మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకుంటుంది లెండి" అన్నది కమల నవ్వుతూ.

రాజుని ఎక్కువగా మాట్లాడనీయకుండా ఆ సాయంత్రం అందరూ ఆనందంగా గడిపారు. జెట్ లాగ్ వల్లా అనారోగ్యంవల్లా, మధ్యలో రాజు-సోఫాలో వెనక్కివాలి నిద్రపోయాడు కూడాను.

★ ★ ★

సోమవారం పొద్దున్నే రాజు ఆఫీస్‌కి వెళ్ళాడు. అక్కడ అందరూ అతను తిరిగి వచ్చినందుకు సంతోషం, అతని అనారోగ్యానికి విచారం వెలిబుచ్చారు. కానీ, రాజు అక్కడ ఎక్కువసేపు కూర్చోలేకపోయాడు. మేనేజర్ డానీ బేకర్‌కి చెప్పి మధ్యలోనే ఇంటికి వచ్చేశాడు.

ఆరోజు మధ్యాహ్నం, డాక్టర్ ఫోన్ చేశాడు. అన్ని పరీక్షల రిజల్ట్స్ వచ్చాయనీ, అంతా మామూలుగానే వుందనీ చెప్పి, ఏవో టాబ్ లెట్స్ రాసిచ్చాడు.

★ ★ ★

రెండు రోజుల తర్వాత ప్రకాష్ ఆఫీస్‌కి సరోజ ఫోన్‌చేసింది. రాజుకి కడుపునొప్పి బాగా ఎక్కువయిందనీ, వెంటనే హాస్పిటల్‌లో చేర్చారనీ చెప్పింది. అక్కడ రెండు సీసాలు డ్రిప్ యిచ్చి ఇంటికి పంపించేశారనీ, గాస్ట్రో ఎంటరాలజిస్ట్‌కి రిఫర్ చేశారనీ, ఆయన్ని మర్నాడు కలవబోతున్నాం' అనీ చెప్పింది.

ప్రకాష్ అడిగాడు "నేను రానా యిప్పుడు. రేపు శెలవు పెట్టి వచ్చేదా డాక్టర్‌ని చూట్టానికి"

సరోజ నవ్వింది. "ఇంతమాత్రం దానికి శెలవెందుకు. మేము మేనేజ్ చేస్తాంలెండి" అంది.

"రాజుని డ్రైవ్ చేయనీయకు... అసలే నీరసంగా ఉన్నాడు" హెచ్చరించాడు ప్రకాష్.



మర్నాడు సాయంత్రం కమల, ప్రకాష్ రాజు వాళ్ళింటికి వెళ్ళేసరికి రాత్రి ఏడున్నర గంటలయింది.

ఎండాకాలం అవటంవలన రాత్రి తొమ్మిది గంటలదాకా వెలుతురు వుంటుంది. జెఫర్‌సన్ అమెరికా ప్రెసిడెంట్‌గా వున్న రోజుల్లో డేలైట్ సేవింగ్ టైమ్ అని ఒక పథకం ప్రవేశపెట్టాడు. ఏప్రిల్‌లో "స్ప్రింగ్ ఫార్వర్డ్" అని పగటి సమయాన్ని ఒకగంట ఆదా చేస్తారు. అంటే మామూలుగా పొద్దున్న ఆరుగంటల సమయం దీనివల్ల ఏడు గంటలవుతుందన్నమాట. అలాగే అక్టోబర్‌లో "సాల్ బాక్" అని ఒకగంట వెనక్కి వెడతారు. అంటే పొద్దున్న ఏడు గంటలనీ మళ్ళీ ఆరు గంటలు చేస్తారు. ఇది మొదట్లో కొంచెం గందరగోళంగా వుంటుందికానీ, తర్వాత అలవాటయిపోతుంది. దీనివల్ల లాభం ఏమిటంటే పొద్దున్న నిద్రపోయే సమయంలో, పగటి వెలుతురు వృధాకాదు. అది సాయంత్రం సమయంలో, వెలుతు




రులో ఎన్నో పనులు చేసుకొనటానికి, ఉత్పత్తి పెంచటానికి పనికొస్తుంది. ఇంటి దగ్గర కూడా రాత్రి తొమ్మిదిదాకా వెలుతురు వుండటంవలన తోటపని, ఇంటి బయట పనులు చేసుకోటానికి, అవుడ్డోర్ గేమ్స్ ఆడుకోటానికి ఉపయోగపడుతుంది.

కమల, ప్రకాష్ కారు దిగేసరికి ఇంటి ముందర గులాబి మొక్కలకు నీళ్లు పోస్తున్న రాజు కనపడ్డాడు.

నవ్వుతూ ఎదురు వచ్చాడు.

"ఎలా వున్నారు? " అడిగింది కమల.

"ఫరవాలేదు... బాగానే వున్నట్టు వుంటుంది. అంతలోనే భరించలేని కడుపు నొప్పి. మాత్రలు వేసుకున్నాక మళ్ళీ బాగానే వుంటుంది. పగలు పడుకునే అలవాటు లేక పోవటంతో, ఏమీ తోచక పరమబోర్ కొడు తున్నది. అందుకే కాస్త తెరిపిగా వుందికదా అని మొక్కలకు నీళ్లు పోస్తున్నాను" అన్నాడు రాజు.

"అదీ మంచిదేలే. బయట చల్లగాలి హాయిగా వుంది. మనస్సును ఉల్లాసపరు స్తుంది!" అన్నాడు ప్రకాష్.

"ఇవాళ ఆఫీస్‌కి వెళ్ళావా? " అడిగాడు ప్రకాష్, ఇంట్లోకి వచ్చాక సోఫాలో కూర్చుంటూ.

"పొద్దున్న వెళ్లివచ్చాను. మా ప్రాజెక్ట్ పూర్తిచేయాల్సిన రోజుని బాగా ముందుకు నెట్టారు. దానితో పని ఎక్కువయింది. అదృ ష్టవశాత్తు మా టీమ్‌లో హేమాహేమీలు వున్నారు. చకచకా పని చేసుకుపోతారు. పాపం మా మేనేజరు డానీ, రోజూ రాత్రి

తొమ్మిది గంటలదాకా అక్కడే వుంటున్నాడు"

"అదెప్పుడూ వుండేదేలెండి ఆరోగ్యం ముఖ్యం. ఆఫీసుకి వెళ్ళవద్దు అంటే వినటం లేదు" అన్నది సరోజ.

సరోజకు తెలుసు అమెరికాలో సరిగ్గా ఉద్యోగానికి వెళ్ళకపోతే కొంపలంటుకుపోతాయని. హడావిడి జీవితం. అనుకున్న సమయానికి, ప్రొడక్టులు రిలీజ్ చేయటంవలన కంపెనీలకు లాభాలు పెరుగుతాయి. అప్పుడే అందరికీ ఉద్యోగాలు వుండేది, జీతాలు పెరిగేది. ప్రాజెక్టులు ఆలస్యం అవటంవలన ఈ కంపెనీకి పోటీగా వుండే కంపెనీలు, ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని, తమ ప్రొడక్ట్‌ని ముందుగా మార్కెట్‌లోకి తీసుకువస్తారు. ఈ పోటీల్లో ఒకళ్ళ ధాటికి ఒకళ్ళు తట్టుకోలేక కొన్ని కంపెనీలు నష్టపోతాయి. కొన్ని కంపెనీలు మూతపడతాయి కూడాను. అందుకే ప్రతి ఉద్యోగికీ ఒక పెర్‌ఫార్మెన్స్ ప్లాన్ తయారు చేసి, సంవత్సరం అవగానే, ఆ ప్లాన్ ప్రకారం ఎంత ఉత్పత్తి జరిగింది అని ఆ ఉద్యోగస్తుడి పనిని చూసి, అతని జీతం పెంచటమో, ప్రమోషన్ ఇవ్వటమో, ఇంటికి పంపించటమో చేస్తారు. అందుకే కొంచెం జాగ్రత్తగా వుండటం అవసరం.

రాజు అన్నాడు, "ఏదన్నా అవసరమయితే, ఫోన్‌లో ఆఫీస్ వాళ్ళతో మాట్లాడుతున్నాలే! మా మేనేజర్‌తో మాట్లాడాను కూడాను. డానీ చాలా మంచివాడు. బాగా సహాయం చేస్తున్నాడు"

"ఇంతకీ మీ గాస్ట్రో ఎంటరాలజిస్టు ఏమంటాడు? " అడిగాడు ప్రకాష్.

నవ్వాడు రాజు. "ఆయనకీ ఏమీ అంతు పట్టినట్టు లేదు. ఏవో టెస్టులు చేస్తున్నాడు. ఆహారంలో నియమాలు పెట్టాడు. ఇప్పుడు బాగానే వున్నట్టుంది... చూద్దాం... ఒక వారం రోజుల్లో అంతా సర్దుకోవాలి"

"ఆ డాక్టర్ని చూడగానే, ఇంకా ట్రీట్‌మెంట్ మొదలు పెట్టకపోయినా... అంతా తగ్గినట్టుగా వుంది రాజుకి. చేతి చలవ అంటే ఇదేనేమో..." అంది సరోజ నవ్వుతూ.

వినీత వచ్చి రాజు ఒడిలో పడుకుంది.

"హవ్వార్యూ... హనీ" అడిగింది కమల.

"ఫైన్" అంది వినీత కళ్ళు మూసుకునే.

"ఇవాళ అరవింద మాతో రాలేదు. మా పక్కింటివాళ్ళమ్మాయి సమంతాతో ఆడుకుంటానని వాళ్ళింటికి వెళ్లింది. వాళ్లమ్మ లిండా మిల్లర్‌కి కూడా అరవింద అంటే ఇష్టం" అంది కమల.

"మీరు మాతో కలిసి భోజనం చేస్తారా? " అడిగింది సరోజ.

"మళ్లీనా... నేను రెడీ!" అన్నాడు ప్రకాష్.

"సిగ్గులేకపోతే సరి... మనం డిన్నర్ తిని ఇంకా ఒకగంట కూడా కాలేదు" కమల నవ్వుతూనే విసుక్కుంది ప్రకాష్‌ని.

"ప్రకాష్‌కి మళ్ళీ ఆకలేస్తున్నదేమో" అంది సరోజ.

"లేదు సరోజా. మేము అన్నం తినే బయల్దేరాం. మా ఆయనకి ఇండియన్ తిండి కావాలి కానీ, అమెరికన్ టైమింగ్స్‌లో. అంటే డిన్నర్ సాయంత్రం అయిదున్నర, ఆరు గంటలకల్లా అయిపోవాలి. ఆఫీస్‌నించి సరాసరి డైనింగ్ టేబుల్ దగ్గరికి ఆవురావురుమంటూ వెళ్తాడు. ఒక్క క్షణం ఆలస్యమైనా ఆగలేడు. అందుకే సుబ్బరంగా తినేసి వచ్చాం. మీరు తింటూ వుండండి. మా ఆయన కబుర్లు చెబుతుంటాడు" అంది కమల.

"కాసేపట్లో సుధ, సురేష్‌లు డిన్నర్ తినేసి వస్తామని ఫోన్ చేశారు" అంటూనే సరోజ ఒక బౌల్‌లో కొంచెం పలుచగా సాంబారు అన్నం కలిపి, దాంట్లోనే కొంచెం కూరవేసి ఇచ్చింది రాజుకి.

"మంచి తెలుగు సినిమాలు ఏమైనా చూశావా భారతదేశంలో? " అడిగాడు

ప్రకాష్.

"లేదు... టైమ్ దొరకలేదు" అన్నాడు రాజు.

"ఆయనకు అసలే ఆరోగ్యం బాగా లేక పోతే, సినిమాలు ఎలా చూస్తారు. అన్నీ అర్థంలేని ప్రశ్నలడుగుతావు" నవ్వుతూనే నాలుగూ పెట్టింది కమల.

"నాకిష్టమైన పుస్తకాలు మాత్రం తెచ్చుకు న్నాను. నాకు బాగా నచ్చిన పుస్తకాలు, గోపీ చంద్ అసమర్థుని జీవయాత్ర, బుచ్చిబాబు చివరకు మిగిలేది దొరికాయి కానీ, రావిశాస్త్రి అల్పజీవి దొరకలేదు. ఈసారి వెళ్లినప్పుడు వైజాగ్‌లో వెతికి తెచ్చుకోవాలి" అన్నాడు రాజు.

"కాకినాడ బాగా మారిపోయిందా? 1966 తర్వాత మళ్ళీ చూడలేదు" అన్నాడు ప్రకాష్.

"నువ్వు ఇప్పుడు కాకినాడ చూస్తే నమ్మ లేవు. భానుగుడి దగ్గర పెద్ద బిజీ సెంటర్ అయిపోయింది. ఊరు చాలా మారిపో యింది. మారనిదల్లా ఒక్క ఇంజనీరింగ్ కాలేజి బిల్డింగులు..."

"ఇప్పుడెవరు కాలేజి ప్రిన్సిపాల్..?"

ప్రకాష్, రాజు కాలేజికి సంబంధించిన మాటల్లోపడి, తేరుకునేసరికి, వాళ్ళ భోజ నాలు అయిపోయాయి. సరోజ గిన్నెలు సర్దుతున్నది.

కమల సరోజకు సహాయం చేస్తూ, "నీ చదువెంతవరకు వచ్చింది?" అని అడిగింది.

సరోజ ఒరాకిల్ ప్రోగ్రామింగ్ క్లాసులు తీసుకుంటున్నది.

"ఇంకో సంవత్సరంలో బయట పడదాం అంటున్నది ఒరాకిల్" అంది నవ్వుతూ.

అప్పుడే వచ్చారు సుధ, సురేష్. వాళ్ళు వుండేది అక్కడే, రెండు సందుల అవతల. సుధ యూనివర్సిటీ ఆఫ్ టెక్సాస్‌లో, సైకాల జిలో పి. హెచ్. డి. చేస్తున్నది. ఆమె భర్త సురేష్, డాక్టర్. ప్రైవేట్ ప్రాక్టీస్ వుంది. గైనకాలజీలో మంచి డాక్టరుగా పేరు సంపా దించాడు. ఇండియాలో వాళ్ళది బెంగు ళూరు. మాతృభాష కన్నడమైనా, తెలుగు బాగా అర్థమవుతుంది. కొంచెం నెమ్మదిగా మాట్లాడగలరు కూడాను.

సుధ అడిగింది రాజుని "ఇప్పుడెలా వుంది మీకు?" అని.

రాజు- సుధకీ, సురేష్‌కీ అన్నీ వివరంగా చెప్పాడు.

అంతా విని సురేష్ అన్నాడు. "నాలుగు రోజుల్లో అన్నీ సర్దుకుంటాయి. మనల్ని అమెరికాలోని ఈ శుభ్రత పాడుచేసింది. అన్నిరకాల బాక్టీరియాను చంపి, పరిశుద్ధం చేసి నీళ్లను సప్లై చేస్తారు. రోడ్లూ, షాపులూ చాలా శుభ్రంగా వుంచుతారు. ఆహార పదా ర్థాలమీద ఆంక్షలు. ఇన్‌స్పెక్షన్‌లు. కల్తీ వుండదు. వీటివల్ల మన శరీరంలో ఇమ్యూ నిటీ తగ్గిపోతుంది. అందుకే చిన్న చిన్న వాటికి కూడా ఎలర్జీలు, రియాక్షన్లు. ముప్ఫయి సంవత్సరాల పైన బెంగుళూ రులో, పొద్దుటినుంచి రాత్రిదాకా దుమ్ములో తిరిగినా ఒక్కతుమ్ము తుమ్మలేదు. ఇప్పుడు నా ముక్కు దుమ్మును సెన్స్ చేసే పరికరం లాగా తయారయింది. అరమైలు దూరంలో దుమ్ము వున్నా, నా ముక్కు దురద పెడు తుంది"

సుధ అంది "అందులోనూ మీరు ఎనిమి దేళ్ళ తర్వాత అక్కడికి వెళ్ళటంవలన, మీ ఆరోగ్యం దెబ్బతిని వుంటుంది. అది మామూలుగా అందరికీ అనుభవం అయేదే"

సురేష్ రాజు ఇచ్చిన రిపోర్టులన్నీ చూశాడు.

"ఐ డోంట్ సీ ఎనీథింగ్ ఎబ్‌నార్మల్... మీరేమీ దిగులు పడకండి" అన్నాడు.

కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్న తర్వాత, ఇక వెడతామని లేచారు సురేష్, సుధ.

"మీ ఇంటికి దగ్గరలోనే వున్నాం. మీకు ఏవేళ, ఏ అవసరం వచ్చినా పిలవండి.



మొహమాట పడవద్దు" అన్నాడు సురేష్.

"తప్పకుండాను... థాంక్స్" అన్నాడు రాజు.

వాళ్ళు వెళ్ళిన పది నిమిషాలకు ప్రకాష్, కమల కూడా కారెక్కారు.

"మరీ ఆలస్యమయిపోతున్నది. అరవిందకి నిద్రపోయే సమయం" అంది వెడుతూ కమల.

★ ★ ★

రెండురోజుల తర్వాత మధ్యాహ్నం రెండు గంటలకు ప్రకాష్ ఆఫీస్‌లో పనిచేసుకుంటుండగా ఫోన్ చేసింది సరోజ.

"రాజుకి ఏమీ బాగాలేదు. కడుపునొప్పితో చాలా బాధపడుతున్నాడు. వెంటనే ఎమర్జన్సీని పిలిచి, అంబులెన్స్‌లో హాస్పిటల్‌కి వచ్చాం. లోపల వాళ్ళు ఏవో పరీక్షలు చేస్తున్నారు. నాకు ఏమిటో భయంగా వుంది" సరోజ గొంతులో ఆదుర్దా, గాభరా తెలుస్తూనే వున్నాయి.

"నేను వస్తాను ఒక అరగంటలో. ఎక్కడ ఏ హాస్పిటల్‌లో"

"మీరు ఆఫీస్ వదలి రావటం ఎందుకులెండి. లోపల డాక్టర్లు వున్నారుగా. నేను కూడా బయటనుంచుని చేసేదేమీ లేదు. గాభరా పడటం తప్ప"

"సరోజా! నేను వస్తున్నాను. ఏ హాస్పిటల్‌లోనో చెప్పు"

ప్రకాష్ తన మేనేజర్ వాయిస్‌మైల్‌లో అత్యవసరమైన స్వంత పనిమీద బయటకు వెళ్ళుతున్నానని, అవసరమైతే పేజ్ చేయమనీ చెప్పి, దారిలో కమలను పిక్ చేసుకుని, హాస్పిటల్‌కి చేరేసరికి, మధ్యాహ్నం మూడు గంటలయింది.

ప్రకాష్ కారు పార్క్‌చేసి, వార్డుకి వచ్చేసరికి, అప్పుడే స్ట్రెచర్‌మీద బయటకు తెస్తున్నారు రాజుని. సరోజ అక్కడే వున్నది.

రాజు అన్నాడు "ఇంటెస్టైన్స్‌లో ఒకచోట బ్లాక్ అయిందంటున్నారు. సర్జరీ చేయాలిట"

ఈలోగానే ఇద్దరు డాక్టర్లు కూడా వచ్చారక్కడికి.

"ఐయామ్ డాక్టర్ షిఫ్‌లెట్. ఈయన డాక్టర్ నేగల్. సర్జన్. రాజు ఇంటెస్టైన్స్‌లో ఒకచోట బ్లాక్ అయింది. అందువలన పాంక్రియాస్ దగ్గర పేగులలో అడ్డం వస్తోంది. అక్కడ బైపాస్ చేయాలి" అంటూ డాక్టర్ షిఫ్‌లెట్ ఒక కాగితంమీద బొమ్మ గీసి చూపించాడు. ఆయన డాక్టర్ నేగల్ సర్జరీ ఎక్కడ, ఎలా చేస్తారో, సరోజకీ, ప్రకాష్‌కీ వివరంగా చెప్పారు.

సరోజ అడిగింది "ఇది సులభమైన ఆపరేషనేనా..." అని.

డాక్టర్ నేగల్ నవ్వాడు. "అది మీరు ఎవరివేపునించి చూస్తున్నారు అన్నదానిపై ఆధారపడి వుంటుంది. పేషెంట్‌కి కడుపుకోసి చేసే ఏ ఆపరేషన్ అయినా సులభమయిందేమీ కాదు, మూడు, నాలుగు గంటలపైనే పడుతుంది సర్జరీ. డాక్టర్‌గా నేను అలాటివి, రోజుకి ఒకటో రెండో చొప్పున గత ఇరవైఏళ్ళుగా చేస్తున్నాను. నా ఉద్దేశంలో అయితే అది సులభమైనదే"

"వేరే కాంప్లికేషన్స్ వచ్చే అవకాశం వుందా?" అడిగాడు ప్రకాష్.

"రావు అని గట్టిగా చెప్పటం కష్టం. కానీ కాంప్లికేట్ అయిన కేసులు చాలా తక్కువ. ఐ విల్ డు మై బెస్ట్ ఇఫ్ యు వాంట్ టు ప్రొసీడ్ విత్ సర్జరీ" అన్నాడు డాక్టర్ నేగల్.

డాక్టర్లు అన్నీ వివరంగా చెప్పటం అమెరికాలో చాలా సహజమైనదే. అంతేకాక డాక్టర్లు ఎప్పుడూ కనీసం మాటవరసకయినా గ్యారంటీలు ఇవ్వరు. వాళ్ళు చెప్పిన దానికి భిన్నంగా ఏదన్నా జరిగితే, తర్వాత పేషెంట్లు, వారి అనుయాయులు డాక్టర్లను కోర్టుకి ఈడ్చిన కథలు వున్నాయి. డాక్టర్ల ఇన్స్యూరెన్స్ కంపెనీలు, పెద్ద పెద్ద మొత్తాలుగా డబ్బుని కోర్టువారి ఆధ్వర్యంలో పేషెంట్లకు ఇచ్చిన సందర్భాలు వున్నాయి.

అందుకే అమెరికాలో డాక్టర్లు, మంచీ చెడూ అన్నీ చర్చించి సర్జరీ చేయించుకోవటమా, మానటమా అన్న నిర్ణయాన్ని రోగికే వదిలేస్తారు.

ప్రకాష్ రాజుతో నెమ్మదిగా తెలుగులో అన్నాడు, "ఇంకో డాక్టరుకి కూడా చూపిద్దామా? రెండో అభిప్రాయం మంచిది కదా..."

రాజు ఒక్కక్షణం ఆలోచించాడు. "వద్దులే. ఈ హాస్పిటల్‌కూ, ఈ డాక్టర్‌కూ మంచి పేరుంది. మనవాళ్ళు చాలామంది రకరకాల వైద్యాలకీ యిక్కడికే వస్తుంటారు. ఇటువంటి విషయాల్లో తాత్సారం పనికిరాదు. ఏం సరోజా? "

"మీ యిష్టం. ఎలాగైనాసరే. మీకు నయమయితే నాకదేచాలు" అంది సరోజ.

కమల సరోజ భుజంమీద చేయివేసి మృదువుగా నొక్కింది.

రాజు సర్జన్‌ని అడిగాడు, "మీరు సర్జరీ ఎప్పుడు చేద్దామనుకుంటున్నారు? " అని.

"రేపూ, ఎల్లుండీ నాకు రెండు ఆపరేషన్లు వున్నాయి. శుక్రవారం పొద్దున్న చేద్దాం. మీరు సరే అంటే అన్నీ సిద్ధం చేస్తాను"

"అలాగే... శుక్రవారానికి అన్నీ సిద్ధం చేయండి? " అన్నాడు రాజు.

"నాకూ శుక్రవారం సెలవు. నేను నీ పక్కనే తోడుగా వుంటానులే" అంది కమల సరోజతో.

"నేను ఆరోజు ఆఫీస్ పనిమీద హ్యూస్టన్ వెళ్ళాలి. అయినా ఫరవాలేదు... చూద్దాం" ప్రకాష్ అంటున్నాడు.

రాజు నవ్వుతూ అన్నాడు. "నువ్వు యిక్కడ వుండి ఏం చేస్తావు. కత్తులకు పదును పెడతావా? ఆపరేషన్ రూమ్ ముందు కాపలా కాయటానికేకదా. సరోజ ఆ పని నీకన్నా బాగా చేస్తుందిలే. నువ్వేమీ వర్రీ అవకు. అన్నీ సక్రమంగా జరుగుతాయి"

"జరగవని కాదోయ్ చెవలాయ్... పక్కనే వుంటే మంచిదికదా అని..."

"నేను వుంటాను కదా... సరోజకు తోడుగా" అంది కమల.

★ ★ ★

ఆరోజు రాత్రి కమల సరోజకు ఫోన్‌చేసి మాట్లాడుతుండగా అంది సరోజ.

"కమలా! ఆయనకేమీ ఫరవాలేదంటావా? రక్తపరీక్ష చేయడానికి బ్లడ్ తీస్తుంటేనే విలవిల్లాడతాడు రాజు..."

"ఏం ఫరవాలేదు. నేను డాక్టర్ నేగల్ గురించి ఇంతకుముందు విన్నాను. సర్జన్‌గా ఆయనకు మంచి పేరుంది. నువ్వేమీ దిగులుపడకు"

"ఆయన గురించి కాదు. రాజు గురించి. ఎలా తట్టుకుంటాడా అని"

"తట్టుకోడానికేమీలేదు సరోజా. అనస్థీషియా ఇవ్వగానే ఏమీ తెలియదు. మళ్ళీ స్పృహ వచ్చేసరికి, రికవరీ రూమ్‌లో వుంటారు. అప్పటికే అంతా సవ్యంగా జరిగిపోతుంది. నొప్పిలేకుండా మాత్రలు, ఇంజక్షన్లూ ఇస్తారు కనుక ఏ బాధా వుండదు. నిశ్చింతగా వుండు. నేనూ నీ పక్కనే వుంటాగా" ధైర్యం చెప్పింది కమల.

మర్నాడు పగలంతా బాగానేవుంది కానీ, చీకటిపడేసరికి మనసు మనసులోలేదు సరోజకి. కాలుకాలిన పిల్లిలా రాజుదగ్గరే తిరగసాగింది.

వినీత రాజు గుండెమీద చేతులువేసి రాజు దగ్గరే పడుకుంది.

కాసేపాగి రాజుతో అంది వినీత. "నాకు శుక్రవారం ఆసియా ఖండంమీద పాఠం చెబుతానంది మా టీచర్. ఆ రాత్రి నేను ఇండియామీద వ్యాసం రాయాలి. నాకు హెల్ప్ చేస్తావా? "

"నేను సహాయం చేస్తాలే. నాన్నకి ఆరోజే కదా ఆపరేషన్" అంది సరోజ.

రాజు నవ్వాడు. "నాకేం ఫర్వాలేదు. రొటీన్ ఆపరేషన్. వినూ! నువ్వేమీ వర్రీ అవకుండా స్కూలుకి వెళ్ళు. ఆపరేషన్

అయ్యాక అమ్మ నిన్ను హాస్పిటల్‌కి తీసుకు వస్తుంది. అప్పుడు చెబుతాను నీకు కావలసిన విషయాలు"

వినీత మనసు కొంచెం తేలికయింది. తన చక్కటి కళ్ళను ఒక్కసారి విప్పార్చి రాజు కళ్ళల్లోకి చూసి, మళ్ళీ కళ్ళు మూసుకుంది. రాజు వినీత తలను రెండు చేతుల్లోకి తీసుకుని, బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.

సరోజ మంచందగ్గరే కుర్చీలో కూర్చుని ఆలోచిస్తోంది. రాజుకి సర్జరీ సవ్యంగా జరుగుతుందా? రాజుకి ఏమయినా జరిగితే తను భరించగలదా? ఆమె గుండెల్లో ఏదో తెలియని ఆందోళన, ఆవేదన, కళ్ళల్లో తడి.

"సరోజా!" ప్రేమగా పిలిచాడు రాజు.






వెళ్ళి మంచంమీద కూర్చుంది సరోజ.

ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని "నాకన్నా కూడా నువ్వు ఎక్కువ దిగులు పడుతున్నావు. అంతా బాగానే జరుగు తుంది. ధైర్యంగా వుండు" అన్నాడు రాజు.

వినీత పక్కనే తను పడుకుని, వినీత మీదుగా రాజు గుండెమీద చేయివేసి పడు కుంది సరోజ.

రాజు ఆమె చేయిని తన గుండెకు హత్తు కుని పడుకున్నాడు.



ప్రకాష్ పొద్దున్నే బయల్దేరి కారులో హ్యూస్టన్ వెళ్ళిపోయాడు ఆఫీసు పనిమీద.

సుధ, సురేష్‌లు సరోజనీ, రాజునీ పొద్దున్నే ఎనిమిది గంటలకల్లా హాస్పిటల్లో దించారు. వినీతను వాళ్ళ ఫ్రెండ్ కేటీవాళ్ళ ఇంట్లో దించింది కమల. కేటీ అమ్మగారు సూసాన్ పార్కర్‌కి వినీత అంటే బాగా ఇష్ట మని వినీతను అక్కడ ఉండమంది సరోజ. సురేష్ కాసేపు కూర్చుని, తన క్లినిక్‌కి వెళ్ళి పోయాడు. అవసరం అయితే తనకి పేజ్ చేయమని చెప్పాడు సుధతో.

సుధ ఆరోజు యూనివర్సిటీకి వెళ్ళడం మానేసి వచ్చింది సరోజకు తోడుగా.

సురేష్ అటు వెళ్ళగానే కమల కూడా వచ్చింది సహాయానికి.

రాజుని ఆరోజు కానీ ముందురోజుకానీ ఏమీ తిననీయకుండా ద్రవపదార్థాలమీద ఉంచటంవలన నీరసంగా వున్నాడు కానీ, మంచి ధైర్యంగా వున్నాడు.

రాజుకి ఇంజక్షన్లు చేసి, ఆపరేషన్ రూమ్‌లోకి తీసుకెళ్ళాక, సరోజ, కమల, సుధ బయట విజిటర్సు లాంజ్‌లో కూర్చున్నారు.



ప్రకాష్ హ్యూస్టన్‌లో పని పూర్తిచేసుకుని అక్కడినుంచి రెండువందల మైళ్ళు డ్రైవ్ చేసుకుంటూ, డల్లాస్‌లో సరాసరి హాస్పిట ల్‌కి వచ్చేసరికి సమయం సాయంత్రం ఆరు గంటలయింది. రాజుకి ఇచ్చిన గదిముందర తను అనుకున్నదానికన్నా ఎక్కువమంది కనపడ్డారు. ప్రకాష్‌కి కొంచెం గాబరా వే సింది. చకచకా వెళ్ళాడు అక్కడికి.

రాజు గదిలోలేడు. సరోజ అక్కడే మంచంమీద కూర్చుని వుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు. పక్కనే కమల, సుధ కూర్చుని వున్నారు. కమల సరోజ భుజం

మీద చేయివేసి, ఏదో చెబుతోంది నెమ్మదిగా. మౌనంగా కిటికీదగ్గర నుంచొని వున్నాడు సురేష్. బయట నిశ్శబ్దంగా వెడుతున్న కార్లను చూస్తున్నట్టున్నాడు.

ప్రకాష్‌కి ఏమీ అర్థంకాలేదు. గుండె వేగంగా కొట్టుకోసాగింది. ప్రకాష్‌ని చూసి కమల లేచి వచ్చింది. అతని చేయి పట్టుకుని దూరంగా తీసుకెళ్ళింది.

"ఏం జరిగింది? రాజు బాగానే వున్నాడా? " అడిగాడు గాభరాగా.

"ఇంకా రికవరీ రూమ్‌లోనే వున్నారు. ఆపరేషన్ బాగానే జరిగింది" ఆగింది కమల.

సగం భారం తగ్గింది ప్రకాష్‌కి. మిగతా వివరాలకోసం ఎదురుచూస్తున్నాడు. కమల తన మనసులో ఆ సంగతి ఎలా చెబుదామా అని ఆలోచిస్తూనే మెల్లగా అంది, "ఇంటెస్టైయిన్స్ బైపాస్‌కోసం సర్జరీ చేసినప్పుడు చూశారుట. రాజుగారికి ఇంటెస్టెయిన్స్ కాన్సర్ అని. అది ఏదో లంప్‌లాగా ఒకచోట లేదుట. ఇంటెస్టైయిన్స్ చాలా భాగం కవర్ అయిందిట. లివర్, కిడ్నీల మీద కూడా గ్రోత్ వుందిట. అలా తీసివేయడం చాలా కష్టమనీ, ప్రమాదకరమనీ అన్నారుట..."

ప్రకాష్‌కి చెమటలు పట్టాయి. "అతనికి తెలుసా ఆ విషయం? "

"సరోజకీ, సుధకీ, నాకూ చెప్పాడు సర్జన్. వెంటనే బయటకు వచ్చి అప్పటికప్పుడే కాన్సర్ స్పెషలిస్ట్‌ని కూడా పిలిపించి చూపించారుట. రాజుకి స్పృహ వచ్చిన తర్వాత సరోజను లోపలకు పిలిచి వాళ్ళిద్దరికీ కలిపి చెప్పారుట"

"రాజు ఎలా తీసుకున్నాడు. సరోజ బాగానే వుందా? "

"రాజు సంగతి తెలీదు. ఇంకా రికవరీ రూమ్‌నుంచి బయటకు రాలేదు. మొదటగా ఆమాట వినగానే బెదిరిపోయాడనీ, పూర్తిగా నీళ్ళు కారిపోయాడనీ చెప్పింది సరోజ. మళ్ళీ స్పృహ కోల్పోయాడని అంది. డాక్టర్ మాత్రం పూర్తిగా అనస్తీషియా మత్తు వదలకపోవడంవలన, అలా మళ్ళీ నిద్రలోకి జారిపోయాడు కానీ, ఏమీ భయపడనవసరం లేదన్నాడుట. సరోజకు మాత్రం యిది చాలా పెద్ద షాక్. తట్టుకుంటున్నది కానీ, బాగా దెబ్బతింది" కమల కళ్ళల్లో నీళ్ళు మెరుస్తున్నాయి.

"అయితే యిప్పుడు ఏమిటి చేయడం? "

"లోపల ఆన్కాలజిస్టు, సర్జన్ మాట్లాడుకుంటున్నారు. అదిగో యిటే వస్తున్నారు" అంది కమల.

గబగబా అక్కడికి వెళ్ళాడు ప్రకాష్. సురేష్, సుధ ఒకపక్కగా నుంచున్నారు. సరోజ వాళ్ళను చూసి లేచి నిలబడింది.

సర్జన్ డాక్టర్ నేగల్ అన్నాడు, "ఈయన డాక్టర్ బర్చ్ ఆన్కాలజిస్ట్. అంటే క్యాన్సర్ స్పెషలిస్ట్" అని ఆయన్ని పరిచయం చేశాడు.

ఆయన "పేషెంట్ భార్య ఎవరు" అని అడిగాడు.

సరోజ తలూపింది. డాక్టర్ బర్చ్ షేక్ హాండ్ ఇచ్చిన ఆమె చేతిని వదలకుండా అలాగే పట్టుకుని మృదువుగా నొక్కుతూ అన్నాడు "నేను మీకు అంత మంచివార్త చెప్పలేకపోతున్నందుకు బాధపడుతున్నాను. రాజుకి వచ్చింది పాంక్రియాటిక్ క్యాన్సర్. ఈ భాగంలో వచ్చిన క్యాన్సర్ త్వరగా మిగతా శరీరభాగాలకు పాకుతుంది. రాజుకి కడుపులోనూ, ప్రేగులమీదా, కిడ్నీమీదా కాన్సర్ వ్యాపించి వుంది. ఇది ఎన్నాళ్ళనుంచి ఉందో కూడా చెప్పటం కష్టం. అసలు ఇన్నాళ్ళూ బయటపడకపోవడం కూడా ఆశ్చర్యంగా వుంది"

డాక్టర్ నేగల్ తన చేతిలో వున్న రైటింగ్ పాడ్‌మీద వేసిన బొమ్మ చూపించాడు. దానిలో పాంక్రియాస్, పెద్ద ప్రేగులు, చిన్న ప్రేగులు, కాలేయం అన్నీ గీసి వున్నాయి.

డాక్టర్ బర్చ్ ఆ బొమ్మని చూపిస్తూ




అన్నాడు, "ఇది లింఫాటిక్ సర్క్యులేషన్. ఇది బ్లడ్ సర్క్యులేషన్. క్యాన్సర్ సెల్స్ ఈ స్ట్రీమ్స్‌లోకి వస్తే, శరీరంలో ఎక్కడికైనా వ్యాపించే అవకాశం వుంది. రాజు విషయంలో జరిగిందదే. కిడ్నీ, లివర్‌లకు వ్యాపించింది. దాన్ని మెటాస్టిసిస్-అంటారు. ఇతనికి క్యాన్సర్ పాంక్రియాస్, లీవర్, కిడ్నీలకు వ్యాపించింది"

ప్రకాష్ అడిగాడు, "దీని నివారణ ఎటువంటిది? ఏ రకమైన వైద్యం చేస్తే తగ్గుతుంది"

కమల అడిగింది, "అసలు ఈ క్యాన్సర్ ఎందుకు వస్తుంది? " అని.

డాక్టర్ బర్చ్ పెదవులమీద ఒక్కక్షణం చిరునవ్వు లాస్యంచేసి మాయమయింది.

"క్యాన్సర్ ఏఏ కారణాలవలన వస్తుందో జనరల్‌గా తెలిసినా, రాజుకి ఏ కారణంవల్ల వచ్చిందో చెప్పటం కష్టం. చాలా కేసుల్లో క్యాన్సర్ వచ్చినతర్వాత ఎందుకు వచ్చిందా అని వివరణకోసం కారణాలు వెతికి విఫలులయిన డాక్టర్లే ఎక్కువ. ముఖ్యంగా ఈ పాంక్రియాటిక్ కాన్సర్ ఎందుకు వస్తుందో చెప్పటం చాలా కష్టం. ఈ కాన్సర్‌మీద చికాగోలో నార్త్ వెస్ట్రన్ యూనివర్సిటీలోనూ, హ్యూస్టన్‌లోని ఎం.డి. యాండర్సన్ హాస్పిటల్‌లోనూ, యిలాంటి కొన్నిచోట్ల మంచి రిసెర్చి జరుగుతోంది. కానీ ఈరకమైన కాన్సర్ అరుదుగా వస్తుంది. అందువలన కావలసిన సమాచారం సంపాదించటం కూడా కష్టం. ఇక ఈ కాన్సర్ నివారణ విషయం. ఈ కాన్సర్ వచ్చి పూర్తిగా కోలుకున్నవాళ్ళు నాకు తెలిసినంత వరకూ ఎవరూలేరు. అలా అని పూర్తిగా ఆశలు వదులుకోటానికి, నేనుకానీ, వైద్యశాస్త్రంగానీ అంగీకరించం. ఎన్నో అర్థం కాని రోగాలని, ఈరోజున విజయవంతంగా నయం చేయగలుగుతున్నాం. ఎందరో మహామహుల అనుభవం, రోజురోజుకీ వృద్ధి అవుతున్న శాస్త్రవిజ్ఞానం కనిపెట్టిన మానవమేధస్సునే విస్మయపరిచే ఆధునిక యంత్రాంగం ఈ విజయాలకు కారణాలు. అందుకని మనం చేయవలసిన ప్రయత్నాలన్నీ చేద్దాం"

సుధ అడిగింది, "ఆపరేషన్ చేసి, క్యాన్సర్ సోకిన ఆ శరీరభాగాలను తీసివేసే అవకాశం వుందా? "

ఈసారి సర్జన్ డాక్టర్ నేగల్ జవాబిచ్చాడు. "లేదు. బ్రెస్ట్ క్యాన్సర్‌లాగాకానీ, వీపుమీద వచ్చే రాచపుండులాగా కానీ వుంటే ఆపరేషన్ చేసి తీసేయవచ్చు ఇది అలా కాక, ఒక కోటింగ్‌లాగా వ్యాపించి వుంది. అంతేకాదు, ఈ కాన్సర్ వ్యాపించిన భాగాలన్నీ, సర్జరీతో తీసివేయతగినవి కావు. మనిషి ఆయువుకు నిత్యావసరమైనవి. అందుకని, ప్రస్తుతానికి ఆ ప్రయత్నం చేయవద్దని నిర్ణయించుకున్నాం"

"అయితే ఏ విధమైన ట్రీట్‌మెంటు చేద్దామనుకుంటున్నారు? " అనడిగాడు సురేష్.

"నేను రేపు మా టీమ్ ఆఫ్ డాక్టర్స్‌తో మాట్లాడిన తర్వాత, ఒక ట్రీట్‌మెంట్ ప్లాన్ తయారుచేస్తాను. అప్పుడు అన్నీ వివరంగా చెబుతాను. డోంట్ వర్రీ... ఉయ్ విల్ డు అవర్ బెస్ట్" అన్నాడు డాక్టర్ బర్చ్

సురేష్ ఆయనతోపాటు బయటకు వెళ్ళాడు ఏవో ప్రశ్నలడుగుతూ.

తర్వాత అరగంటకి రాజుని రికవరీ రూమ్‌నుంచి తీసుకువచ్చారు కానీ, ఇంకా మత్తుగా నిద్రపోతూనే వున్నాడు. అది పూర్తిగా నిద్రో, ఈ హఠాత్పరిణామానికి కలిగిన అఘాతమోకానీ, అతను మాత్రం కళ్ళు తెరవటంలేదు. మధ్యలో ఏదో బయటకు రాని మాటలు మాట్లాడుతున్నా మాట్లాడుతూనే నిద్రలోకి జారిపోతున్న పద్ధతి అతనింకా పూర్తిగా కోలుకోలేదని చెబుతూనే వుంది.

ఆ రాత్రికి ప్రకాష్ రాజుకి తోడుగా అక్కడే పడుకోడానికి నిశ్చయించుకున్నాడు.

సరోజ తను కూడా ఆ రాత్రి హాస్పిటల్‌లోనే పడుకుంటానంది.



"ఈ ఎనస్తీషియావల్ల రాజు ఈ రాత్రి బాగా నిద్రపోతాడు. మీరు ఇక్కడ వుండి చేసేదేమీలేదు. రాత్రికి ఇంట్లో పడుకుని రేపు పొద్దున్నే రావటం మంచిదని నా సలహా" అన్నాడు సురేష్.

"అవును సరోజా! ప్రకాష్ ఇక్కడ పడుకుంటున్నాడు కనుక ఏదన్నా అవసరమయితే చూసుకుంటాడు. నువ్వు దారిలో సూసాన్ వాళ్ళింట్లో వినీతను పికప్ చేసుకుని ఇంటికి వెళ్ళి రేపు పొద్దున్నే వద్దువుగాని" అంది కమల.

సరేనని తల ఊపింది సరోజ. ఆమెను సుధ, సురేష్‌లు తమ కారులో తీసుకువెళ్ళారు.

ప్రకాష్ కింది అంతస్థులోని కాఫ్టేరియాలోకి, కమల పార్కింగ్ గరాజ్‌లోకి నడిచారు. ప్రకాష్ కాఫ్టేరియాలో ఏదో తిన్నాననిపించుకుని, రాజు రూమ్‌కి వచ్చి అక్కడ కుర్చీలో కూర్చున్నాడు.

రాజు ఇంకా మంచి నిద్రలో వున్నాడు.

నర్స్ వచ్చి అడిగింది. "మీకు ఇంకొక బెడ్ తెస్తాను పడుకోటానికి"

హాస్పిటల్స్‌లో పేషెంటు గదిలోనే విజిటర్స్ పడుకోటానికి ఫోల్డింగ్ మంచాలు తెస్తారు.

ప్రకాష్‌కి అక్కడ ఎలాగూ నిద్రపట్టదు కనుక "వద్దు. ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు.

ఒక అరగంట తర్వాత రాజుకి పూర్తిగా మెళుకువ వచ్చింది.

ప్రకాష్‌ని చూసి "ఇంకా ఇంటికి పోలేదా?" అని అడిగాడు.

"లేదు. రేపు ఎలాగూ శనివారమేకదా, ఈ రాత్రికిక్కడ నీకు తోడుగా వుంటానులే"

ఒక్కక్షణం మౌనంగా వుండి అన్నాడు రాజు, "విన్నావా... నాకు టెర్మినల్ క్యాన్సర్ వుందిట"

"క్యాన్సర్ అన్నాడు కానీ, టెర్మినల్ క్యాన్సర్ అనలేదు డాక్టరు. ఈ రోజుల్లో క్యాన్సర్‌కి అంత భయపడనక్కరలేదు. మెడికల్ ఫీల్డు బాగా ఎదిగిపోయింది రాజూ. కొన్నాళ్ళక్రితం ఏమాత్రం అంతుపట్టని రోగాలని ఈనాడు ఇట్టే నయం చేయగలుగుతున్నారు"

ప్రకాష్ కళ్ళల్లోకి సూటిగా చూశాడు రాజు. "నన్ను ఓదార్చడానికి అ మాటలంటున్నావని నాకు తెలుసు. నాకు క్యాన్సర్ ముదిరిపోయిందిట"

రాజు మాటలకి అడ్డు వస్తూ అన్నాడు ప్రకాష్. "నిన్ను ఓదార్చడంకోసంకాదు రాజూ! నిజంగానే అంటున్నాను. డాక్టరు క్యాన్సరు బాగా వ్యాపించింది అన్నాడు కానీ, పూర్తిగా ఆశలు వదిలేసుకుంటున్నానని అనలేదు. డాక్టర్ బర్చ్ చాలా పేరున్న డాక్టర్. ఒకవేళ ఆయనవల్ల కాకపోతే హ్యూస్టన్‌కి వెళ్దాం. అక్కడ ఎం.డి. యాండర్సన్ హాస్పిటల్ ప్రపంచ ప్రసిద్ధమైన క్యాన్సర్ హాస్పిటల్. వైద్యమేకాకుండా, మంచి రీసెర్చి కూడా జరుగుతోంది అక్కడ. కనుక నువ్వేమీ దిగులుపడకు"

"నాకెందుకో అలా అనిపించడంలేదు. డాక్టర్ అలా చెప్పటం..."

చిన్నగా నవ్వాడు ప్రకాష్. "రాజూ! ఈ విషయం నీకు తెలియనిది కాదు. ఈ దేశంలో డాక్టర్లు మంచీచెడూ అన్నీ విడమరిచి చెబుతారు. వ్యాధి నయం చేసే పద్ధతి, దాన్ని అనుసరించే విధానం రోగితో ముందుగానే చర్చిస్తారు. అది మనకి వింతగా వుంటుంది. సాంస్కృతికంగా తేడాలు అలా వున్నాయి. ఇండియాలో రోగాన్ని గుప్తంగా వుంచి రోగి గుండెధైర్యాన్ని సడలించకుండా కాపాడటం అక్కడి అలవాటు. ముందే అన్నీ పేషెంటుతో మాట్లాడి అతన్ని శారీరకంగానే కాక, మానసికంగా కూడా సిద్ధం చేయడం ఇక్కడి అలవాటు. వాటిల్లో ఏది మంచిదంటే రెండూ మంచివే. శతాబ్దాలుగా భారతదేశంలో అది పనిచేస్తున్నది. ఇక్కడ ఇది పనిచేస్తున్నది. అందుకనే ఇక్కడి పద్ధతి ప్రకారం డాక్టరు




నీతో ఆ విషయాలన్నీ చెప్పాడు. అంతేకాదు నా ఉద్దేశ్యంలో నువ్వింకా చాలా వినాల్సివ స్తుంది. అఫ్‌కోర్స్... నీ ఆరోగ్యం ఎలా మెరుగవుతున్నదో చెప్పే విషయాలేన నుకో..."

రాజు కళ్ళు మూసుకున్నాడు. నిద్రమత్తు లోకి జారుకున్నాడో, ఆలోచిస్తున్నాడో మాత్రం తెలియడంలేదు.

ప్రకాష్ ఐదు నిముషాలు అక్కడే కూర్చుని రూమ్‌లోంచి బయటకు వచ్చాడు.

అక్కడ ఛార్టులో ఏదో రాసుకుంటున్న నర్సు, "బోరు కొడుతోందా? గో ఫర్ ఎ వాక్ యిన్ ది కారిడార్" అంది నవ్వుతూ.

"అవును. నేనూ అదే చేద్దామనుకుంటు న్నాను. ఎక్సర్‌సైజు లేక కాళ్ళు కదలనంటు న్నాయి" అన్నాడు నవ్వుతూ.

సమయం రాత్రి పన్నెండు గంటలయిం దేమో, అక్కడ చాలా నిశ్శబ్దంగా వుంది. మధ్యమధ్యలో గదుల్లోంచి పొడిదగ్గులూ, స్టేషన్‌దగ్గర సన్నగా నర్సుల మాటలూ తప్ప, వాతావరణం నిద్రపోవడానికి అను కూలంగా వుంది.

ఒక టెక్నీషియన్ ఏదో పరీక్ష చేయటం కోసం ఒక రోగి గదిలోకి వెడుతున్నాడు. మందులు వేసే సమయం అయినట్టుంది. ఇంకో గదిదగ్గర నర్సు మందుల ట్రే తీసు కుని లోపలికి వెళ్ళబోతూ, గది తలుపుమీద మునివేళ్ళతో కొడుతోంది, "ఎక్స్‌క్యూజ్ మీ" అంటూ. నర్సుల స్టేషన్ దగ్గర ఒకావిడ కంప్యూటర్‌లో ఏదో సమాచారం టైపు చేస్తోంది.

కొంచెం అవతలగా ఈసీజీ (అమెరికాలో ఇకెజి అంటారు) మానిటర్ టెక్నీషియన్, టీవీ మానిటర్‌లో నలభైమంది రోగుల హృదయ ఘోష చూస్తోంది. నలభై ఎలక్ట్రో కార్డియాలజి గ్రాఫులు ఒక పక్కనుంచి రెండవపక్కకు వెడుతున్నాయి మీటర్‌మీద. అంతా సరిగ్గా వుంటే ఫరవాలేదు. ఏ పేషెంట్ హార్ట్‌బీట్‌లో ఏమాత్రం తేడా వచ్చినా, ఆవిడ వెంటనే నర్సులను పిలు స్తుంది. అత్యవసరమైతే ఎమర్జన్సీ ఎలర్ట్ చేస్తుంది. ఆవిడ చూడడానికి ఇండియన్‌లా వుండడంతో ప్రకాష్ అక్కడికెళ్ళి నవ్వుతూ 'హాయ్' అన్నాడు.

"ఐయామ్ ప్రకాష్" అన్నాడు.

"ఐ యామ్ ప్రసూన" అన్నదావిడ.

ఆవిడ మానిటర్ మీద ఒక లైను చూపించి, "ఇది మీ ఫ్రెండు రాజు హార్ట్ బీట్. రూమ్ నెంబరు 280, అంతా నార్మ ల్‌గా వుంది" అంది.

ప్రకాష్‌కి ఆ మానిటర్‌మీద గీతలేవీ అర్థం కాకపోయినా ఆవిడ అంతా బాగానే వున్న దని అంది కనుక బాగానే వున్నట్టు అనిపిం చింది. ఆవిడకు తను రాజు తరపున వచ్చా ననీ, రాజు రూమ్ నెంబరు 280 అనీ ఎలా తెలుసునని అడగబోయి ఆ ప్రశ్నకు జవాబు తనకే స్ఫురించడం వలన ఇక అడగలేదు.

"రాజుకి హార్ట్ ప్రాబ్లమ్ ఏమీలేదుకదా, ఎందుకు మానిటర్ చేస్తున్నారు" అని అడి గాడు ప్రకాష్.

ఆవిడ నవ్వింది. "సర్జరీ అవటంవలన, ఈ రాత్రికి మాత్రం మానిటర్ చేయమని డాక్టర్ రాశాడు" అంది.

ఈలోగా మానిటర్‌మీద ఒక గీత లయ తప్పి నడవడంతో ఆమె ఒక్కసారిగా బిజీ అయిపోయింది.

ఆవిడ హడావిడిగా వుండడంతో, "మళ్ళీ కలుద్దాం" అని కారిడార్‌లోకి వచ్చాడు ప్రకాష్. దాదాపు అర కిలోమీటరు పొడ వుంది ఆ కారిడార్. ఎయిర్ కండిషన్ చల్లగా పెట్టడంవల్ల, అక్కడ బాగా చలిగా వుంది. ఈ చివరినుంచీ, ఆ చివరివరకూ నాలుగుసార్లు నడిచాడు. వేగంగా నడవ డంతో ఒళ్ళు కొంచెం వేడెక్కింది. తేలికగా అనిపించింది. జేబుల్లో చేతులు పెట్టుకుని, అక్కడే నెమ్మదిగా తిరగడం మొదలుపె ట్టాడు.

రాజుకి కాన్సర్ అంత ముదిరిపోయినా,

ఇన్నాళ్ళూ ఏమాత్రం బయటపడకపోవడం ఆశ్చర్యంగా వుంది ప్రకాష్‌కి. డల్లాస్‌లో తనకు తెలిసినంతవరకూ రాజుకి మామూలు జలుబులూ, తుమ్ములూ తప్ప వేరే ఏ అనారోగ్యమూ రాలేదు. అందుకని అతనికి కాన్సర్‌కోసం ప్రత్యేకంగా పరీక్షలు చేయించుకోవలసిన అవసరం రాలేదు.

ప్రతి సంవత్సరం అమెరికాలో చాలా మంది ఫిజికల్ చెకింగ్ చేయించుకుంటారు. ప్రకాష్ కూడా ప్రతి సంవత్సరం అన్ని పరీక్షలు చేయించుకుంటాడు. నలభై ఏళ్ళు దాటినవాళ్ళు స్ట్రెస్ టెస్ట్ చేయించుకుంటారు గుండె సరిగ్గా పనిచేస్తున్నదా లేదా అని. కోలన్ కాన్సర్‌కోసం పరీక్ష చేయించుకుంటారు. చాలా మెడికల్ ఇన్సూరెన్స్ కంపెనీలు ఈ పరీక్షలకు ఖర్చు భరిస్తాయి కూడాను. రాజు కూడా ఈ పరీక్షలన్నీ చేయించుకుంటున్నా ఈ వ్యాధిమాత్రం బయటపడలేదు.

రాజుకి తగ్గుతుందా? మళ్ళీ మామూలుగా తిరుగుతాడా? ప్రకాష్ యిదే ఆలోచిస్తున్నాడు.

ప్రకాష్‌కి ఎదురుగా వస్తున్నాడు ఒక ముసలాయన. డెబ్బైఏళ్ళు వుంటుందేమో వయసు. ఒక చేతిలో కర్ర ఆధారంగా పట్టుకుని నడుస్తున్నాడు. రెండోపక్కన, ఇంట్రావీనస్ బాటిల్ కట్టివున్న చక్రాల స్టాండుని తోసుకుంటూ నడుస్తున్నాడు. ఇంట్రావీనస్ బాటిల్‌నుంచి ట్యూబ్ ఆయన ముంజేతి దగ్గరకు పెట్టివుంది. నెమ్మదిగా నడుస్తున్నాడు.

ప్రకాష్‌ని చూసి చిరునవ్వు నవ్వాడు. "యంగ్‌మాన్! వాట్ మేడ్ యు టు కం హియర్" అన్నాడు.

ప్రకాష్ కూడా నవ్వి విషయం చెప్పాడు.

ఆయన "ఇది చాలా మంచి ఆసుపత్రి. వీళ్ళు రోగం నయం చేసికాని పంపించరు. దె విల్ డు ఎనీథింగ్ టు సేవ్ ది లైవ్స్. యు ఆర్ యిన్ గుడ్ హాండ్స్. మీరు వర్రీ అవకండి" అన్నాడు.

ప్రకాష్ అడిగాడు, ఆయనకు ఎలా వుందని.

ఆయన మళ్ళీ నవ్వాడు. "నా గుండె ఈమధ్య చెప్పినమాట వినటంలేదు. అందుకే ఇక్కడికి వచ్చాను కొంచెం క్రమశిక్షణ నేర్పిద్దామని. నిన్నపొద్దున్నే డాక్టరు గారు నా గుండెకు కొంచెం బుద్ధి చెప్పారు. అంటే నా గుండెను ట్యూనప్ చేశారన్న మాట" అంటూ తన నడక పూర్తిచేయడం కోసం ఆ స్టాండుని తోసుకుంటూ కర్ర ఆధారంగా నడవటం సాగించాడా వృద్ధుడు.

ఆయన చెప్పిన పద్ధతీ, ఆయన తన అనారోగ్యాన్ని చాలా తేలికగా తీసుకుంటున్న తీరూ, క్రమశిక్షణ, జీవితం పట్ల చూపిస్తున్న ఆశాజనకమైన గౌరవం ప్రకాష్‌కి బాగా నచ్చాయి.

రాజు యింకా మంచి నిద్రలో వున్నాడు. నొప్పి తెలియకుండా యిచ్చిన మందుల ప్రభావం కావచ్చు కొంచెం గురక కూడా పెడుతున్నాడు.

ప్రకాష్ అక్కడే కుర్చీలో కూర్చున్నాడు. ఆరోజు హ్యూస్టన్‌కి వెళ్ళిరావటం వలనా, హాస్పిటల్లో అప్పటిదాకా నడుం వాల్చకపోవడంవలనా ప్రకాష్‌కి కూడా కునుకు పట్టింది.

పొద్దున్న ఏడుగంటలకు వచ్చారు ఇద్దరు నర్సులు. రాజుని నిద్రలేపి, ముఖం కడిగించడం, స్నానం చేయించడం, మందులు యివ్వడంలాంటివి చేయడం మొదలుపెట్టారు. ప్రకాష్ కూడా లేచి బయటకు వచ్చాడు. బయటవున్న రెస్ట్‌రూంలో (ఇండియాలో టాయిలెట్సుని అమెరికాలో రెస్ట్ రూమ్స్ అంటారు) ముఖం కడుక్కుని, కిందకువెళ్ళి కాఫెటేరియాలో కాఫీ తాగి వచ్చాడు.

అప్పుడే నర్సులు వెళ్ళినట్టున్నారు. రాజు మంచం పక్కనే టేబుల్‌మీద కాఫీ, బత్తాయిరసం వున్నాయి. రాజు ముఖం కూడా చాలా తేటగా వుంది.




# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల **చీకటిలో చందమామ**

**సమీక్షకుని పేరు :** ..........................................

**చిరునామా :** ..........................................

..........................................

..........................................

..........................................

"కాఫీ తాగుతావా?" రాజు అడిగాడు ప్రకాష్‌ని.

"ఇప్పుడే కింద తాగి వచ్చాను. నువ్వు పళ్ళరసం తాగుతావా?" అంటూ గ్లాసు అందించాడు ప్రకాష్.

"రాత్రి బాగా నిద్రపోయావా?" అడిగాడు రాజు బత్తాయిరసం తాగుతూ.

ప్రకాష్ నవ్వాడు. "నేనా... మా యింట్లో, మా మంచంమీద తప్ప ఇంకెక్కడా సరిగ్గా నిద్రపట్టదు నాకు. అదో పాడు అలవాటు నా శరీరానికి. అయినా ఫరవాలేదులే. రెండయిందేమో పడుకునేటప్పటికి. అప్పటి నుంచి పొద్దున్న నర్సు వచ్చేదాకా నిద్రపోయాను" అన్నాడు ప్రకాష్.

సమయం దాదాపు తొమ్మిది గంటలవుతుండగా వచ్చింది సరోజ. వెనుకనే వున్న వినీత గదిలోకి రాగానే గబగబా రాజు మంచం దగ్గరకు వెళ్ళి అతని చేయి పట్టుకుని, ఏమీ మాట్లాడకుండా అతని కళ్ళల్లోకి ప్రేమగా చూసింది.

రాజు వినీతను దగ్గరకు తీసుకుని బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడు.

వినీత చేయి నిమురుతూ "నాకిప్పుడు బాగానే వుంది" అన్నాడు.

ప్రకాష్ గదిలోంచి బయటకు వచ్చి వరండాలో నుంచున్నాడు.

సరోజ రాజు పక్కనే కూర్చుని అతని కళ్ళల్లోకి గోముగా చూసింది.

ఒకక్షణం ఆగి, "ఎలా వున్నావు" అని అడిగింది.

రాజు "నాకు బాగానే వుంది. నొప్పి తెలియకుండా ఇంజక్షన్లు చేయడంతో బాగా నిద్రపట్టింది కూడాను. పాపం ప్రకాష్ అసలు నిద్రపోలేదు" అన్నాడు.

సరోజ వరండాలోకి వచ్చి ప్రకాష్‌తో అంది, "చాలా థాంక్సండీ. మిమ్మల్ని చాలా శ్రమపెడుతున్నాం"

"శ్రమాలేదు, ఏమీలేదు. ఇంట్లో పడుకునే బదులు ఇక్కడ పడుకున్నానంతే"

కొంచెం ఆగి, గొంతు తగ్గించి నెమ్మదిగా అడిగింది సరోజ. "రాజు ఎలా తీసుకున్నాడు. ధైర్యంగా వున్నాడా?"

"ధైర్యంగానే వున్నాడు. రాజుకిగానీ, మీకు గానీ ఒక విషయం చెప్పాలి. ఈ రోజుల్లో కాన్సర్ అంటే అంత భయపడనవసరం లేదు. ఇక్కడ మంచి డాక్టర్లు వున్నారు. మీ రిద్దరూ ధైర్యంగా వుండండి. మీ పక్కన అండగా మేమందరం వున్నాం. రాజుకి తప్పక నయమవుతుందని నా నమ్మకం"

సరోజ ప్రకాష్‌వేపు కృతజ్ఞతాపూర్వకంగా చూసింది.

"వినీతకు అన్ని వివరాలు తర్వాత చెబుదామనుకుంటున్నాను. ఇప్పటికి ఆపరేషన్ అయిందనీ, రాజు బాగానే వున్నాడనీ మాత్రమే చెప్పాను"

"అవును అదే మంచిది. నేను కూడా అలాగే అనుకున్నాను" అన్నాడు ప్రకాష్.

సరోజ ఒక్క క్షణం ఆగి అంది, "మీరు రాత్రి నిద్రపోయినట్టులేదు. ఇక ఇంటికి వెళ్ళి పడుకోండి. నేను, వినూ వుంటాం ఇక్కడ"

"శనివారమే కదా ఇవాళ. ఇంటిపనులు తప్ప, ఆఫీస్‌కి వెళ్ళవలసిన పనిలేదు. మీకు ఏమయినా కావాలా"

"కమల లంచ్ తీసుకువస్తానంది. హాస్పిటల్లో పెట్టే ఆహారాలు రాజుకి నచ్చవు. అందుకే సరేనన్నాను"

"సరే... అయితే నేను వెడతాను. అవసరమైతే పిలవండి" అని ప్రకాష్ ఎలివేటర్ వేపు నడిచాడు. (ఇండియాలో లిఫ్ట్‌ని అమెరికాలో ఎలివేటర్ అంటారు)

వినీత రాజుని అడిగింది "నీకు ఆపరేషన్ చేసినదెక్కడ?" అని.

రాజు వినీత చేయి తన పొట్టమీద ఆనించి "ఇక్కడ" అన్నాడు.

"నెప్పిగా వుందా?" అడిగింది వినీత.

"నిన్ను చూడగానే నెప్పంతా పోయింది" అన్నాడు రాజు నవ్వుతూ.



రాజు మాటలకి వినీత కూడా నవ్వింది.

ఒక్కక్షణం ఆగి రాజు అడిగాడు. "నిన్న నీకు ఇండియామీద స్కూల్లో పాఠం చెబుతారన్నావు చెప్పారా? "

వినీత తన పెద్దకళ్లను యింకా పెద్దవి చేసి అంది "నీకావిషయం యింకా గుర్తుందా. నీ ఆపరేషన్ హడావిడిలో మర్చిపోయావనుకున్నాను"

"నీకు ఆ పాఠంలో సహాయం చేస్తానని మాట కూడా ఇచ్చాను, ఎలా మర్చిపోతాను" అన్నాడు రాజు.

వినీత తాజ్‌మహల్ మీద ప్రశ్నలడుగుతుంటే, రాజు వివరంగా జవాబులు చెబుతున్నాడు.

సరోజ తండ్రీ కూతుళ్ళ మాటలు వింటూ కూర్చుంది.



ప్రకాష్ ఇంటికి వెళ్ళి, స్నానపానాదులు పూర్తిచేసి, కాఫీ తెచ్చుకుని, పేపరు ముందేసుకుని, బ్రేక్‌ఫాస్టు టేబుల్ దగ్గర కూర్చున్నాడు. కమల కూడా తన రెండో డోస్ కాఫీ తెచ్చుకుని కూర్చుంది.

"డాక్టరు ఇవాళ చెబుతాడా... ఏం చేస్తారో" అడిగింది కమల.

"బహుశా ఇవాళ చెప్పడు. శని, ఆదివారాలు రాజుని హాస్పిటల్లో వుంచి విశ్రాంతి తీసుకోమంటారు. అతనికి మేజర్ సర్జరీయే జరిగింది. కనుక ఈ రెండు రోజుల్లోను శారీరకంగానే కాక, మానసికంగా కూడా కాస్త స్థిమితం వస్తుంది. డాక్టర్లు సోమవారం ట్రీట్‌మెంట్ ప్లాను ఆలోచించి, బహుశా ఆరోజు మధ్యాహ్నం చెబుతారు" అంటూ పేపరు పేజీలు తిప్పుతున్నాడు ప్రకాష్.

"ఏయ్... ఇది చూడు" అన్నాడు పేపరులోని ఫొటో చూపిస్తూ.

"ఏమిటది? " కుతూహలంగా అడిగింది కమల.

రాజు వున్న ఆసుపత్రిలోనే రెండు రోజుల క్రితం జరిగిన ఒక హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ ఆపరేషన్ గురించి రాసిన వార్త. అది డల్లాస్ నగరానికీ, ఆ ఆసుపత్రికీ కొత్తేమీకాదు. అక్కడ అవి మామూలుగా జరిగేవే. కాకపోతే ఆ వార్త పక్కనే వున్న ఫొటోలోని మనిషి, ప్రకాష్‌కి క్రితం రాత్రి హాస్పిటల్లో పరిచయమైన వృద్ధుడు. ఆయనకి గుండె పూర్తిగా దెబ్బతినటంవల్ల గుండె మార్పిడి జరిగిందిట. ఆయనకు గుండె దెబ్బతిన్నదికానీ హృదయం దెబ్బతినలేదు. ఆ వయసులో కూడా ఆయన ధైర్యంగా ఈ పరిస్థితిని ఎదుర్కొన్నాడు. అంతేకాదు తన శరీరానికి ఒక వ్యాయామ కార్యక్రమం నిర్ణయించి, దాని ప్రకారం తూచా తప్పకుండా ఎక్సర్‌సైజు చేస్తున్నాడు. ఆహార పానీయ నియమాలు పాటిస్తున్నాడు. తన మనోబలంతో ఎంత త్వరగా కోలుకుంటాడో అది కూడా వక్కాణించి చెప్పాడు ఆ పేపరు రిపోర్టరుతో. ఆ వార్త చదివిన తర్వాత ఆయన రాత్రి తనతో అన్న మాటలు గుర్తుకు వచ్చాయి ప్రకాష్‌కి. అదే అన్నాడు కమలతో.

"ఈయనకి తన గుండె చెప్పినమాట వినటంలేదుట. క్రమశిక్షణ నేర్పిద్దామని హాస్పిటల్‌కి తీసుకువచ్చాడుట. అక్కడ తన





గుండెకి ట్యూనప్ చేయించాడుట. ఆయన ఆ మాటలు అంటుంటే ఏదో బ్లడ్ ప్రెషర్ అతన్ని ఇబ్బందిపెట్టి వుంటుందనుకున్నాను కానీ గుండె మార్పిడి అయిందనీ, దాని గురించి ఆయన అర్ధరాత్రి కూడా తన వ్యాయామ కార్యక్రమంలో ఒక భాగమయిన ఆ నడకను అమలు పరుస్తున్నాడనుకోలేదు. ఆ క్రమశిక్షణ ఆయన గుండెకు కాదు, శరీరానికి కాదు, ఆయన మనస్సుకి, హృదయానికి"

"అవును... ఇక్కడి వాళ్ళకు యమధర్మరాజుతో పోట్లాట పెట్టుకుని, రానని మొండికేసే గుణం వుంది. అమెరికన్స్ ఏం చేసినా మనసా వాచా చేస్తారు. ఏదన్నా చేయాలని అనుకోవటమే ఆలస్యంకానీ, అమలుపరచటంలో మాత్రం ఎక్కడా వెనుకాడరు. అందుకే ఈ దేశం అంత ముందుకి పోతుంది"

కమల ఆమాట అన్నప్పుడు ప్రకాష్‌కి వాళ్ళ ఆఫీసులోని ఆంద్రూ గుర్తుకి వచ్చాడు. ఆంద్రూ, ప్రకాష్ డిపార్టుమెంటులోనే ఒక డ్రాఫ్ట్ పర్సన్. అంటే కంప్యూటర్ మీద ఇంజనీరింగ్ డ్రాయింగులు గీస్తుంటాడు.

ప్రకాష్ ఎప్పుడూ శాకాహారమే తినటం చూసిన ఆంద్రూ అడిగాడు. "నేనూ శాకాహారినే. నాకు మీ ఇండియన్ వంటలంటే చాలా ఇష్టం. ఒకరోజు మీ ఇంటికి నన్ను భోజనానికి ఆహ్వానిస్తావా? " అని.

అతను అడిగిన తీరు ప్రకాష్‌కి ఆశ్చర్యం కలిగించింది.

"దానికేం భాగ్యం! తప్పకుండా పిలుస్తాను" అన్నాడు. అంతేకాదు, తర్వాత వారం రోజుల్లోనే ఒక సాయంత్రం భోజనానికి రమ్మని ఆహ్వానించాడు.

"అంతా శాకాహారమే చేయమని మీ ఆవిడతో చెబుతావుకదూ. నాకు ఉల్లిపాయలు నిషిద్ధం కూడాను" అన్నాడు. ఆంద్రూ చాలా వింత మనిషిలా అనిపించాడు ప్రకాష్‌కి.

ఆంద్రూ భోజనం చేస్తున్నప్పుడు చెప్పాడు కమలతో "నేను ఆఫీసులో పనిచేసి సంపాదించేది, అపార్టుమెంటు అద్దెకీ, తిండికీ, బట్టలకీ సరిపోతాయి. కానీ నేను ప్రతి సంవత్సరం రెండువారాలు ఇండియాకు వెడతాను. ఆ ఖర్చుకి నా జీతం సరిపోదు. అందుకని కొన్ని సాయంత్రాలు, ఎన్నో వారాంతాలు, టాక్సీ నడుపుతాను. ఆ డబ్బులు కూడబెట్టి ఇండియా ప్రయాణానికి వాడుకుంటాను"

కమల అడిగింది "ఇండియా వెళ్ళి, అక్కడ మీరు ఏంచేస్తారు? " అని. అడిగిన తర్వాత అనుకుంది, అలా అడగటం సభ్యత కాదేమోనని.

ఆంద్రూ నవ్వాడు. ఒక్కక్షణం ఆలోచించి అన్నాడు. "అదొక మంచి ప్రశ్న. పదేళ్ళనించీ, ప్రతి సంవత్సరం వెళుతున్నాను కలకత్తాకి. అక్కడ రామకృష్ణ పరమహంస వారి ఆధ్యాత్మిక సంస్థ వుంది. అక్కడకు వెళ్ళి, చాలా విషయాలు తెలుసుకుంటాను. అదొక అలవాటయిపోయింది నాకు. ఇక్కడ కూడా ఆ మిషన్‌వారి సమావేశాలు ఎక్కడ జరిగినా వెళుతూనే వుంటాను. అమెరికా సాంకేతికంగా ప్రపంచానికి ఎంత అందించిందో, భారతదేశం ఆధ్యాత్మికంగా అంత అందించింది. నేను ఇక్కడ కంప్యూటర్ హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్‌లతోనూ, అక్కడ ఆత్మ పరమాత్మలతోనూ అవినాభావ సంబంధం ఏర్పరచుకున్నాను. మేబి ఐ యామ్ గెటింగ్ ది బెస్ట్ అవుటాఫ్ బోత్ ది వరల్డ్స్!"

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? " ఆంద్రూ ఆలోచనలలో మునిగివున్న ప్రకాష్‌ని అడిగింది కమల.

"కమిట్‌మెంటూ, మనోబలం అంటుంటే ఆంద్రూ గుర్తుకు వచ్చాడు! అతను ఇప్పుడు రెండు వారాల శెలవుమీద మళ్ళీ కలకత్తా

వెళ్ళాడు' అన్నాడు ప్రకాష్.

★ ★ ★

అదే సమయంలో సుధా, సురేష్‌లు హాస్పిటల్‌కి బయల్దేరారు.

సుధ కారు డ్రైవు చేస్తుంటే, సురేష్ సీటులో వెనక్కి వాలి, ఆమెనే చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

అతను తననే దీక్షగా చూడటం గమనించి అంది సుధ "ఏమిటి అలా చూస్తున్నావ్, ఏదో కొత్తగా చూస్తున్నట్టు"

"ఏమీలేదు. రేపు నాకేదయినా అయితే నువ్వు ఎలా వుంటావా అని" అన్నాడు సురేష్.

"రేపేకాదు, ఎల్లుండి కూడా ఏమీ కాదని, డాక్టరుగారి పెళ్ళాంగా గ్యారంటీ ఇస్తాను. సరేనా" అంది సుధ నవ్వుతూ.

సుధ, సురేష్‌లకు పెళ్ళయి రెండేళ్ళు దాటింది. ఇంకా పిల్లలులేరు.

"అది కాదు. సరిగ్గా చెప్పు" అన్నాడు సురేష్.

"నువ్వు డాక్టరుగా సంపాదించిన బంగారపు బిందెలు, మన పెరట్లో పాతిపెట్టాం కదా. నువ్వు పోతే, నెలకో బిందె తవ్వుకొని, ఖర్చుపెట్టుకుంటాను. దిగులు పడకు" అంది సుధ విరగబడి నవ్వుతూ.

సురేష్ కూడా నవ్వాడు. ఆమెచేతిని తన చేతిలోకి తీసుకుని, మృదువుగా వత్తుతూ అన్నాడు.

"అందుకే నీ తరహా నాకు బాగా నచ్చుతుంది సుధా. ఐ లవ్ యు. జీవితాన్ని నవ్వుతూ ఆడుతూపాడుతూ గడపటం







అందరికీ సాధ్యంకాదు. ముఖ్యంగా నాలాటి వాళ్ళకు. అందుకే నువ్వంటే ప్రేమే కాదు, అసూయగా కూడా వుంది నాకు"

సుధ అంది "ఏవో రెండు జోకులు వేయగానే, నాకు జీవితంమీద సీరియస్‌నెస్ లేదనుకోకు. నేనూ నీలాగానే రాత్రంతా, రాజు, సరోజల గురించి ఆలోచిస్తూనే వున్నాను. ఇండియానించి మనం ఇక్కడికి వచ్చినప్పటినించీ నేను కలిసిన వాళ్ళల్లో సరోజకు ఒక ప్రత్యేక స్థానం వుంది. సరోజ మాట్లాడే తీరు, హావభావాలు బెంగుళూరులోని మా అక్కయ్యను తలపింపచేస్తాయి. అందుకే సరోజంటే నాకొక విధమైన గౌరవం. ఆవిడకు కష్టంవస్తే నాకు వచ్చినట్టే బాధ పడిపోతాను"

"నాకు తెలుసు, సరోజ విషయంలో నీ సెంటిమెంటు. ఇంకో విషయం. మెడికల్ ప్రాక్టీసులో మా పార్ట్‌నర్ రాబర్ట్, నా గురించి ఏమంటాడో తెలుసా? నేను ఒక పెద్ద సెంటిమెంటల్ ఫూల్‌ననీ, మెడికల్ ప్రాక్టీసుకి పనికిరాననీ"

అందంగా నవ్వింది సుధ. "కరెక్టుగా చెప్పాడు. నువ్వు ఫూల్ వంటే నేను కూడా ఒప్పుకుంటాను. ప్రొఫెషనల్‌గా సెంటిమెంటల్‌గా వుండటం మంచిది కాదుకానీ, మనిషికి జీవితంపట్ల కొంచెం సెంటిమెంటు వుండటం అవసరం. అప్పుడే జీవితంమీద ప్రేమ ఎక్కువవుతుంది. దాంట్లో తప్పేమీ లేదు. అదే మనిషి, మరి డాక్టరయితే ఈ రెండు రకాల దృక్పథాలు అలవరచుకోవటం కష్టం కదా? అందుకని... బి వాట్ యు ఆర్... నువ్వు నీలాగానే వుండు. ఇతరులకు నీకు చేతనయినంత, చేయగలిగినంత సహాయం చేయి. అప్పుడే నీ జీవితానికి ఒక అర్థం కనిపిస్తుంది"

ఆమె చేతిని ముద్దుపెట్టుకున్నాడు సురేష్. గాలికి ఎగురుతున్న ఆమె ముంగురులను సరిదిద్ది అన్నాడు.

"ఆ డాక్టరు రాసిన ఇనీషియల్ రిపోర్టులను చూశాను. రాజు పరిస్థితి మనమనుకున్న దానికన్నా, సీరియస్‌గానే వున్నట్టు అనిపించింది"

సుధ చటుక్కున చూసింది సురేష్‌ని.

"ఈమాట ఎవరితోనూ అనకు. ముఖ్యంగా సరోజ, వినీతలతో. నేను అనుకున్నది తప్పయితే, నాకన్నా సంతోషించేవాడెవరూ వుండరు"

"అలాగే" అంది అక్కడే యూనివర్శిటీలో చైల్డ్ సైకాలజీలో పిహెచ్‌డి చేస్తున్న సుధ.

"ఈరోజు మధ్యాహ్నం, ఆ కాన్సర్ గురించి చదివి, కొన్ని విషయాలు అర్థంచేసుకోవాలి" అన్నాడు సురేష్.

కారు హాస్పిటల్ పార్కింగ్ లాట్‌లో ఆగింది.



కమల ఆ మధ్యాహ్నం పనులన్నీ పూర్తిచేసుకుని, హాస్పిటల్‌కి కారేజీ తీసుకువెళ్ళేసరికి, దాదాపు పన్నెండు గంటలయింది. రాజు నిద్రపోతున్నాడు. సరోజ పక్కనే కూర్చుని, రీడర్స్ డైజెస్ట్ చదువుకుంటోంది.

"ఎలావుంది రాజుగారికి" అడిగింది కమల.

"ఫరవాలేదు. బాగానే వున్నాడు. సర్జరీ చేసినచోట కొంచెం నెప్పిగా వుందిట. నర్సు మాత్రలు ఇచ్చింది"

"వినీత ఏదీ? " అడిగింది కమల.

"సుధ, సురేష్‌లు వచ్చారు. వినీతకు పిజ్జా యిష్టమని, దాన్ని తీసుకుని బయటకు వెళ్ళారు. ఇక్కడ వినీత లేకపోతే, నాకూ రాజుతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం వుంటుందని సుధ ఉద్దేశ్యమని నాకు తెలుసు" అంది సరోజ.

"మనసు విప్పి రాజుతో మాట్లాడావా? నిన్న ఆ మత్తులో అతను సరిగ్గా మాట్లాడలేకపోయాడు కదా"

"రాజు బాగా దెబ్బతిన్నాడు కానీ, త్వరగానే మానసికంగా పుంజుకున్నాడు. అతని ధైర్యం నాకు కూడా మంచి ధైర్యాన్నిస్తోంది" అంది సరోజ.

"త్వరలోనే అన్నీ సర్దుకుంటాయి. నువ్వు బెంగపడకు" అంటూ కమల కారేజీ విప్పింది.

"ఇది నీకు... ఇది మీ ఆయనకు" రెండు గిన్నెలు సరోజకు అందించింది.

"ఎందుకు కమలా, ఇన్ని చేశావు" అంది సరోజ.

"ఇన్ని చేయటమేమిటి నా మొఖం... ఒక కూర... చారునీళ్ళు... అంతే"

ఈలోగా బయట ఏదో చప్పుడు.

నర్సులు హడావిడిగా పరుగెత్తుతున్నారు.

సరోజ, కమల కూడా బయటకు వచ్చారు.

వెంటనే గుర్తుపట్టింది కమల. ఆయన గుండె మార్పిడి చేయబడిన వృద్ధుడు భోజనానంతరం తన నడక మొదలుపెట్టినట్టున్నాడు. అప్పుడే ఏదో హడావిడి అయినట్టుంది. నర్సులు ఆయన్ని పట్టుకుని ఆయన గదిలోకి తీసుకువెడుతున్నారు. వెంటనే డాక్టరు కూడా వచ్చాడు. ఆయన పరిస్థితి అంత బాగున్నట్టులేదు.

కమలకు ప్రొద్దున్న ప్రకాష్, తనూ అనుకున్న మాటలు గుర్తుకువచ్చాయి. బహుశా ఆయన యమధర్మరాజుతో పోట్లాటపెట్టుకుని, రానని మొండికేస్తున్నాడేమో.

ఇంతలోనే మళ్ళీ అనుకున్నది "ఛ! ఏమిటి ఈ అశుభపు మాటలు. ఆయనకేం ఫరవాలేదు"

సరోజ అడిగింది, "ఏమిటి ఆయనకేం ఫరవాలేదంటున్నావు. ఎవరి గురించి"

కమల బిత్తరపోయింది. "అలా అని అనుకున్నాను అంతే! అనలేదు. అనుకున్నాననుకుని పైకి అనేసి వుంటాను" అని తన మాటలకు తనే నవ్వేసింది.

అప్పుడు చెప్పింది ఆయన రాత్రి ప్రకాష్‌తో మాట్లాడిన సంగతి, పేపర్లో ఆయన ఇంటర్వ్యూ విషయాలన్నీ.

"ప్రకాష్ చెప్పినదానివల్లా, పేపర్లో చదివినదానివల్లా, ఆయన మనోబలంతో, బయటపడతాడనిపిస్తోంది నాకు"

ఆయన గది తలుపు వేసి వుంది. లోపల కనీసం అరడజనుమంది ఆయనతోసహా, యమధర్మరాజుతో పోట్లాడుతున్నారు.

ఇంతలో పిజ్జా హట్‌నించి వినీతను తీసుకు వచ్చింది సుధ. సురేష్ రాలేదు. పాంక్రియాటిక్ కాన్సర్‌మీద యింకా వివరాల సేకరణకోసం యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్ళాడు. వినీత సరాసరి రాజు మంచం దగ్గరికి వెళ్ళి పక్కనే కూర్చుంది.

సరోజ, కమల, సుధ మాటల్లో పడ్డారు.

ఎదురు గది తలుపులు తెరుచుకున్నాయి. హాస్పిటల్ స్టాఫ్ అందరూ వెళ్ళిపోయారు.

కమల లేచి వెళ్ళి, ఆ గదిలోనించి బయ





టకు వచ్చిన నర్సుని కుతూహలంగా అడిగింది "హావీజ్ హి డూయింగ్" అని.

"ఓ! హి ఈజ్ డూయింగ్ ఫైన్... హి యీజ్ ఎ ఫైటర్ యు సీ!" అంది నర్సు నవ్వుతూ.

"ఈసారి కూడా యమధర్మరాజు ఓడిపోయాడన్నమాట" అనుకుంది కమల.



శనివారం సాయంత్రం ఐదుగంటల సమయం. చాలామంది ఇండియన్ మిత్రులు, సూసాన్ పార్కర్‌తో సహా కొంత మంది అమెరికన్ మిత్రులు హాస్పిటల్‌కు వచ్చారు రాజుని చూడటానికి. పూలూ, గ్రీటింగ్ కార్డులూ తీసుకువచ్చారు.

రాజు ఆఫీసునించీ ఇద్దరు అమెరికన్లు వచ్చారు. అమాండా నల్ల అమ్మాయి. రాజు గ్రూపులోనే ప్రోగ్రామరుగా పనిచేస్తుంది. 30 ఏళ్ళు వుంటాయేమో. సన్నగా, పొడుగ్గా చాలా అందంగా వుంది. ఆ అమ్మాయి మాట్లాడేటప్పుడు తల ఎగరేసి, వాక్యాలు సాగదీస్తూ మాట్లాడేతీరు చూడముచ్చటగా వుంది. క్రిస్ తెల్లఅతను. రాజుతోపాటే ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఇద్దరూ కలసి ఆఫీసులోని శ్రేయోభిలాషులందరి తరఫునా వచ్చారు. పెద్ద పూలబుట్ట, గ్రీటింగ్ కార్డు తీసుకు వచ్చారు. రంగురంగుల పూలతో, పచ్చటి ఆకులతో అందంగా వుంది పూలపొందిక. గ్రీటింగ్ కార్డుమీద 'గెట్ వెల్' అని పెద్ద అక్షరాలతో రాసివుంది. ఆఫీసులోని రాజు మిత్రులందరూ సంతకాలు పెట్టారు. త్వరగా కోలుకుని, ఆరోగ్యవంతంగా ఆఫీసుకి తిరిగి రావాలని రాశారు. కొంతమంది హాస్య ధోరణిలో రాశారు.

అమాండా అక్కడ వున్న అందరినీ నవ్వుతూ పలకరించింది. గబగబా రాజు దగ్గరకు వెళ్ళి, "హవ్వార్యూ? " అంటూ కౌగలించుకుంది.

రాజు నవ్వుతూ "బాగానే వున్నాను" అన్నాడు.

క్రిస్ రాజు చేయి పట్టుకుని "నువ్వు త్వరగా కోలుకోవాలని రేపు మా చర్చిలో దేవుడ్ని ప్రార్థిస్తాను" అన్నాడు.

రాజు చిరునవ్వుతో "అలాగే! థాంక్స్" అన్నాడు కొంచెం ఆగి "ప్రాజెక్ట్ ఎలా నడుస్తోంది? " అని అడిగాడు.

"నీకు పూర్తిగా తగ్గేదాకా, ఆఫీసు సంగతీ, ప్రాజెక్ట్ సంగతీ మరచిపో. నువ్వు ఆఫీసుకి తిరిగి వచ్చాక చాలా పనులున్నాయి. అప్పుడెలాగూ తప్పదు" నవ్వుతూ అంది అమాండా.

"అవును! నువ్వు నిశ్చింతగా వుండు. ఆఫీసుకి వచ్చాక చూసుకుందాం అన్నీ" అన్నాడు క్రిస్.

వాళ్ళిద్దరూ ఒక పావుగంట కూర్చుని వెళ్ళిపోయారు.

రాజు అన్నాడు సరోజతో "వీళ్ళిద్దరూ చాలా మంచివాళ్ళు. మంచి స్నేహితులు"

"అవును! వారాంతపు సరదాలు, పనులు వదిలేసి శనివారం యిలా పలకరించటానికి వచ్చారంటే, వాళ్ళు నీ ఆరోగ్యం గురించి ఆలోచిస్తున్నారని తెలుస్తోంది" అంది సరోజ.



సోమవారం మధ్యాహ్నం మూడున్నర

గంటల సమయం.

హాస్పిటల్లో రాజు, సరోజలు మాట్లాడు కుంటుండగా వచ్చాడు సురేష్.

సురేష్ రాజుతో అన్నాడు, "డాక్టర్ బర్ఫ్ వాళ్ళ టీమ్‌తో నీ కేసు గురించి మాట్లాడా డుట. ఇంకాసేపట్లో వచ్చి, తన ట్రీట్ మెంటు ప్లాను గురించి మాట్లాడతాన న్నాడు. ఆ సమయంలో నేను ఇక్కడ వుంటే బాగుంటుందని వచ్చాను"

"థాంక్స్ సురేష్... ఆయన వచ్చే సమ యానికి నువ్విక్కడ వుంటే బాగుంటుందని సరోజతో ఇంతకుముందే అన్నాను" అన్నాడు రాజు.

"ఇప్పుడెలావుంది? " అడిగాడు సురేష్.

"బాగానే వున్నాను" అదోలా నవ్వాడు రాజు.

ఈలోగా డాక్టర్ బర్ఫ్ వచ్చాడు. చేతిలో ఛార్టు వుంది.

అందర్నీ నవ్వుతూ పలకరించాడు. ఆయన కుర్చీ ముందుకి లాక్కుని కూర్చుని గొంతు సవరించుకున్నాడు. సరోజ రాజు పక్కనే మంచంమీద కూర్చుంది. సురేష్ పక్కనే వున్న ఇంకో కుర్చీ దగ్గరకు లాక్కుని కూర్చున్నాడు.

"నేను మా టీమ్‌తో వివరంగా మాట్లా డాను. అన్ని టెస్టుల రిజల్టుని జాగ్రత్తగా పరిశీలించాను. రాజుకి వచ్చిన కాన్సర్ మామూలుగా వచ్చే కాన్సర్ కాదు. ఆరోజు చెప్పినట్టుగా, నయంకాదని కానీ, మనమేమీ చేయలేమని కానీ నేను అనటంలేదు. ఒక కోర్సు ఇంజక్షన్లు, మాత్రలూ వాడదాం. వారానికి రెండురోజులు కీమోథెరఫి చేద్దాం. వాటికి రెస్పాన్స్ ఎలా వస్తుందో చూద్దాం. దాన్నిబట్టి, ఇదే ట్రీట్‌మెంట్ కొనసాగించ టమో, మార్చటమో చేయవచ్చు"

సరోజ అడిగింది "కీమోథెరఫీ అంటే ఏమిటి? దానివల్ల వేరే ఇబ్బందులు, ప్రాబ్లమ్స్ వస్తాయా? "

"కీమోథెరఫీలో కొన్ని కెమికల్స్‌ని, ఇంట్రా వీనస్ పద్ధతిలో అంటే సూదిద్వారా రక్తం లోకి ఎక్కిస్తారు. ఇచ్చే డోసునిబట్టి కొన్ని గంటలు పట్టవచ్చు. ఈ టాక్సిక్ కెమికల్ శరీరంలోని కాన్సర్ సెల్స్‌ని చంపుతుంది. ఇదొక పద్ధతి. రేడియేషన్ ఇవ్వటం ఇంకో పద్ధతి. కాన్సర్ ఒక వుండులాగా వుంటే, రేడియేషన్ ఇచ్చి దాన్ని నిర్మూలించే అవ కాశం వుంది. రాజు విషయంలో అది వుండులాగాకాక మొత్తం వ్యాపించి వుండ టంతో, కీమో చేద్దామని నిర్ణయించాం. కాన్సర్ సెల్స్ కిడ్నీ, లివర్‌లకు వ్యాపించి అక్కడ పెరగటం మెటాస్టిసిస్ అంటారు. ఈ కీమో వల్ల కాన్సర్ సెల్స్ చచ్చిపోతాయి అని చెప్పాను కదా, దానివల్ల ఒక ప్రమాదం కూడా వుంది. కాన్సర్ సెల్స్‌తోపాటు, మంచి సెల్స్ కూడా నిర్మూలింపబడే అవ కాశం వుంది. మేము వివిధ పరీక్షలు చేస్తుంటాము కనుక, ఏమి జరుగుతున్నదీ గమనిస్తూనే వుంటాము. ఇక దానివల్ల జుట్టు ఊడిపోవటం, బరువు తగ్గటం, ఆహారం సయించకపోవటంలాటివి కూడా జరిగే అవకాశం వుంది"

"ఇంతా చేసిన తర్వాత, తగ్గే అవకాశాలు ఎలా వున్నాయి. అసలు తగ్గుతుందం టారా? "

ఆయన అన్నాడు "చెప్పాను కదా. ఈ రకం వ్యాధి మాక్కూడా కొత్తేనని. మానవ ప్రయత్నం చేద్దాం. మనకు వైద్యశాస్త్రం నేర్పిన పద్ధతులన్నీ ఉపయోగిద్దాం"

సురేష్ డాక్టర్ బర్ఫ్‌తో చాలాసేపు మాట్లాడాడు. ఆ మాటలన్నీ సాంకేతికప రంగా వుండటంవలన సరోజకు అర్థం కాలేదు.

"ట్రీట్‌మెంట్ ఈరోజునించే మొదలుపె డదాం. మీరు ఈ రాత్రికి హాస్పిటల్‌లోనే వుండండి. రేపు ప్రొద్దున్నే ఇంటికి వెళ్ళ వచ్చు. మీకు డ్రిప్ పెట్టటానికి, పరికరాలు అన్నీ ఇంటికి పంపిస్తాను. ప్రతివారం కీమో థెరఫీ తీసుకోటానికి రెండు రోజులు ఇక్క




డికి వద్దురుగాని. కొన్ని గంటలు వుండి. ఇంటికి వెళ్ళవచ్చును" అన్నాడు డాక్టర్ బర్ప్ రాజుతో.

సరోజ అడిగింది "కొన్నిరోజులు హాస్పిటల్లోనే వుంటే మంచిదేమోకదా"

"మంచిదేకానీ, ఆ అవసరంలేదు. మందులు మాత్రం చెప్పిన ప్రకారం వేయండి. కీమో చేయించుకోండి. అవసరమయితే ఫోన్ చేసి చెప్పండి. నేను మీతోనూ, హాస్పిటల్ తోనూ టచ్ లో వుంటాను" అన్నాడు బర్ప్

అందరికీ షేక్ హాండ్ యిచ్చి, హడావిడిగా వెళ్ళిపోయాడు.

★ ★ ★

డాక్టర్ బర్ప్ అనుకున్నట్టుగా ఆరోజు నుంచే ట్రీట్ మెంట్ మొదలుపెట్టాడు. రాజు అన్నీ ఆయన చెప్పిన ప్రకారం చేస్తూనే వున్నాడు. వారానికి రెండు రోజులు హాస్పిటల్ కి వచ్చి, కీమోథెరపీ తీసుకుంటున్నాడు. దానివల్ల బాగా నీరసపడిపోయాడు కూడాను. ఆఫీసుకి రోజూ వెళ్ళలేకపోతున్నా, ఇంట్లోనించే. పనిచేయటం, మధ్యమధ్యలో ఆఫీసుకి వెళ్ళి రావటం చేస్తున్నాడు. మేనేజర్ మంచివాడు అవటంవల్ల, పనికొంచెం అటూయిటూ అయినా, మిగతా వాళ్ళచేత చేయించి సహాయపడుతున్నాడు.

★ ★ ★

ఒక సాయంత్రం విష్ణుశర్మగారింట్లో పార్టీ అవుతున్నప్పుడు కలిశారు ప్రకాష్, సురేష్. ఇంటివెనుక ఆరుబయట చల్లటి గాలివీస్తూ వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. ఒక పక్క అమెరికా రాజకీయాలు, ఇంకోపక్క సినిమా చర్చలతో సందడిగావుంది. ప్రకాష్ని పక్కకు పిలిచాడు సురేష్.

అందరికి కొంచెం దూరంగా వచ్చాక, కోక్ తాగుతూ అన్నాడు సురేష్ "నేను రాజుకి వచ్చిన కాన్సర్ గురించి క్షుణ్ణంగా చదివాను. అతనికి తగ్గుతుందని నేను అనుకోను"

చటుక్కున తల ఎత్తాడు ప్రకాష్. "నిజంగానా!" అన్నాడు.

"అవును అది చాలా అరుదుగా వచ్చే కాన్సర్. అలాటివి చాలా తక్కువ కేసులు వున్నాయి. వాటిల్లో బతికి బయటపడ్డ వారెవరూ లేరు"

"మరి నివారణకు మందులేవీలేవా?" అడిగాడు ప్రకాష్.

"లేవనే చెప్పాలి. రీసెర్చి చేయటానికి తగినన్ని కేసులు, సమాచారం, లేకపోవటంవల్ల ఆ రంగంలో ఎక్కువ రీసెర్చి జరగలేదు. కాకపోతే మామూలుగా కాన్సర్ కి వాడే పద్ధతులతో వైద్యం చేస్తారు"

"హ్యూస్టన్ లోని యం. డి. ఏండర్సన్ హాస్పిటల్లోనూ అంతేనా?"

"రీసెర్చి ఎక్కువ జరగలేదు అన్నాను కానీ, అసలు జరగటంలేదు అనలేదు. ఇక్కడ తగ్గకపోతే, అక్కడ ప్రయత్నం చేద్దాం. ఇక్కడ కీమోథెరపీకి రెస్పాన్స్ వచ్చి, రాజుకి తగ్గితే అంతకన్నా సంతోషకరమైన విషయం వుండదు"

"అవును. మనం యివన్నీ ముందే ఆలోచించుకుని, ఒక ప్లాన్ ప్రకారం పోదాం. కీమోథెరఫీ ఫలితాలు తెలిసేలోగా మనం కొంచె హోంవర్క్ చేయటం మంచిది" అన్నాడు ప్రకాష్.

సురేష్ కూడా ప్రకాష్తో ఏకీభవించాడు.

"ఏమిటి? ఇద్దరూ దూరంగా నుంచుని ఏవో మంతనాలు చేస్తున్నారు" అన్నాడు నారాయణ అక్కడికి వస్తూ. నారాయణ, అతని భార్య శ్యామల డల్లాస్ పక్కనే వున్న ఫోర్ట్ వర్త్ లో ఉంటారు. నారాయణకి రెండు నెలల క్రితం ఉద్యోగం పోయింది. అయినా బాగా అనుభవమున్నవాడూ, తెలివిగలవాడూ కావటంతో, వెంటనే హ్యూస్టన్ లో ఇంకా ఎక్కువ జీతంతో మంచి ఉద్యోగం దొరికింది. అప్పటినించీ హ్యూస్టన్ లో అపార్టుమెంటు అద్దెకు తీసుకుని వుంటున్నాడు. సోమవారం ప్రొద్దున్నే అయిదు గంటలకి

బయల్దేరి, ఎనిమిదిన్నరకల్లా హ్యూస్టన్ చేరుకుంటాడు. శుక్రవారం దాకా అక్కడ పని చేసి, సాయంత్రం ఆఫీసు అయిపోగానే అయిదుగంటలకు బయల్దేరి, ఎనిమిదిన్నరకి డల్లాస్‌కి వచ్చేస్తాడు. మళ్ళీ డల్లాస్- ఫోర్ట్‌వర్త్‌లలో ఉద్యోగం వచ్చే అవకాశం వుందనీ, శ్యామల అక్కడే మంచి ఉద్యోగంలో వుందనీ, పిల్లలు కూడా అక్కడే స్కూలుకి వెడుతున్నారని, నారాయణ ఆ ఊళ్ళోనే వుండిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అందుకే వారం వారం రానూ పోనూ నాలుగు వందల మైళ్ళు డ్రైవు చేస్తున్నాడు.

ప్రకాష్ నవ్వాడు. "మీకు తెలియకుండా చేసే మంతనాలు ఏముంటాయండీ. మన రాజు విషయం మాట్లాడుతున్నాం"

నారాయణ అన్నాడు "అవును. శ్యామల అంతా చెప్పింది. వెరీ అన్‌ఫార్చునేట్. అతన్ని చూడటానికి వెడదామనుకున్నాను కానీ, పనుల వత్తిడి వల్ల వెళ్ళలేకపోయాను. వచ్చే వారాంతం వెళ్ళివస్తాను. ఇప్పుడు రాజుకి ఎలావుంది"

ప్రకాష్ చెప్పాడు.

"రాజులో ఒక ప్రత్యేకత వుంది. ఎవ్వరితోనూ ఎక్కువ మాట్లాడడు. కానీ అందరితోనూ స్నేహంగా, ఆప్యాయంగా వుంటాడు. ఎప్పుడూ, ఎక్కడా మనసులో ఏముందో బయటపడడు. అందరి మంచీ అభిలాషించే వ్యక్తి. అటువంటి మనిషికి, ఇటువంటి జబ్బు రావటం దురదృష్టం. మనం అందరం అతనికి ధైర్యం చెప్పాలి. మనోధైర్యంతో ఇలాటి జబ్బులు నయం అవటంలో వింతలేదు. చాలా కేసులు విన్నాం కూడాను" అన్నాడు నారాయణ.

"అవును. మెడికల్ జర్నల్స్‌లో కూడా రాస్తుంటారు. డాక్టర్లు లాభంలేదని వదిలివేసిన ఎన్నో రోగాలను కేవలం మానసికబలంతో ఎదుర్కొని, నయమైనవారి గురించి చదివాను. రాజుకి ఆ ధైర్యం, పట్టుదలా వున్నాయని నా నమ్మకం" అన్నాడు సురేష్.

"ఇప్పుడు యిస్తున్న ట్రీట్‌మెంట్‌తో తగ్గుతుందని నాకు బాగా అనిపిస్తోంది" అన్నాడు ప్రకాష్.

"నావల్ల ఏ సహాయం కావాలన్నా చెప్పండి. సిద్ధంగా వున్నాను" అన్నాడు నారాయణ.

"తప్పకుండాను" అన్నాడు ప్రకాష్.

★ ★ ★

అదే సమయంలో అప్పుడే భోజనంచేసి టివి చూస్తున్న రాజుతో అంటోంది సరోజ.

"నీకు పూర్తిగా తగ్గేదాకా పక్కన మనవాళ్ళెవరైనా వుంటే బాగుంటుందనిపిస్తోంది. ఏమంటావ్? "

"ప్రకాష్, కమల, సురేష్, సుధ ఉన్నారు కదా"

సరోజ నవ్వింది. "ఉన్నారు. చాలా సహాయం చేస్తున్నారు కూడాను. కానీ మన దగ్గరవాళ్ళు, అంటే మా చెల్లెలు లలితను వచ్చి కొన్నాళ్ళు నీకు తగ్గేదాకా ఉండమంటే? "

ఒక్కక్షణం ఆలోచించాడు రాజు. "అవును. బాగానే వుంటుంది. కానీ పిల్లల్ని వదలి రావటానికి కుదురుతుందా? రమణ అటు ఆఫీసు, ఇటు సంసారంతో సతమతమవుతాడేమో..."

"ఫోన్‌చేసి కనుక్కుందాం ఇప్పుడే. వాళ్ళకి ఇబ్బంది లేకుండా వుంటేనే రమ్మందాం. లలిత నా పక్కన వుంటే నాకు కొండంత బలం" అంది సరోజ.

రాజు సరోజవేపు నవ్వుతూ చూశాడు. "ఫోన్‌చేసి చూడు" అన్నాడు.

సరోజ వెంటనే లేచి తెనాలిలోని చెల్లెలు లలితకు ఫోన్ చేసింది. రమణ ఫోన్ తీసుకున్నాడు.

"హలో... హలో... హలో..." అరుస్తున్నాడు పెద్దగా.

"నేనండి సరోజని... అమెరికానించి" అంది సరోజ.

"అందరూ బాగున్నారా అక్కడ. ఉండండి




లలితను పిలుస్తాను" అంటూనే లలితా. లలితా అంటూ పెద్దగా కేకపెట్టాడు రమణ.

"హలో... హలో" మళ్ళీ పెద్దగా అన్నాడు రమణ.

"నాకు బాగానే వినిస్తున్నది. లలిత పనిలో వుందేమో. రానీండి. మీరు ఎలా వున్నారు? " అడిగింది సరోజ.

"హలో... హలో బాగానే వున్నాం. ఉండండి లలిత వచ్చింది" అని ఫోన్ లలితకు ఇచ్చాడు రమణ.

"ఏం అక్కయ్యా! బాగున్నావా? " అడిగింది లలిత.

"ఆ బాగానే వున్నానే. రమణలో ఆ హడావిడి మాత్రం తగ్గలేదు" అంది సరోజ నవ్వుతూ.

"అవును. ఎన్నిసార్లు చెప్పినా అంతే. ఫోన్‌లో మాట్లాడిన ఐదు నిమిషాల్లోనూ, మూడు నిమిషాలు హలో, హలో అంటూనే వుంటాడు" అంది లలిత కూడా నవ్వుతూ.

"ఇంతకీ పిల్లలు, నువ్వు ఎలావున్నారు? "

"మేమంతా సుబ్బరంగా వున్నాం కానీ, బావగారు ఎలా వున్నారు? ఇక్కడ ఉన్నన్నాళ్ళూ చాలా బాధపడ్డారు పాపం"

సరోజ ఒక్కక్షణం మాట్లాడలేదు. "ఫరవాలేదు. బాగానే వుంది. కానీ కొన్నాళ్ళు పట్టేట్టువుంది. అందుకే నువ్వు వస్తే బాగుంటుందని అనుకుంటున్నాం"

లలిత అడిగింది. "కొన్నాళ్ళు పడుతుంది అంటే? ఇంతకీ అసలు ప్రాబ్లం ఏమిటో చెప్పారా? "

"చెప్పినా నీకు అర్థం కాదులే. నాకూ అర్థం కాలేదు. నువ్వు వస్తే తోడుగా వుంటుందని. రాగలవా? "

"రాగలవా ఏమిటి నీ ముఖం. నాకు అలాటి అవసరం వచ్చి రమ్మంటే నువ్వు రావా? తప్పకుండా వస్తాను. కానీ నిజంగా నేను రావలసిన అవసరం వుందా? నాకు రావటం ఇష్టంలేదని అనుకోకు. మీకు ఎందుకు అన్ని డబ్బులు ఖర్చు అని అడుగుతున్నాను"

"ఆ అవసరం వుందనేకదా రమ్మంటున్నది" అంది సరోజ నెమ్మదిగా.

"నువ్వేదో దాస్తున్నావే అక్కయ్యా! నా దగ్గర దాపరికాలెందుకు. అసలేమయింది? " లలిత గొంతులో వణుకు తెలుస్తున్నది.

సరోజ ఒక్కక్షణం ఆగి, గాద్గదికమైన గొంతుని సవరించుకుని అంది, "ఏమీలేదు. కొంచెం క్రానిక్ డిసీజ్. హాస్పిటల్ చుట్టూతా తిరగటం, వినీతను ఇంట్లో వదలివేయటం, అటు నేను స్కూల్లో క్లాసులకి పోవటంతో కష్టమవుతుందని పక్కన నీలాటివాళ్ళు తోడుంటే బాగుంటుందనీ నేనూ, రాజూ అనుకున్నాం. అంతకన్నా ఏంలేదు. మరి నువ్విక్కడికి వస్తే రమణకీ, పిల్లలకి ఎలాగ? రమణ మేనేజ్ చేయగలడా? "

"అమ్మను ఇక్కడికి వచ్చి వుండమంటాను. పిల్లల్ని చూసుకుంటుంది. పిల్లలు కూడా అమ్మంటే ఇష్టపడతారు. మా ఆయనకు కూడా వేళకు కాస్త వండి పడేస్తుంది"

"చాలా థాంక్స్ లలితా. రేపు సోమవారం నీకు వీసాకు కావలసిన కాగితాలు అన్నీ స్పీడ్‌మైల్‌లో పంపిస్తాం. అవి అందగానే నీ పాస్‌పోర్ట్ తీసుకుని మద్రాసు వెళ్ళి వీసా తెచ్చుకో. ఆ విషయాలన్నీ రాజు ఉత్తరంలో వివరంగా రాస్తాడులే. ఈలోగా మేం టిక్కెట్టు విషయం అవీ కనుక్కుంటాం. సరేనా? " సరోజకు లలిత వస్తున్నదంటే చాలా సంతోషంగా వుంది.

"సరే అక్కయ్యా! నీ ఇష్టం" లలితకు ఇంకా అనుమానంగానే వుంది. సరోజ ఏదో దాస్తున్నదని. అయినా ఆమెను గట్టిగా నిలదీసి అడగదలుచుకోలేదు. వివరాలన్నీ తెలియకపోయినా, తనకు ఎంతో ప్రియమైన అక్కయ్య మొదటిసారిగా తన సహాయం అడుగుతున్నది. ఎంత అవసరమైతే అలా అడుగుతుంది. సరోజ దగ్గరవున్న చనువు కన్నా ఆమె మీద వున్న ప్రేమ, గౌరవం,

లలితను ఇక మాట్లాడనీయలేదు.

కాసేపు లలితతోనూ, పిల్లలతోనూ మాట్లాడింది సరోజ.

"డాక్టర్లు చెప్పిన వివరాలు ఏమీ లలితతో చెప్పలేదుకదా? " అడిగాడు రాజు సరోజ ఫోన్ పెట్టేయగానే.

"లేదు. వాళ్ళనందర్నీ కూడా ఎందుకు గాభరా పెట్టటం అని చెప్పలేదు" అంది సరోజ.

"అవును. నేనూ అదే అనుకున్నాను" అన్నాడు రాజు, సరోజను దగ్గరకు తీసుకుంటూ.

★ ★ ★

సోమవారం పొద్దున్నే వినీతను స్కూల్లో దించి, రాజుని తీసుకుని బ్యాంక్‌కి వెళ్ళింది సరోజ. లలిత వీసా కోసం బ్యాంక్ బాలన్సు స్టేట్‌మెంటు కావాలని అడిగింది. అక్కడి క్లర్కు అయిదు నిమిషాల్లో అడిగిన కాగితాలు ప్రింటుచేసి ఇచ్చింది. అవి తీసుకుని రాజుని ఆఫీసులో దించేసరికి సమయం తొమ్మిదిన్నరయింది. రాజు కంపెనీ పర్సనల్ ఆఫీసుకి వెళ్ళి తను ఆ కంపెనీలో ఎన్నేళ్ళుగా పనిచేస్తున్నాడో, అతనికి జీతమెంత వస్తుందో తెలిపే స్టేట్‌మెంట్ తీసుకున్నాడు. అంతకుముందే నింపిన ఇమ్మిగ్రేషన్ డిపార్టుమెంట్‌వారి ఫారంమీద నోటరీ సంతకం చేయించాడు. ప్రతి పెద్ద ఆఫీసులోనూ నోటరీలు వుండటం, వాళ్ళు అక్కడ పనిచేసేవారికి ఉచితంగా నోటరీ సంతకాలు పెట్టటం అమెరికాలో సహజమే.

"ఇది పోస్ట్‌చేసి స్కూలుకి వెడతాను. మళ్ళీ సాయంత్రం వచ్చి ఇంటికి తీసుకువెడతాలే. ఈలోగా అవసరమైతే పిలు" అని బయల్దేరింది సరోజ.

సరోజ తన ఒరాకిల్ క్లాసులకి తాత్కాలికంగా స్వస్తి చెప్పేసింది, రాజు వద్దన్నా వినకుండా.

"నీకు పూర్తిగా తగ్గనీ. క్లాసులదేముంది. మళ్ళీ తీసుకోవచ్చు" అని రాజుకి నచ్చచెప్పింది.

ఇంకొక రెండు వారాలు గడిచాయి. ట్రీట్‌మెంట్ యధావిధిగా నడుస్తున్నది. రాజులో కొంచెం ఉత్సాహం పుంజుకుంది కూడాను. ముఖం చాలా తేటగా వుంది. కొద్దిగా బరువు తగ్గాడు. మిత్రులందరూ ఎవరికి వీలున్నప్పుడు వాళ్ళు రాజు ఇంటికి వెళ్ళి చూసివస్తున్నారు.

"వీళ్ళు ఇస్తున్న ట్రీట్‌మెంట్ పనిచేస్తున్నట్టుంది" అంది కమల

"అవును. వచ్చే వారంనించీ వారానికి ఐదు రోజులూ ఆఫీసుకి వెడతానంటున్నాడు రాజు. ఇలా రోజురోజుకీ మెరుగవుతుంటే త్వరలో పూర్తిగా నయమయ్యే అవకాశాలు కనిపిస్తున్నాయి" అన్నాడు ప్రకాష్.

"పాపం సరోజ, వినీత బాగా నలిగిపోతున్నారు. వినీతతో రాజుకి ఆపరేషన్ అయిందనీ తగ్గిపోతుందనే చెప్పారు కానీ అంతకన్నా వివరాలు చెప్పలేదు. చెప్పకపోవటమే మంచిదయిందేమో" అంది కమల సాలోచనగా.

ఆరోజు సాయంత్రం సరోజ కమలకు ఫోన్‌చేసి చెప్పింది, రాజు పరిస్థితి బాగానే ఉన్నదనీ, ఆరోజు మొక్కలకీ, లాన్‌కీ నీళ్ళు కూడా పెట్టాడనీ అంతేకాదు దోసకాయ, గోంగూర విత్తనాలు ఉన్నాయేమో, కమలనడిగి కనుక్కోమన్నాడని చెప్పింది.

"విత్తనాలకేం భాగ్యం, ఈసారి కలిసినప్పుడు ఇస్తాను" అంది కమల.

ఆరోజు రాత్రి ఇండియానించి కలెక్ట్ కాల్ వచ్చింది సరోజకు, తెనాలినించి లలిత.

"బావగారికి ఎట్లావుందే అక్కయ్యా? " అని అడిగింది లలిత.

"ఇప్పుడు చాలా నయం. నీ వీసా సంగతి ఏమయింది? " సరోజ అడిగింది.

"నేనూ, రమణా నిన్ననే మద్రాసునించి వచ్చాం. వాళ్ళు వీసా ఇవ్వలేదు"

"రాజుని రెండో ఫోన్ తీసుకోమని సంజ్ఞ చేసింది సరోజ.




"ఏం... ఎందుకని? " అడిగింది సరోజ.

"నాలాగా కొంచెం వయసులో వున్న వాళ్ళకి ఈమధ్య విజిటర్ వీసాలు ఇవ్వటం లేదు. అందులోనూ మీరు అమెరికాలో ఉన్నారు కనుక నేను ఇండియాకు తిరిగిరా కుండా అక్కడే వుండిపోతానని వీసా ఇవ్వమన్నారు. అమ్మ వయసు వాళ్ళకయితే ఆ అభ్యంతరం వుండదుట"

"ఏడిశారు. అదేం రూలు. మీ ఆయనా, పిల్లలూ ఇండియాలో ఉంటే నువ్విక్కడెలా ఉండిపోతావు. ఆ మాత్రం లోకజ్ఞానం లేదూ వాళ్ళకి" అంది కోపంగా సరోజ.

"లలితా! నాకు ఆరోగ్యం బాగా లేదనీ, అందుకనే వెడుతున్నాననీ చెప్పావా? " అడిగాడు రాజు.

"చెప్పాను బావగారూ. వాళ్ళు వినలేదు. ఈమధ్య చాలామంది ఇలాంటి వంకలు పెట్టి మోసం చేసి వీసాలు తీసుకుంటున్నారుట. అలా వీసాలు తీసుకుని అమెరికాలో వుండిపోయి గ్రీన్‌కార్డుకి తంటాలుపడి అది ఎలాగో తెచ్చుకుని అక్కడే ఉండిపోతున్నారుట. అందుకని వీసాలు ఇవ్వటంలో ఇక్కడ చాలా స్ట్రిక్ట్‌గా వున్నారుట. నేను ఎంత చెప్పినా వినలేదు" అంది లలిత.

"నన్ను కొంచెం ఆలోచించుకోనీ. రెండు రోజుల్లో మళ్ళీ ఫోన్‌చేసి చెబుతాను ఏంచేస్తే బాగుంటుందో" రాజు అన్నాడు.

"లలిత రాకపోతే ఎలా? ఇక వేరే మార్గాలేమీ లేవా? అయినా అవేం రూల్సు. వీళ్ళ తలకాయ రూల్సు" ఫోన్ పెట్టేసిన తర్వాత అంది సరోజ.

"వీళ్ళననటానికీ లేదు. మనవాళ్ళు చాలా మంది చూట్టానికి వచ్చినట్టు వచ్చి ఇక్కడే ఉండిపోతున్నారు మరి. చూద్దాం. మన సుంటే మార్గం ఉండకపోదు" అన్నాడు రాజు.

ఆమాటే అన్నాడు రాజు ప్రకాష్‌తో.

"మన నారాయణగారు ఒకసారి ఏదో వారాంతపు భోజనాల పార్టీలో రాజకీయాలు మాట్లాడుకుంటున్నప్పుడు నాతో అన్నారు. మన కాంగ్రెస్‌మన్ (ఇండియాలో మన పార్లమెంట్ మెంబరులాగా అన్నమాట) వాళ్ళ ఆఫీసుకి ఫోన్ చేస్తే వాళ్ళు సహాయం చేస్తారని. నేను వివరాలు కనుక్కుంటానులే. ఏ పుట్టలో ఏ పాముందో చూద్దాం" అన్నాడు ప్రకాష్.

వీసాకి కావలసిన వివరాలు, కాగితాలు అన్నీ రాజు దగ్గర తీసుకున్నాడు ప్రకాష్.

"మర్నాడు పొద్దున్న ప్రకాష్ హ్యూస్టన్ లోని నారాయణకి ఫోన్ చేశాడు.

కొన్ని నిమిషాలు పిచ్చాపాటి మాట్లాడిన తర్వాత ప్రకాష్ అన్నాడు, "రాజు మరదలు లలితకు, మద్రాసులో వీసా ఇవ్వలేదుట. మీరు మన కాంగ్రెస్‌మన్ ఇలాంటి విషయాల్లో సహాయం చేస్తాడని ఒకసారి అన్నారు"

"అవును తనని గెలిపించిన ఈ ప్రాంతపు ప్రజలకు సహాయపడటంలో ఆయనకి చాలా పేరుంది"

"అసలు వాళ్ళు మనకి సహాయం ఎందుకు చేస్తారు? మన బాగోగులు ఈ రాజకీయ నాయకులకెందుకు? ఇండియాలో చూస్తున్నాంగా" అన్నాడు ప్రకాష్.

నారాయణ నవ్వాడు.

"అలా అనకండి. ఇక్కడి ప్రజానాయకులకూ, ఇండియాలోని రాజకీయ నాయకులకూ చాలా తేడా వుంది. ఉదాహరణకి ఒకసారి నాక్కూడా సహాయం చేశాడీయన" అన్నాడు నారాయణ.

కుతూహలంగా అడిగాడు ప్రకాష్, "ఏం చేశాడేమిటి? " అని.

"పోయిన సంవత్సరం నేనొక డూప్లెక్స్ ఇల్లు కొన్నాను. అది ఎవరో ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టలేక బ్యాంకుకి వదిలేసిన ఇల్లు. నేను ఆ ఇంటిని బిడ్ చేసినప్పుడు ఐదు శాతం ముందుగా కట్టి మిగతాది బ్యాంక్‌లో అప్పు తీసుకునేటట్లు రాసుకున్నాం. కానీ ఆ ఇల్లు నాకు ఎలాట్ అయ్యాక, అది నేను

ఉండటానికికాక వ్యాపారనిమిత్తం కొంటున్నాను కనుక ముప్ఫైశాతం డబ్బు ముందుగా కడితే కానీ ఆ ఇల్లు నాకు అమ్మనన్నారు. వాళ్లు ముందు చెప్పిన ఎగ్రిమెంటు చూపించి నేను ఎన్నివిధాలుగా చెప్పినా వాళ్లు ఒప్పుకోలేదు. అప్పుడు మా ఆఫీసులో ఒకతను మన నియోజకవర్గం కాంగ్రెస్‌మన్ ఇలాంటి విషయాల్లో సహాయం చేస్తాడని ప్రజావసరాల కోసమని ఆయన తన ఆఫీసులో ఒక వ్యక్తిని నియమించారనీ అతనికి ఫోన్‌చేసి మాట్లాడమనీ సలహా ఇచ్చాడు. మీరన్నట్టుగానే మనదేశంలో సామాన్య ప్రజలకు రాజకీయ నాయకులు అందుబాటులో ఉండరు కనుక నాకు ఆ పద్ధతి అంత ఉపయోగిస్తుందనిపించలేదు. అయినా ఇక వేరే మార్గం లేక అతనికి ఫోన్ చేశాను. అతను నా దగ్గర అన్ని వివరాలు తీసుకుని మళ్ళీ ఫోన్ చేస్తానన్నాడు"

"అంత తీరిగ్గా మీ పనిచేసి పెట్టాడా? " అడిగాడు ప్రకాష్.

"చేస్తాడా అనే నేనూ అనుకున్నాను. కానీ మర్నాడు మధ్యాహ్నం ఫోన్‌చేసి తను ఆ బ్యాంక్‌వాళ్ళతో మాట్లాడాననీ, వాళ్ళు ముందు అనుకున్న పద్ధతికే అంగీకరించారనీ చెప్పాడు. అంతేకాదు, కొత్త సంవత్సరం కాలెండర్ కూడా వాళ్ళ శుభాకాంక్షలతో నాకు పంపించాడు"

"ప్రకాష్ అడిగాడు, "అయితే ఒక పని చేద్దాం. నిన్న రాజు వాళ్ళ మరదలు గురించి అన్ని వివరాలూ ఇచ్చాడు. మీరు కాంగ్రెస్‌మన్ ఆఫీసుకి ఫోన్‌చేసి రాజు అనారోగ్యం గురించి చెప్పి ఆవిడ ఇక్కడికి రావడం చాలా అవసరమనీ, ఆవిడకి ఇండియాలో భర్తా, పిల్లలూ ఉన్నారనీ, ఆవిడ ఉద్దేశం అమెరికాలో స్థిరపడటం కాదని చెప్పి ఆవిడకి వీసా వచ్చేలా చూడమని చెప్పాలి"





"తప్పకుండాను. ఇండియాలో వాళ్ళ అడ్రసు, ఫోన్‌నెంబరూ కూడా కనుక్కుని చెబితే ఉపయోగపడవచ్చు" అన్నాడు నారాయణ.

"అన్ని వివరాలూ ఇస్తాను. పని అవుతుందని మీకు నమ్మకం ఉందా? " అడిగాడు ప్రకాష్.

"అవుతుందనే నా నమ్మకం. అయినా ప్రయత్నం చేసినందువల్ల నష్టం లేదు కదా? " అన్నాడతను నవ్వుతూ.

ప్రకాష్ వెంటనే అన్ని వివరాలూ నారాయణకు ఫోన్‌లో చెప్పాడు.

"నేను ఇప్పుడే వాళ్ళకు ఫోన్ చేస్తాను" అన్నాడు నారాయణ.

ప్రకాష్ తర్వాత రాజుకి ఫోన్‌చేసి చెప్పాడు.

"నువ్వు ఇచ్చిన లలితగారి సమాచారం అంతా నారాయణకి ఫోన్‌లో చెప్పాను. మీరు ఇచ్చిన వీసా కాగితాల కాపీలు కూడా ఆయనకి ఫాక్స్ చేశాను. నారాయణ ఇవాళే కాంగ్రెస్‌మన్ ఆఫీసుకి ఫోన్‌చేసి మనకు సహాయం చేయమని అడుగుతానన్నారు"

"చూద్దాం. ఆయన ద్వారానయినా పని అవుతుందేమో" అన్నాడు రాజు.

"లెటజ్ హోప్ ఫర్ ది బెస్ట్" అన్నాడు ప్రకాష్.

"ప్రకాష్! నీకు మా ఆఫీసులో పనిచేసే వసంత్ తెలుసుకదూ? " అడిగాడు రాజు.

"తెలీకపోవటమేమిటి... మీ ఇంట్లోనే అతన్ని రెండు మూడుసార్లు చూశాను"

"అతను పెళ్ళి చేసుకోటానికి ఇండియా వెళ్ళాడు. ఇవాళో, రేపో వస్తాడు. అతనితో నేను మాట్లాడాలి. ఇక్కడికి రమ్మని చెబుతావేమోనని"

సరోజ అంది, "రాజూ! వసంత్ ఇవాళ అర్ధరాత్రి వస్తాడని చెప్పాడు రాకేష్‌పటేల్. నేను ఫోన్‌చేసి వచ్చిన వెంటనే నిన్ను కలవమని అతని ఆన్సరింగ్ మెషిన్‌లో మెసేజ్ పెడతాలే! ప్రకాష్ ఫోన్ నెంబర్ కూడా ఇస్తాను"

రాజు తల ఊపాడు సరేనని.

"ప్రకాష్! నారాయణ ఫోన్ చేయగానే చెప్పు. వసంత్ సంగతి నేను కనుక్కుంటాలే" అన్నాడు రాజు ఫోన్ పెట్టేస్తూ.

రాజు ఒక్క క్షణం ఆగి అన్నాడు. "మా ఆఫీసులో హ్యూమన్ రిసోర్సెస్ డిపార్టుమెంటులో షెర్లీ అని ఒక అమ్మాయి ఉంది. వసంత్‌ని ఆ అమ్మాయిని కలవమని చెప్పాలి. నాకు ఉన్న మెడికల్ లీవు దాదాపు అయిపోయింది. షార్ట్‌టరమ్ డిసెబిలిటీ లీవుకి నేను డబ్బులు కడుతున్నాను. ఆ విషయం కనుక్కుంటాడేమోనని"

"నీకు మెడికల్ లీవు ఇంకా ఎంతుంది?" అడిగింది సరోజ.

"మాకు సంవత్సరానికి పదిరోజుల చొప్పున నేను ఈ ఉద్యోగంలో చేరిన అయిదేళ్ళకి యాభైరోజులు వస్తుంది. అడపాదడపా తీసుకున్నవి దాదాపు పదిరోజులు. మిగిలిన నలభైరోజులలోనూ ముప్పైరోజుల పైన అయిపోయాయి"

"ఇంతేనా నీ మెడికల్ లీవు?" అడిగింది సరోజ.

చిన్నగా నవ్వాడు రాజు. "అమెరికాలో సెలవులంటే అంతే మరి. పండగలకీ, నేషనల్ హాలీడేస్‌కి కలిపి సంవత్సరానికి తొమ్మిదిరోజులు సెలవు. పదిరోజులు వెకేషన్. పదిరోజులు మెడికల్ సెలవులు. ఇంకా ఏదన్నా అవసరం వస్తే జీతం నష్టంమీద పోవాలి. ఇలా అనారోగ్యాలు వస్తే మనం ఆఫీసుద్వారా డబ్బులు కట్టుకునే డిసెబిలిటీ అవసరానికి ఆదుకుంటుంది"

"నువ్వెప్పుడూ సెలవులు కూడా పెట్టకుండా పనిచేస్తావుకదా" అంది సరోజ.

నవ్వాడు రాజు. "దానికదే దీనికిదే. ఎక్కువ సెలవులవలన ఉత్పత్తులు తగ్గిపోతాయి. దానివల్ల కంపెనీలు ఆర్థికంగా దెబ్బతింటాయి. వాళ్ళకి లాభాలు తగ్గితే ఉద్యోగాలు తగ్గుతాయి. ఉద్యోగాలు తగ్గితే తక్కువ డబ్బులు సర్క్యులేట్ అవుతాయి. దానివల్ల వినిమయదారుల కొనుగోలు తగ్గుతుంది. కొనుగోలు తగ్గితే ఉత్పత్తులు ఇంకా తగ్గుతాయి. దానివల్ల దేశం ఆర్థికంగా బాగా దెబ్బతింటుంది"

సరోజ గలగలా నవ్వింది. "ఆర్థికసూత్రాల మీద నీ పరిశీలనకి, నూటికి నూరు మార్కులూ ఇస్తాంకానీ, ముందు కాస్త విశ్రాంతి తీసుకో" అంది.



ఇంకొక రెండు గంటలలో నారాయణ రాజుకి ఫోన్ చేశాడు.

"రాజుగారూ! ఇందాకే కాంగ్రెస్‌మన్ ఆఫీసుకి ఫోన్‌చేసి అన్ని వివరాలూ చెప్పాను. ఆయన అసిస్టెంటు మైక్ అనే అతను ఇన్‌ఫర్‌మేషన్ అంతా రాసుకున్నాడు. అన్ని కాగితాలూ అతనికి ఫాక్స్ చేశాను. ఈమధ్య మనవాళ్ళు కొంతమంది వీసాలకోసం రకరకాల నాటకాలు ఆడటంవల్ల వాళ్ళపని కష్టమైపోతున్నదనీ, ఎవరికి నిజంగా వీసాలు ఇవ్వాలో, ఎవరికి ఆపాలో తెలియక కొన్ని అసలైన కేసులలో ఇవ్వలేకపోతున్నారని చెప్పాడు. మద్రాసు కాన్‌సలేట్ ఆఫీసుకి ఫోన్‌చేసి మాట్లాడతానని చెప్పాడు. రెండు రోజులు ఆగి మీవాళ్ళు మద్రాసు వెళ్ళి ఇక్కడ టెక్సాస్ కాంగ్రెస్‌మన్ ఆఫీసునించి

మైక్ పంపించాడని చెబితే పని అవుతుంది అన్నాడు. మీరేమీ దిగులు పడకండి. వీసా వస్తుంది అని కూడా చెప్పాడు"

"పని అవుతుందంటారా మద్రాసుకి మరో ట్రిప్ వృథా అవదుకదా"

నారాయణ నవ్వాడు. "మీరు ఇప్పుడే తెనాలికి ఫోన్‌చేసి వాళ్ళకి చెప్పండి. అక్కడ పని అవకపోతే మద్రాసునించి మీకో కలెక్ట్ కాల్ చేయమనండి. అయినా అంత అవసరం వస్తుందనుకోను"

సరోజ వెంటనే తెనాలికి ఫోన్‌చేసి లలితకు ఏంచేయాలో వివరంగా చెప్పింది. వీసా వచ్చినా రాకపోయినా వెంటనే ఫోన్ చేసి చెప్పమంది.



మర్నాడు పొద్దున్నే రాజు కీమోథెరపీ కోసం హాస్పిటల్‌కి వెళ్ళాడు. కీమో అయాక రాజు సరోజ చేయి పట్టుకుని నెమ్మదిగా నడిచి వచ్చి కారు ఎక్కాడు. సరోజ పక్కకు తిరిగివచ్చి డ్రైవరు సీటులో ఎక్కుతుండగా చేతిలో ఒక పూలగుచ్ఛంతో గబగబా వచ్చాడు వసంత్. "ఏమిటి గురువుగారూ... ఒంట్లో బాగాలేదుట" అంటూ.

రాజుకి అతన్ని చూస్తే కొండంత బలం వస్తుంది. ఇద్దరూ రెండేళ్ళనించీ కలిసి పని చేస్తున్నారు. అతను అమిత ఉత్సాహంతో నవ్విస్తూ ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడుతుంటే రాజు ఎంత స్ట్రెయిన్‌నయినా భరించగలడు.

రాజు జరిగినదంతా చెప్పబోతుంటే వసంత్ అన్నాడు, "నా ఆన్సరింగ్ మెషిన్‌లో సరోజగారి మెసేజ్ చూసి మీ ఇంటికి పిలిస్తే ఎవరూ పలకలేదు. ఆవిడ చెప్పినట్టుగానే ప్రకాష్‌గారిని పిలిచాను. ఆయన అన్నీ వివరంగా చెప్పారు. రెండు సూట్‌కేసులు, ఒకటి రెండు డిగ్రీలు చేత్తో పట్టుకుని మనదేశం కాని ఈ దేశం వచ్చి రకరకాల మనుష్యుల మధ్య మనం ఎంతటి కష్టనష్టాలనైనా ఎదుర్కొంటున్నాం. అంతేకాదు ఆఫీసులో చాలా మంచి ఉద్యోగస్థులమని పేరు తెచ్చుకుంటున్నాం. పేటెంట్లు సంపాదిస్తున్నాం. ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే, ఉయార్ రియల్ గుడ్ ఫైటర్స్. ఉయ్ డోంట్ గివప్ ఈజిలీ. కనుక మీరు ఇప్పుడు అదేవిధంగా కాన్సర్‌తో పోరాడండి. మీ పక్కనే మేమందరం ఉన్నాం"

రాజు వసంత్ చేయి పట్టుకుని గట్టిగా వత్తుతూ "థాంక్స్ ఫర్ యువర్ గుడ్‌వర్డ్స్" అన్నాడు.

వసంత్‌ని ఆఫీసులో తన సెలవుల గురించి కనుక్కోమని చెప్పాడు రాజు.

"ఇవాళే నేను ఆఫీసులో కనుక్కుంటాను మీ షార్టర్మ్ డిసెబిలిటీని గురించి. నేను సాయంత్రం వస్తానులెండి మీ ఇంటికి" అన్నాడు వసంత్.

"ఇంతకీ ఎప్పుడొచ్చావ్ ఇండియానించి. అవునూ పెళ్ళి చేసుకున్నావా లేదా? " అడిగింది సరోజ.

"నేను రాత్రే వచ్చాను. నా నిద్రకళ్ళు చూస్తే తెలియటంలేదూ మీకు. ఇప్పుడు ఇండియాలో రాత్రికదా. అక్కడయితే ఈపాటికి బ్రహ్మాండంగా నిద్రపోతుంటాను. ఇక పెళ్ళి సంగతా. లేదు. సాయంత్రం తీరిగ్గా చెబుతాను. మిమ్మల్ని డ్రైవ్వేలో నిలబెట్టి మాట్లాడటం నా కిష్టంలేదు" అని చేతిలోని పూలగుచ్ఛాన్నీ, గెట్‌వెల్ కార్డునీ, రాజుకి అందించి కరచాలనం చేశాడు వసంత్.

"సరే సాయంత్రం మా ఇంట్లో కలుద్దాం" అని సరోజ కారుని ముందుకు పోనిచ్చింది.



ఆరోజు శుక్రవారం రాత్రి అవటంవల్ల, భోజనాలు అయిన తర్వాత, రాజు ఇంటికి ప్రకాష్, కమల, అరవింద వచ్చారు. అరవింద వినీతతో మేడమీదకు వెళ్ళింది.

ఈలోగా కాలింగ్‌బెల్ మోగింది. కమల లేచి వెళ్ళి తలుపు తీసింది. సురేష్, సుధలతోపాటుగా. వసంత్ కూడా వచ్చాడు. వసంత్ బరోడానించి తెచ్చిన ఇండియన్





స్వీట్స్ ప్యాకెట్‌లోనించి తీసి అందరికీ తలోటి అందించాడు.

"ఈ స్వీట్లు నా చిన్నప్పటినుంచీ తింటూనే ఉన్నాను. అదే రుచి. అదే సువాసన. అదే క్వాలిటీ. అంతేకాదు నన్ను చూసి నాలుగు స్వీట్లు ఎక్కువ ఇచ్చాడు కూడాను. ఆఫ్‌కోర్స్, డబ్బులు మాత్రం డాలర్లలో తీసుకున్నాడనుకోండి" అన్నాడు నవ్వుతూ.

"స్వీట్లు చాలా బాగున్నాయి" అంది కమల మెచ్చుకుంటూ.

ఈలోగా కాలింగ్ బెల్ మోగింది. వసంత్ లేచి వెళ్ళి తలుపు తీశాడు.

"ఓ! వసంత్ ఎప్పుడు వచ్చావ్ ఇండియా నుంచి" అంటూ లోపలికి వచ్చాడు నారాయణ. వెనుకనే అతని భార్య శ్యామల.

"రండి... రండి" అంటూ ఆహ్వానించింది సరోజ.

వసంత్ వాళ్ళకి కూడా స్వీట్స్ అందించాడు.

నారాయణ నవ్వుతూ అన్నాడు, "స్వీట్లు సరోజగారికివ్వండి. ఆవిడకో శుభవార్త చెబుతున్నాను మరి"

సరోజ చటుక్కున కళ్ళు పైకెత్తి అడిగింది "ఏమిటి" అని.

"శుక్రవారం కదా, హ్యూస్టన్‌నించి డల్లాస్ దాకా డ్రైవ్ చేయాలని మధ్యాహ్నం రెండు గంటలకే మా ఆఫీసులో దుకాణం కట్టేసి బయల్దేరబోతున్నాను. అప్పుడే ఫోన్ చేశాడు మైక్. మైక్ అంటే కాంగ్రెస్‌మన్ ఆఫీసులో పనిచేసే ఆయన అసిస్టెంట్. అతను చెప్పాడు. లలితగారి వీసా గురించి, మద్రాసులోని అమెరికన్ కాన్సలేట్ ఆఫీసుకి ఫోన్‌చేసి మాట్లాడారుట. అంతా మనకి అనుకూలంగానే అయిందట. వాళ్ళు తెనాలిలో మీ వాళ్ళను కాంటాక్ట్ చేస్తామన్నారుట. అయినా మైక్ ఇచ్చిన సలహా ఏమంటే, మిమ్మల్ని తెనాలికి ఫోన్‌లో మాట్లాడమని రేపు సోమవారం పొద్దున్నే వాళ్ళని మద్రాస్ వెళ్ళమనీ చెప్పాడు. అక్కడ టెక్సాస్‌లోని కాంగ్రెస్‌మన్ ఆఫీసు నుంచి మైక్ చెప్పాడని చెప్పమన్నాడు"

సరోజ ముఖం వికసించింది.

"ఇంతసేపా... అవన్నీ నిన్న మీతో మాట్లాడగానే ఏమీ కన్ఫర్మ్ కాకపోయినా తెనాలికి ఫోన్‌చేసి చెప్పేసింది మా ఆవిడ" అన్నాడు రాజు నవ్వుతూ.

"చాలా థాంక్స్ నారాయణగారూ. మీ సహాయం మరచిపోలేం" అంది సరోజ. ఆమె చూపులో ఆ కృతజ్ఞతాభావం తెలుస్తూనే వుంది.

నారాయణ ఇబ్బందిగా నవ్వాడు. "ఇందులో నేను చేసింది ఏముందండి. ఒక్క ఫోన్‌కాల్ చేయటమేగా. వీసా రాగానే ఆ థాంక్సేవో ఆ కాంగ్రెస్‌మాన్‌కి ఒక ఉత్తరం ద్వారా రాస్తే, ఆయన సంతోషిస్తాడు" అన్నాడు.

"తప్పకుండాను" అంది సరోజ ఉత్సాహంగా.

"వీసా రాగానే ట్రావెల్ ఏజెంట్‌తో మాట్లాడతాను" అన్నాడు రాజు. అతనికి కూడా లలిత వస్తున్నదంటే ఉత్సాహంగా ఉంది. అతనికి తెలుసు, లలిత పక్కన ఉంటే సరోజకు ఎక్కడలేని బలం వస్తుందని.

వసంత్‌కి రాజు తన ఆరోగ్యం వివరాలు చెబుతుంటే అక్కడి వాతావరణం మళ్ళీ కొంచెం సీరియస్‌గా మారింది.

అంతా విని వసంత్ "మీతో ఇవాళ పొద్దున్న అన్నానే. మనం పెద్ద ఫైటర్లమని. అది చూపించే సదవకాశం మీకు లభించింది. అంతేకాదు, ఈ యుద్ధంలో మీరు గెలుస్తారని నా గట్టి నమ్మకం. మీకు తోడుగా మేమందరం మీ పక్కనే వుంటాం" అన్నాడు తన ధోరణిలో.

సరోజ అడిగింది "ఇంతకీ నీ పెళ్ళి విషయం చెప్పలేదు" అని.

నవ్వాడు వసంత్. ఒక్కక్షణం ఆగి కొంచెం సిగ్గుపడుతూ అన్నాడు.

"నేను నలుగురమ్మాయిల్ని చూశాను. పెళ్ళి చేసుకుందామని"

"ఎవరూ నచ్చలేదా? " అడిగింది కమల.

"నాకు నచ్చారు. కానీ నేనే వాళ్లకు నచ్చ లేదు" అన్నాడు నవ్వుతూ.

"అదేమిటి? చక్కగా వుంటావు నువ్వు. మంచి బుద్ధిమంతుడివి కూడాను. నాకే కనక పెళ్ళీడు అమ్మాయి వుంటే నీకిచ్చి పెళ్లి చేసేదాన్ని" అంది కమల.

"కాకపోతే నువ్వే తెలుగు నేర్చుకోవాలి. లేదా మా అమ్మాయి గుజరాతీ నేర్చుకో వాలి" అన్నాడు ప్రకాష్ నవ్వుతూ.

"ఏమీ అఖ్ఖరలేదు. అమెరికాలో సెకండ్ జనరేషన్ వాళ్ళకు, తెలుగూ లేదు, గుజ రాతీ లేదు. అంతా ఇంగ్లీషేకదా. భాషాప్ర మేయం, అసలు లేనేలేదు" అంది సుధ.

"ఇంతకీ వాళ్ళకి నువ్వెందుకు నచ్చలేదు" అడిగింది సరోజ.

వసంత్ అన్నాడు "నేను నచ్చకకాదు.. ఊరికే అలా అన్నాను. నిజంగా నాకే భయంవేసింది. వాళ్లు ఎలాటి వాళ్లో ఏమిటో ఏమీ తెలీదు. అలా ఒకసారి చూసి ఊ కొట్టేస్తే సరిపోదుకదా. తర్వాత సరిపడకపోతే జీవితాంతం బాధపడవద్దూ. అందుకే వాళ్లందరిలోకీ బాగా నచ్చిన అమ్మాయిని పెండింగ్‌లో పెట్టాను. ఇంకో ఆరు నెలలదాకా మేఘసందేశాలూ, తంతి తీగలూ, పోస్టాఫీసువారి గరుడవాహ నాలూ... ఒకళ్లనొకళ్లం కొంచెం అర్థం చేసు కోటానికి అదో అవకాశం. తర్వాత మేమి ద్దరం ఇష్టపడితే పెళ్లి చేసుకుంటాం. లేక పోతే ఫోన్ బిల్లులన్నీ కట్టేసి ఇంక ఫోన్ కింద పెట్టేస్తాం. అదీ ప్లాన్"

"దటీజ్ నాట్ బాడ్" అన్నాడు నారా యణ.

"లేదు, అది చక్కటి ప్లాన్, గో ఫరిట్" అన్నాడు రాజు.

"మీ ఆశీర్వాద బలం గురువుగారూ" అన్నాడు వసంత్ నవ్వుతూ.

★ ★ ★

సోమవారం రాత్రి, ఇండియానించి కలెక్ట్ కాల్ వచ్చింది.

"ఏమిటే వీసా వచ్చిందా? " అడిగింది సరోజ ఆదుర్దాగా.

"వచ్చింది. మేము వెళ్లి వివరాలు చెప్ప గానే పాస్‌పోర్టు, మిగతా కాగితాలు తీసుకు న్నారు. సాయంత్రం మూడింటికి రమ్మ న్నారు. మేము మూడింటికి వెళ్లేసరికి వీసా సిద్ధంగా వుంది" అంది లలిత.

ఆమె గొంతులో సంతోషం, కంగారు కలిసి వున్నాయి.

సరోజకు ఒక్కసారి ఎగిరి గంతులేయాల నిపించింది. మనసు ఎంతో తేలికపడింది. రాజుకు పూర్తిగా తగ్గిపోయి, మామూలు మనిషి అయిపోయినంత ఆనందం వేసింది.

"రాజూ... లలితకు వీసా వచ్చేసిందిట" అని పెద్దగా అరిచింది.

రాజు ముందే ఆలోచించిన ప్లాను ప్రకారం రమణకు అన్నీ వివరంగా చెప్పాడు.

"డెల్టా ఎయిర్‌లైన్సులో టిక్కెట్టు కొంటు న్నారు. ఏ రోజున దొరుకుతుందో చూసి బుక్‌చేసి మీకు మళ్లీ ఫోన్ చేస్తాను. మీరు చేయవలసినదల్లా మద్రాసులో డెల్టావారి ఆఫీసుకి వెళ్లి వాళ్ల దగ్గర టిక్కెట్టు తీసుకుని ప్లేన్ ఎక్కేయటమే. మద్రాసునించి బొంబే రావటం, అక్కడనించి ఫ్రాంక్ ఫర్టు మీదుగా డల్లాస్ రావటం. కాకపోతే ఫ్రాంక్ ఫర్టులో ప్లేన్ మారాలి. అది పెద్ద కష్టమే మీకాదు. మద్రాసులో మాకు తెలిసిన ఒక ఆయన వాసుదేవన్ అని వుంటారు. ఆయన ఫోన్ నెంబర్ రాసుకోండి. ఆయన లలిత దారి ఖర్చులకు రెండు వందల డాలర్లు కూడా ఇస్తారు. ప్రయాణం బహుశా ఒక వారం రోజుల్లో వుంటుంది. వెంటనే సిద్ధం అవటం మంచిది"




రమణ, ఈ హడావిడికి తట్టుకోలేక ఆలో చనలో పడ్డాడు.

"ఇక్కడ ఏదొచ్చినా ఇంతే రమణా. చక చకా అయిపోతాయి అన్నీ. కానీ ఒక్క విషయం పిల్లలతో నువ్వు ఒక్కడివీ ఇటు ఇల్లు అటు ఆఫీసు ఎలా చూసుకుంటావో! నిన్ను చాలా కష్టపెడుతున్నాను. నన్ను క్షమించాలి"

రమణ నొచ్చుకుంటూ అన్నాడు. "అదేమి టండీ. మీ ఆరోగ్యం ముఖ్యం మాకు. అయినా ఇక్కడ మా ఇంటికి అత్తయ్యగారు వచ్చి పిల్లల్ని చూసుకుంటానన్నారులెండి. పిల్లలకు కూడా ఆవిడ దగ్గర బాగా చనువు. మీరేమీ బాధపడకండి. అన్నీ మీరు చెప్పి నట్టే చేస్తాను. మద్రాసులో ఆయన్ని కలు స్తాను. మీ ఆరోగ్యం మాత్రం జాగ్రత్త"

తర్వాత సరోజ లలితతో చాలాసేపు మాట్లాడి ప్రయాణంలో ఏం చేయాలో ఏం చేయకూడదో అన్నీ చెప్పింది.

"ఏమిటే మరీ చిన్న పిల్లకు చెప్పినట్టు చెబుతున్నావ్ చాదస్తంగా" అంది లలిత నవ్వుతూ.

"ఏదో నా చాదస్తం నాది. అందులోనూ నువ్వు ఇక్కడికి మొదటిసారిగా వస్తున్నా వంటే అది ఇంకా ఎక్కువయింది" అని ఒప్పేసుకుంది సరోజ.

తర్వాత ట్రావెల్ ఏజెంటుకి ఫోన్ చేశాడు రాజు.

సరిగ్గా వారం రోజులకి, లలితకు టిక్కెట్టు దొరికింది. రాజు మళ్లీ తెనాలికి ఫోన్ చేసి ప్రయాణం తేదీ మిగతా సమా చారం అంతా వివరంగా చెప్పాడు.

★ ★ ★

రాత్రి పన్నెండున్నర దాటింది. మంచి నిద్రలో వున్న ప్రకాష్ ఫోన్ మోగటంతో ఉలిక్కిపడి నిద్రలేచాడు. సరోజ లైన్లో వుంది. ఫోన్ శబ్దానికి కమల కూడా నిద్ర లేచింది.

"సరోజ" అని కమలతో చెప్పి, "ఏమిటి సరోజా? రాజుకెలా వుంది?" అడిగాడు ప్రకాష్.

కమలలేచి పక్క రూమ్‌లోని ఇంకో ఫోన్ అందుకుంది.

సరోజ కంఠంలో వణుకూ, గాభరా స్పష్టంగా తెలుస్తోంది.

"రాజుకి కడుపులో నొప్పి చాలా ఎక్కు వగా వుంది. బాధతో మెలికలు తిరిగిపోతు న్నాడు. ఏం చేయాలో తెలియటంలేదు"

"సాయంత్రం బాగానే ఉన్నారే. ఇంతలో ఏమయింది?" అడుగుతోంది కమల.

ప్రకాష్ అన్నాడు "సరోజా! వెంటనే 911 ఎమర్జన్సీ నెంబరుకు ఫోన్ చేయి. అంబు లెన్సు రాగానే రాజుతోపాటు హాస్పిటల్‌కు వెళ్లు. కమల సుధని మీ ఇంటికి రమ్మని ఫోన్ చేస్తుంది. మీ ఇంటికి దగ్గరలోనే వుంటారు కనుక సుధ అక్కడికొచ్చి వినీ తకు తోడుగా ఉంటుంది. నేను వెంటనే బయల్దేరుతున్నాను. హాస్పిటల్ దగ్గర కలు స్తాను"

మంచంమీద నించిలేచి డ్రస్ చేసుకుని హడావిడిగా కారు ఎక్కి బయల్దేరాడు ప్రకాష్.

★ ★ ★

అమెరికాలోని అన్ని ఊళ్లల్లోనూ అత్యవ సర పరిస్థితులలో అంబులెన్సునీ, ఫైర్ ఇంజన్ని పిలవటానికి వాడే ఒకే ఒక నెంబరు 911. ఫోన్ చేయగానే హుటాహు టిన వస్తారు అందరూ. అంబులెన్స్‌లోనే కాక ఫైరింజను స్టాఫ్‌లో కూడా పారామె డిక్స్ ఉంటారు. వాళ్లు ఇ.సి.జి, సి.పి.ఆర్, ఆక్సిజన్ ఇవ్వటం, ప్రధమ చికిత్స చేయటం లాంటి వాటిలో తర్ఫీదు పొందిన నిపు ణులు. ఇంటి దగ్గరనించే ఇంట్లోనూ, అంబులెన్సులోనూ చికిత్స మొదలవుతుంది. హాస్పిటల్లోకి వెళ్లే లోపలే ఎన్నో ప్రాణాలను కాపాడతారీ పారామెడిక్స్.

సరోజ ఫోన్ చేసిన ఎనిమిది నిమిషాల్లో ఒక పోలీసు కారూ, అంబులెన్సు, నీలం-ఎ

రుపు రంగుల లైట్లను వెలిగించుకుని సైరన్ మోగించుకుంటూ వచ్చాయి.

ఒకతను సరోజ చెబుతున్న వివరాలు రాసుకుంటుంటే ఇంకొక అమ్మాయి రాజు నాడి, రక్తపోటు మొదలైనవి పరీక్షిస్తోంది. ఇంకొక అతను రాజుతో మాట్లాడుతూనే ఫోన్‌లో హాస్పిటల్‌కి వివరాలు అందిస్తున్నాడు.

"హాస్పిటల్‌కు వెడదాం" అన్నాడు ఫోన్ చేస్తున్న వ్యక్తి.

"అలాగే" అని సరోజ అనేలోగానే స్ట్రెచ్చర్ తెచ్చి రాజుని పడుకోబెట్టారు. ఆ స్ట్రెచ్చర్‌ని, అంబులెన్సు వెనుక తలుపు తెరిచి అలాగే లోపలకు తోసేశారు.

సరోజ తన హాండ్‌బాగ్ తీసుకుని బయటకు వచ్చేసరికి పక్కనే కారు పార్క్ చేస్తున్నారు సుధా, సురేష్.

సుధ గబగబా కారుదిగి వచ్చి "ఎలా వుంది? " అంది సరోజ చేయిపట్టుకుని.

సరోజ కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. జవాబు చెప్పలేదు.

సుధ అంది "సురేష్, ప్రకాష్‌లు ఉంటారులే నీ పక్కన. నువ్వేమీ భయపడకు. నేనుంటాను ఇక్కడ వినీతతో. అవసరమైతే పిలు"

అంబులెన్సు బయల్దేరింది. అంబులెన్సు మీద నీలం, ఎర్ర రంగుల లైట్లు గుండ్రంగా తిరుగుతూ, సరోజను గాభరా పెడుతున్నాయి. సైరన్ మ్రోత సరోజ గుండెల్లో గుబులును పెంచుతోంది.

సరోజ ఎక్కగానే సురేష్ తలుపువేసి కారు స్టార్ట్ చేశాడు. అతని కారు అంబులెన్సు వెనకాలే బయల్దేరింది.

★ ★ ★

సరోజ, సురేష్ హాస్పిటల్‌కి వచ్చేసరికి దాదాపు ఒకటింబావు అయింది సమయం. కారు పార్కుచేసి ఎమర్జన్సీ వార్డు దగ్గరకు వచ్చేసరికి అక్కడే వున్నాడు ప్రకాష్.

ఎదురు వచ్చి "రాజుని లోపలకు తీసుకువెళ్లారు. పదండి వెడదాం" అని దారి





చూపాడు.

లోపలకు వెళ్లారుకాని ట్రీట్‌మెంట్ రూమ్‌లోకి ఎవ్వరినీ రానీయలేదు.

ఒక అరగంట గడిచింది. సరోజ మనసు మనసులో లేదు. సురేష్ ఆమె ఆలోచనలను వేరే విషయాల మీదకు మళ్లించటానికి ఏవో చెబుతున్నాడు కానీ అవేమీ సరోజ చెవిన పడటంలేదు.

ప్రకాష్ కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ అసహనంగా తిరుగుతున్నాడు.

అప్పుడే బయటకు వచ్చింది ఒక నర్సు.

"నొప్పి తగ్గటానికీ, నిద్రపోవటానికీ ఇంజక్షన్లు ఇచ్చాం. ఆన్కాలజిస్టు డాక్టర్ బర్చ్‌తో కూడా మాట్లాడాము. బహుశా ప్రొద్దున్నే వచ్చి చూస్తాడు" అంది సరోజను ఉద్దేశించి.

"లోపలకు వెళ్లవచ్చా? " అడిగింది సరోజ.

"తప్పకుండాను. ఈ గదిలో వున్నారు రండి" అని రాజు వున్న చోటుకి తీసుకు వెళ్లింది నర్సు.

రాజు కదలకుండా పడుకుని వున్నాడు. నిద్ర ఇంజక్షన్ అప్పుడే పనిచేస్తున్నట్టుంది. ఎయిర్‌కండిషన్ పనిచేస్తున్నా అతని నుదుటిమీద చెమట బిందువులు లైట్లకాంతిలో మెరుస్తున్నాయి. సరోజ, చేతిరుమాలుతో అతని నుదురు తుడిచింది. అతను కళ్లు మూసుకుని పడుకుని వున్నాడు. శాంతంగా వుంది ముఖం. పెద్ద తుఫాను వచ్చి తగ్గిన తర్వాత ఆకాశం ప్రశాంతంగా వున్నట్టుగా ఉంది. అతని తల మీద చేయివేసి జుట్టుని నిమిరింది సరోజ. తెరిచీ తెరవనట్టు కళ్లు తెరిచాడు కానీ కళ్లు మూతలు పడేవున్నాయి.

సురేష్ అక్కడే వున్న ఎమర్జన్సీ డాక్టర్‌తో మాట్లాడివచ్చాడు.

"వీళ్లకు ఈ కేసు గురించి ఎక్కువగా తెలీదు. డాక్టర్ బర్చ్‌తో మాట్లాడారుట. ఆయన సలహా మేరకు రాజుకి తాత్కాలికంగా నొప్పి రాకుండా చేసి నిద్రపట్టేలా చేశారు. రేపు పొద్దుటిదాకా రాజు హాయిగా నిద్రపోతాడు. తొమ్మిది గంటలకు వస్తాడుట డాక్టర్ బర్చ్. ఆయన రాజుని పరీక్షించి అప్పుడు చెబుతాడు ఏం జరిగిందో, ఎందుకు జరిగిందో, ఏం ట్రీట్‌మెంట్ ఇస్తారో.. అన్ని వివరాలూ" అన్నాడు సురేష్.

"మనమందరం ఈ రాత్రికి ఇక్కడ వుండటం అనవసరం. ఒకళ్లు వుంటే సరిపోతుంది" అన్నాడు ప్రకాష్.

"మీరు వెళ్లండి, నేను ఉంటాను" అంది సరోజ.

"అలాకాదు. రేపు డాక్టర్ పరీక్షించేటప్పుడు మీరు ఉంటే మంచిది. ఇప్పుడు ఇంటికి వెళ్లండి. ప్రొద్దున్నే వద్దురుగాని" అన్నాడు సురేష్ సరోజతో.

ప్రకాష్ అన్నాడు "మీరిద్దరూ ఇంటికి వెళ్లండి. రేపు ప్రొద్దున్న వినీతను స్కూలుకి పంపించి సరోజ వస్తుంది. నేను రాత్రికి ఇక్కడే రాజు దగ్గర వుంటాను"

సరోజ ఒక్క క్షణం ఆలోచించి "అలాగే" అంది.

సురేష్, సరోజ పది నిముషాలు కూర్చుని వెళ్లిపోయారు.

ప్రకాష్ టైమ్ చూసుకున్నాడు. తెల్లవారు ఝూమున నాలుగు గంటలు కావస్తోంది. ఎలాగూ ఇక నిద్రపట్టదు కనుక ఎమర్జన్సీ రికవరీ రూంలోనుంచి బయటకు వచ్చి హాస్పిటల్ కారిడార్‌లో పచార్లు సాగించాడు.

ప్రకాష్ బయటకు రాగానే చూశాడు, ఒక స్ట్రెచ్చర్‌ని తోసుకుంటూ వస్తున్నారు ఇద్దరు అంబులెన్సు స్టాఫ్. దాని మీద ఒకతను పూర్తిగా రక్తంలో తడిసి ముద్దయిపోయాడు. బాధ భరించలేక అరుస్తున్నాడు. తలమీద గాయాలు, కుడి భుజం కూడా బాగా దెబ్బతింది. కారు ప్రమాదం అయాక కారు కిటికీ అద్దాలు పగలకొట్టి బయటకు లాగినట్టున్నారు, అతని శరీరంలో గుచ్చు

కున్న గాజు పెంకులు దీపాలకాంతిలో మెరుస్తున్నాయి. ఇద్దరు మగనర్సులు, ఆ స్ట్రెచ్చర్‌తో పాటే పరుగెత్తుతున్నారు. పరుగెడుతూనే సిద్ధం చేయవలసినవేవేవో మిగతా స్టాఫ్‌కి చెబుతున్నారు. బహుశా ఆపరేషన్ రూమ్‌కి తీసుకువెడుతున్నట్టున్నారు. అక్కడ ఆపరేషన్‌కి కావలసిన సరంజామా సిద్ధమవుతుంది. అంతా పెద్ద గందరగోళంగా ఉంది. ప్రతి వ్యక్తీ తన పని చకచకా చేసుకుపోతున్నారు. ప్రకాష్‌కి ఇలాటివి టి.వి.లో చూసినా ఇప్పుడవన్నీ ప్రత్యక్షంగా చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది. తను ఎవరికీ అడ్డురాకుండా ఒక పక్కన నుంచుని అన్నీ వింతగా చూస్తున్నాడు.

ఎమర్జన్సీ వార్డులో హడావిడి వర్ణనాతీతంగా వుంటుంది. అక్కడ ఎవరినీ అంత త్వరగా చావనీయరు. ప్రమాదవశాత్తు కిందపడి తల పగిలినవాళ్లూ, దెబ్బలాటల్లో ఒళ్లు హూనం అయినవాళ్లూ, గుండెపోటుతో వచ్చేవాళ్లూ, కారు ప్రమాదంలో ఎముకలు విరిగినవాళ్లూ అందరూ అంబులెన్సుల్లో హడావిడిగా రావటం, రాగానే నర్సులు, డాక్టర్లు పరుగెత్తుకు రావటం, స్ట్రెచ్చర్‌మీద వాళ్లు లోపలకు వస్తుండగానే డాక్టర్లు వాళ్లతోపాటు పరుగెత్తుతూ సెలైన్ సిద్ధం చేయండి. ఆపరేషన్‌కి సిద్ధం చేయండి అని అరవటం, వెంటనే పనులన్నీ చకచకా జరిగిపోవటం ఆశ్చర్యకరంగానే కాక మనిషి ప్రాణాలకు వీళ్లు ఇచ్చే విలువ, చావుతో చివరిదాకా పోట్లాడే సాంకేతిక జ్ఞానం చూస్తుంటే అద్భుతంగా ఉంటుంది. అన్ని ప్రయత్నాలు చేసినా అప్పుడప్పుడూ రోగులు చనిపోయినప్పుడు వాళ్ల శ్రమ వృధా అయినందుకు బాధా, అంతకన్నా ఏమీ చేయలేకపోయినందుకు నిస్సహాయతా ఆ డాక్టర్ల, నర్సుల ముఖాల్లో కనిపిస్తూనే ఉంటుంది. ఎంతోమంది ప్రాణాలు కాపాడుతూ, ఎప్పుడూ ఎంతో ఆందోళనతో తమ ఉద్యోగాలను నిర్వహిస్తున్న ఈ ఎమర్జన్సీ వార్డు ఉద్యోగుల మానవత్వాన్ని వాళ్లకు వచ్చే జీతంతో వెలకట్టలేము. ప్రతి రోజూ ఇలాటి ఆందోళన జీవితం కొనసాగిస్తూ తమ ఆరోగ్యాలను కూడా లెఖ్ఖ చేయకుండా వాళ్లు చేసే పని ఉద్యోగధర్మంగా కన్నా అలాటి పనికి ఇష్టపడి ఒక మానవతా ధర్మంగానే చేస్తున్నారనటం సబబేమో.

సమయం ప్రొద్దున్న అయిదున్నరయిందని చూపిస్తోంది గోడమీద గడియారం. ప్రకాష్ రాజు పడుకున్న మంచం దగ్గరకు వచ్చి చూశాడు. రాజు ఇంకా మంచి నిద్రలో ఉన్నాడు. ఇంజక్షన్ ప్రభావం బాగా పనిచేస్తున్నట్టుంది. ప్రకాష్ కింది ఫ్లోర్‌లోని కాఫటేరియాలో కాఫీ తాగి వచ్చాడు.

సమయం ఆరున్నర దాటింది. రాత్రి షిఫ్ట్ వాళ్లు అందరూ పొద్దున్న షిఫ్ట్‌కు వస్తున్నవాళ్లకు ఛార్జి అప్పగిస్తున్నారు. అక్కడ చాలా సందడిగా ఉంది వచ్చేపోయే నర్సులతో, టెక్నీషియన్లతో.

సమయం ఎనిమిది గంటలయేసరికి వచ్చింది సరోజ. చేతిలో రాజుకి కావలసిన సామానుతో ఒక సంచి తెచ్చింది.

"వినీతని స్కూలుకి రెడీ చేసి వచ్చేసరికి ఆలస్యం అయింది. రాజు ఎలా ఉన్నాడు? " అడిగింది ప్రకాష్‌ని.

"బాగా నిద్రపోతున్నాడు. ఇంకా లేవలేదు. బాధ తెలియకుండా పడుకున్నాడు కనుక డాక్టర్ వచ్చేదాకా లేపకుండా ఉంటేనే మంచిది"

"మీరు రాత్రి బాగా నిద్రపోయారా? "

చిరునవ్వుతో తల ఊపాడు ప్రకాష్ ఎటూ చెప్పకుండా.

సరోజ కూడా నవ్వి "మీ ముఖం చూస్తుంటే నిద్రపోయినట్టులేదు. మీరు ఇంటికి వెళ్లండి. నేను ఉంటాను. డాక్టర్ ఏం చెప్పిందీ నేను ఫోన్‌చేసి చెబుతాను" అంది.




తను కూడా ఆఫీసుకి వెళ్లాలి కనుక "అలాగే! ఏ సంగతీ వివరంగా ఫోన్‌చేయి" అంటూ బయల్దేరాడు ప్రకాష్.



ప్రకాష్ వెళ్లిన అరగంటకి నిద్రలేచాడు రాజు.

"ఎలావుంది? నొప్పి తగ్గిందా" అడిగింది సరోజ.

రాజు ఒకసారి పొట్టచేత్తో నిమురుకుని చిన్నగా నవ్వి "తగ్గినట్టుగానే ఉంది. ఇప్పుడేమీ అనిపించటంలేదు" అన్నాడు.

ఈలోగా ఒక నర్సు వచ్చి "డాక్టర్ బర్చ్ ఇంకొక గంటలో వస్తానన్నారు పరీక్ష చేయటానికి. ఈలోగా ఈ ఇంజక్షన్ ఇవ్వమన్నారు" అంది ఒక ట్రేలో ఇంజక్షన్ పరికరాలను తీసుకువచ్చి.

"దేనికి? నొప్పి తగ్గటానికా? నాకు నొప్పి లేదు" అన్నాడు రాజు.

ఆ నర్సు నవ్వింది. "లేకపోయినా ఇది ఇవ్వటం అవసరం. అందులోనూ డాక్టర్ బర్చ్ చెబితే చాలా అవసరం అన్నమాట" అంది.

రాజు దంతధావనం కానిచ్చి బత్తాయి రసం తాగేసరికి వచ్చాడు డాక్టర్ బర్చ్. ఏం జరిగిందీ, కడుపునొప్పి ఎలా వచ్చిందీ, ఎక్కడ వచ్చిందీ అన్నీ వివరంగా అడిగాడు. కొన్ని పరీక్షలు చేయించాడు.

"రాజు కనీసం రెండు రోజులు హాస్పిటల్లో ఉంటే మంచిది. ఇవాళే రూము తీసుకోండి. నేను ఈ పరీక్షా ఫలితాలు తీసుకుని తీరికగా పరిశీలించి మళ్లీ వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం" అన్నాడు డాక్టర్ బర్చ్ రాజు, సరోజలతో.

అక్కడి నర్స్ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసుకి ఫోన్‌చేసి రూమ్ ఎలాట్ చేయించింది. స్ట్రెచర్ మీద తీసుకువెళతామంటే వద్దన్నాడు రాజు. రాజు చేయి పట్టుకుని అతన్ని ఎమర్జన్సీ నించి హాస్పిటల్ గదిలోకి తీసుకువచ్చింది సరోజ.

అక్కడికి వచ్చాక కమలకు ఫోన్ చేసి చెప్పింది కొన్నాళ్లు రాజుని హాస్పిటల్లో ఉంచమన్నారనీ డాక్టర్ బర్చ్ మళ్లీ వచ్చి మాట్లాడతానన్నాడనీ.

కమల అడిగింది "నేను రానా" అని.

"అఖ్ఖరలేదు. అవసరమైతే పిలుస్తాలే" అంది సరోజ.

మధ్యాహ్నం రెండు గంటలు దాటాక వచ్చాడు డాక్టర్ బర్చ్. వచ్చి రాజు మంచం పక్కనే కూర్చున్నాడు.

సరోజతో "మీరు కూడా ఇక్కడ మంచం మీద కూర్చోండి" అన్నాడు రాజు ప్రక్కనే చోటు చూపిస్తూ.

సరోజ ఆయన చెప్పినట్టే చేసింది.

డాక్టర్ బర్చ్ ఎడమ చేత్తో రాజు చేతినీ కుడిచేత్తో సరోజ చేతిని పట్టుకున్నాడు. మృదువుగా కాక కొంచెం గట్టిగానే పట్టుకున్నాడు.

"మీకు నేనొక మంచివార్త తెద్దామనుకున్నానుకానీ కుదరలేదు. మీ దగ్గరకు వచ్చే ముందర మిగతా చాలామంది స్పెషలిస్ట్‌లతో సుదీర్ఘంగా చర్చించాను. రాజుకి వ్యాధి బాగా ముదిరిపోయింది. స్మాల్ ఇంటెస్టెయిన్స్‌లోనేకాక లివర్, కిడ్నీలకూ కడుపులో చాలా భాగం క్యాన్సర్ పెరిగిపో

యింది. అదేదో పుండులాగా ఉంటే తీసివే యటానికి అవకాశం ఉండేదనీ అది అలా లేకపోవటంవల్ల మిగతా శరీరభాగాలకు దెబ్బతగలకుండా ఆపరేషన్ చేయటం అసాధ్యమనీ ఇంతకుముందర చెప్పాను. అది కడుపులో అన్నిచోట్లకీ మరీ ఎక్కువగా పాకిపోయింది" డాక్టర్ బర్చ్ చెప్పటం ఆపాడు.

రాజు మాట్లాడలేదు. అతని ముఖం పాలిపోయింది.

ఒణుకుతున్న కంఠంతో అడిగింది సరోజ "మరి ఇన్నాళ్లూ చేసిన కీమో థెరపీ, మందులూ పనిచేయలేదా? "

"అనే అనుకోవాలి. అప్పుడే చెప్పాను. మన ప్రయత్నం మనం చేద్దామని. అదే చేశాం కూడా. కానీ"

"అయితే మరి ఎలా నయం చేయగలరు? " అడిగింది సరోజ.

"ఇక నయం చేయటం సాధ్యం కాదు. నయమయితే మెడికల్ చరిత్రలోనే అది అపూర్వం. అందుకే... అందుకే రాజు ఇంకా ఎక్కువ రోజులు బతకడు అని చెప్పాల్సి వస్తుంది. మా లెఖ్ఖ ప్రకారం ఇంకొక మూడు నెలలు. అది కూడా మందులతో, ఇంజక్షన్లతో మనం శాయశక్తులా ప్రయత్నిస్తేనే"

రాజు కళ్లు మూసుకున్నాడు. అతని గుండె చప్పుడు పైకి వినిపిస్తోంది. డాక్టర్ బర్చ్ చేతిలోని అతని చేయి వణుకుతోంది.

సరోజకు చెమటలు పట్టాయి. ఆమె కళ్లు వర్షిస్తున్నాయి. అన్ని రకాల ఆలోచనలు ఒక్కసారిగా స్థంభించిపోయాయి. అంతా శూన్యంగా ఉంది.

డాక్టర్ బర్చ్ తన కుడిచేత్తో ఆమె తల నిమిరాడు. ఆమె భుజంమీద చేయివేసి దగ్గరకు లాక్కుని గుండెలకు హత్తుకున్నాడు. వెక్కివెక్కి ఏడ్చింది సరోజ.

అప్పుడే వచ్చాడు సురేష్. తలుపు దగ్గర నుంచొని పరిస్థితి గ్రహించాడు.

సరోజ అంటోంది "మీరు ఇంతకన్నా ఏమీ చేయలేరా? పోనీ ఇంకో డాక్టరుకి చూపించమంటారా? " ఆమె గొంతులోనుంచి మాటలు సరిగ్గా బయటకు రావటం లేదు. ఎక్కడో నూతిలోనుంచి వస్తున్నట్టున్నాయి.

డాక్టర్ బర్చ్ లేచి నుంచున్నాడు. "మీ ఇష్టం. చూపించటమే మంచిది. నేనూ మా డాక్టర్లూ అనుకున్న దానికన్నా భిన్నంగా జరిగి, ఇంకో డాక్టరెవరైనా ఈ రోగాన్ని నయం చేయగలిగితే మీ సంక్షేమం కోరేవాడిగా మొట్టమొదట నేనే సంతోషిస్తాను" అన్నాడు.

"డాక్టర్ సురేష్! ఇలా రండి" అంటూనే సురేష్‌ని కారిడార్‌లోకి తీసుకు వెళ్లాడు డాక్టర్ బర్చ్.

"ఏమిటండీ ఇలా జరిగింది" అంటూ సరోజ, రాజు గుండెలమీద తల ఆన్చి బావురుమంది.

రాజు సరోజ తలమీద చేయివేసి ఆమెను దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు. అతని కళ్లల్లోనూ నీళ్లు తిరుగుతున్నాయి. పెదిమలు వణుకుతున్నాయి. నోటినించి మాటలు మాత్రం రావటంలేదు.

ఆమె అలా విలపిస్తూనే ఉంది. రాజు ఆమెను అలాగే హత్తుకుని పడుకున్నాడు. ఇద్దరి నోటా ఏమాటా రావటంలేదు.

లోపలకు రాబోయిన సురేష్ వాళ్లు ఏకాంతంగానే కాసేపు ఉండటం మంచిదని, వెనక్కి తిరిగి కారిడార్‌లోకి వెళ్లాడు. వెళ్లి సుధకి, ప్రకాష్‌కి ఫోన్ చేసి జరిగిన విషయం చెప్పాడు.

పది నిమిషాలు కారిడార్‌లో తచ్చాడి, రూమ్‌లోకి చూశాడు సురేష్. రాజులోను, సరోజలోను ఏమీ మార్పులేదు. ఇందాక ఎలా చూశాడో అలాగే ఉన్నారు. నెమ్మదిగా తలుపు దగ్గరకు వేసి బయటకు వచ్చి కొంచెం దూరంగా నుంచున్నాడు. అతను మొదటినుంచి అనుమానిస్తూనే ఉన్నాడు ఆ వార్త వినాల్సి వస్తుందని. కాకపోతే ఆ




వార్త ఈరోజు ఇలా బయటకు వచ్చింది. అమెరికాలో డాక్టర్లు ఎంతో క్షుణ్ణంగా పరిశీలించి నిర్ధారణకు వచ్చిగానీ ఏ విషయం చెప్పరు. కోర్టుకేసులు, లాయర్ల బాధలు తప్పించుకోటానికి అంత పరిశీలన అవసరం మరి. డాక్టర్‌గా సురేష్‌కీ ఆ అనుభవముంది.

భారతదేశంలో అయితే మీరింకా మూడు నెలలే బతుకుతారని డాక్టర్లు రోగులతో చెప్పరు. రోగులు కూడా అలాంటివార్తలు వినటానికి ఇష్టపడరు. కానీ అమెరికాలో అలా కాదు. డాక్టర్లు అన్నీ వివరంగా చెబుతారు. ముఖ్యంగా రోగికీ అతని దగ్గర బంధువులకీ చెబుతారు. సాంస్కృతిక పరంగా ఈ రెండు దేశాలకూ ఉన్న తేడా అది. అమెరికాలో అన్నీ వివరంగా చెప్పటం కోర్టులో లావాదేవీల మూలంగానే కాదు, రోగినీ మిగతా కుటుంబ సభ్యులనూ మానసికంగా ఆ మరణానికి సిద్ధం చేయటం కోసం, వీలునామాలు తదితర ఆస్తి, పెన్షన్ లాంటి వ్యవహారాలను చక్కదిద్దుకోవటం కోసం. వీటన్నిటికన్నా కూడా అదొక పద్ధతిగా వస్తున్నదక్కడ. అందరూ అంగీకరించి అనుసరిస్తున్న పద్ధతి. ఎన్నో సంవత్సరాలుగా అమలులో వున్న పద్ధతి.

కానీ భారతదేశంనుంచి వచ్చి అమెరికాలో స్థిరపడినవారికి ఇది మొదట్లో వింతగా ఉంటుంది. తప్పుగా ఉంటుంది. అర్థరహితంగా ఉంటుంది. అంతేకాదు ఇలాంటి విషయాల్లో ఈ పద్ధతి మనవాళ్లని భయపెడుతుంది. కానీ కొన్నేళ్లు అమెరికాలో ఉన్న మనవారికి ఇది అలవాటయిపోతుంది. ఎంత అలవాటవుతుందంటే ఇదే సరైన పద్ధతి అనే నమ్మకం కలిగేంతగా అలవాటవుతుంది.

హడావిడిగా వచ్చారు ప్రకాష్, కమలలు సురేష్ ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ.

సురేష్ వాళ్లను కొంచెం పక్కకు తీసుకువెళ్లి విషయం చెబుతుండగా వచ్చింది సుధ. అంతా విన్నాక వాళ్ల మొహాలు పాలిపోయాయి.

"నో అలా జరగటానికి వీల్లేదు" అంది సుధ చలించిపోతూ.

"నేను నమ్మను మూడు నెలల్లో రాజు పోతాడంటే" అంది కమల. ఆమె కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి.

"కాన్సర్‌ని కూడా తగ్గించలేని ఈ వైద్య శాస్త్రం ఎందుకు. ఇంకో డాక్టరుకి చూపిద్దాం. ఐ కాంట్ సీ హిమ్ డైయింగ్" అన్నాడు ప్రకాష్. అతని బాధ కోపంగా మారినట్టుంది.

అందరూ కలసి రాజు గదిలోకి వెళ్లారు.

సరోజ కళ్లు తుడుచుకుంటోంది.

రాజు అన్నాడు "డాక్టర్ బర్చ్ వచ్చాడు ఇందాక"

సురేష్ చెప్పాడు "అవును మీతో మాట్లాడినట్టు చెప్పాడు నాతో. అన్ని విషయాలూ వివరంగా నాక్కూడా చెప్పాడు"

ప్రకాష్ అన్నాడు "రాజూ నువ్వేమీ దిగులు పడకు. ఈ ఊళ్లో ఇంకా మంచి డాక్టర్లు ఎవరున్నారో కనుక్కుందాం. ఇక్కడ కాకపోతే ఇంకో ఊళ్లో ప్రయత్నం చేద్దాం"

కమలనీ, సుధనీ చూసి బావురుమంది సరోజ.

కమల, సరోజని దగ్గరకు తీసుకుని ధైర్యం చెబుతోంది.

"ప్రపంచంలో ఇన్ని రోగాలుండగా ఈ మాయదారిరోగం రావటమేమిటి? అందులోనూ రాజుకి" కమల అంది.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దం తాండవం చేసింది ఆ గదిలో.

హఠాత్తుగా అన్నాడు రాజు.

"నాకు తెలుసు. ది సీజ్ నాట్ ది ఎండ్ ఆఫ్ ది వరల్డ్ అని. సురేష్ నువ్వొక పని చేయగలవా? హ్యూస్టన్‌లోని ఎం.డి. ఆండర్సన్ హాస్పిటల్లో మంచి డాక్టర్లు ఎవరో కనుక్కుని నా రిపోర్టులన్నీ పంపిం

చగలవా? వాళ్లు రమ్మంటే వెళదాం. అప్పటిదాకా డాక్టర్ బర్చ్‌నే వైద్యం చేయమందాం"

రాజు ధైర్యంగా అలా మాట్లాడుతుంటే ప్రకాష్‌కీ ధైర్యం వచ్చింది. సరోజ, సుధ, కమల కూడా అతను అంత త్వరగా ధైర్యం పుంజుకుని పరిశీలనాత్మకంగా మాట్లాడుతున్నందుకు ఆశ్చర్యపోయారు.

సురేష్ కిందకు వెళ్లి ఆ హాస్పిటల్‌నుంచి రాజుకి సంబంధించిన కాగితాలు విడుదల చేయటానికి సరోజ సంతకంకోసం ఒక ఫారమ్ తెచ్చాడు. దానిమీద సరోజచేత సంతకం చేయించుకుని మళ్లీ కిందకు వెళ్లి ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులో ఇచ్చి వచ్చాడు.

సురేష్ రాజుతో అన్నాడు. "నీ రికార్డంతా రెండు కాపీలు కావాలని చెప్పాను ఆఫీసులో. ఓ గంటలో కాపీలు చేసి ఉంచుతానని చెప్పింది క్లర్కు. రేపు ఒకకాపీ హ్యూస్టన్ ఎం.డి. ఆండర్సన్ హాస్పిటల్‌కి పంపిస్తాను. చూద్దాం వాళ్లు ఏమంటారో"

"అక్కడ నీకు తెలిసిన డాక్టర్లు ఎవరయినా ఉన్నారా? " అడిగాడు రాజు సురేష్‌ని.

"డాక్టర్ హోల్‌మన్ అని కాన్సర్ ట్రీట్‌మెంటులో చాలా పేరుగలవాడు. అతని రీసెర్చికి మంచి గుర్తింపు కూడా వచ్చింది. ఆయన నా స్నేహితుడు కాదుకానీ వృత్తిరీత్యా పరిచయం ఉంది. మా మెడికల్ సెమినార్లలో కలుస్తుంటాం. ఆయనతో మాట్లాడదామనుకుంటున్నాను" అన్నాడు సురేష్.

సుధని ఆ రూమ్‌లోనే ఒక పక్కకు తీసుకువెళ్లాడు ప్రకాష్.

సుధా! ఈ విషయం వినీతకు చెప్పటం అవసరం. డాక్టర్ బర్చ్ మనల్నే చెప్పమన్నాట్ట. ఎంత త్వరగా చెబితే అంత మంచిది. ఆ పిల్ల మానసికంగా సిద్ధం అవటం అవసరం అన్నాడుట. ఎలా చెబుదామంటావ్? " అని అడిగాడు.

ప్రకాష్ సుధని సలహా అడిగింది రెండు కారణాలవల్ల. ఒకటి సుధ వినీతతో చనువుగా, స్నేహంగా ఉంటుంది. రెండవది సుధ ఛైల్డ్ సైకాలజీలో పి. హెచ్. డి. చేస్తోంది. వృత్తిరీత్యా పిల్లల మనస్తత్వం ఎరిగి ప్రవర్తించగలదు.

ఒక్క క్షణం ఆలోచించి సుధ అంది "ఆ విషయం నాకు వదిలేయి. నేను చెబుతాను. ఇవాళ సాయంత్రం మా ఇంటికి తీసుకుపోయి భోజనాలు అయిన తర్వాత చెబుతాను"

ఆ మాటలు విన్న సరోజ అడిగింది "చెప్పటం అవసరం అంటావా? " అని.

సుధ జవాబు చెప్పింది "అవును. అవసరమే! వినీత అమెరికాలో పెరుగుతున్న పిల్ల. ఇక్కడి పరిస్థితులను బాగా అర్థం చేసుకోగల అమ్మాయి. ఈ సంస్కృతికి అలవాటుపడ్డ పిల్ల. ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో వినీతకు బాగా తెలుసు.

నీకు వినీత, వినీతకు నువ్వు ఈ కారణాన బాగా దగ్గరవటం చాలా అవసరం. ఒకళ్ళకొకళ్ళు అండగా నిలబడితే మీ ఇద్దరికీ కొండంత బలం వస్తుంది. వినీత మరీ పసిపిల్లేంకాదు" అంది సుధ.

సరోజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏమీ మాట్లాడలేదు.

సుధ మాటలు వింటున్న రాజు అన్నాడు, "అవును సరోజా! సుధ చెప్పింది అక్షరాలా నిజం. అలా వినీతకు చెప్పినందువల్ల వినీతకు నాతో గడిపే ఈ మూడు నాలుగు నెలలూ, జీవితాంతం తన జ్ఞాపకాల్లో భద్రంగా దాచుకునే అవకాశం ఉంటుంది. అదీకాక, ఇక నీకు వినీత, వినీతకు నువ్వు" రాజు మాటలు ఆగిపోయాయి. గొంతు గాద్గదికమయింది. కళ్ళు మూసుకున్నాడు.

సుధ రాజు నుదిటిమీద చేయివేసి నిమిరింది ఆప్యాయంగా.

కమల సరోజను దగ్గరకు తీసుకుంది. కళ్ళల్లో నీళ్లు తిరుగుతుండగా ప్రకాష్





రూమ్‌లోనించి బయటకు వచ్చి కళ్ళు తుడుచుకున్నాడు.

సురేష్ కూడా ఆ వాతావరణాన్ని భరించలేక కిందికి వెళ్ళాడు. ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసులో రాజు హెల్త్ రికార్డు కాపీలు తీసుకున్నాడు. అక్కడినించే హ్యూస్టన్ హాస్పిటల్లో డాక్టర్ హోల్‌మన్‌కి ఫోన్ చేశాడు. ఆయన దొరకలేదు.

"ఆయన ఎప్పుడు వస్తారో తెలీదు. కానీ అర్జంటయితే ఆయన్ని పేజ్‌చేసి, మీ నెంబరు పిలవమని చెబుతాను" అంది ఆయన అసిస్టెంటు.

"వద్దు... నేను రేపు మళ్ళీ పిలుస్తాను" అని ఫోన్ పెట్టేశాడు సురేష్.

సుధ యూనివర్శిటీకి వెళ్ళిపోయింది పనుందని. వెళ్ళేముందు సరోజతో అంది.

"సాయంత్రం నేను వినీతను స్కూలు నించి పిక్ చేసుకుని, మా ఇంటికి తీసుకువెడతాను. మా ఇంట్లోనే అన్నం తింటుంది. డిన్నర్ అయ్యాక బహుశా-హాస్పిటల్‌కి వస్తాంలే"

సరోజ ఆ రాత్రికి హాస్పిటల్లో రాజుకి తోడుగా తనే పడుకుంటానంది.

అదే సమంజసమనిపించింది అందరికీ.

సురేష్ తన క్లినిక్కీ, ప్రకాష్ ఆఫీసుకి వెళ్ళిపోయారు. సురేష్ రాత్రికి మళ్ళీ వస్తానన్నాడు. ప్రకాష్ తనకి ఆ రాత్రి ఆఫీసులో సెమినార్ ఉందనీ మర్నాడు కలుస్తాననీ చెప్పి వెళ్ళాడు. కమల మాత్రం సరోజ, రాజులకు తోడుగా అక్కడే ఉండిపోయింది. తమ పక్కింటి లిండా మిల్లర్‌కి ఫోన్‌చేసి తను ఇంటికి ఆలస్యంగా వస్తాననీ, వాళ్ళమ్మాయి సమంతాతో పాటుగా తన కూతురు అరవిందని కూడా స్కూల్నించి వాళ్ళింటికి తీసుకువెళ్ళమని చెప్పింది.

"విత్ ప్లెజర్" అంది లిండా మిల్లర్.

సమయం సాయంత్రం ఆరుగంటలు. రాజుకి హాస్పిటల్ భోజనం తీసుకువచ్చారు. సరోజ దగ్గర ఉండి తినిపించింది రాజుకి. సరోజనీ, కమలనీ భోజనానికి వెళ్ళమని చెప్పి, రాజు కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కమల, సరోజను తీసుకుని ఎదురుగా ఉన్న పిజ్జా ప్లేస్‌కి వెళ్ళింది.

సరోజ ఏమీ తిననంటున్నా వినకుండా కమల బలవంతాన తినిపించింది.

తిన్న తర్వాత సరోజతో అంది- "సరోజా! ఇలాటి పరిస్థితులు ఎవరికీ రాకూడదని, ఎప్పుడూ అనుకుంటూ ఉంటాను. కానీ అనేక కారణాలవల్ల వస్తూనే వుంటాయి. పేపర్లలో, పుస్తకాల్లో చదవటం, సినిమాల్లో చూడటం తప్పిస్తే మన అనుభవంలోకి ఇలాటివి వస్తాయని, నేను ఎప్పుడూ కలలో కూడా అనుకోలేదు. ముఖ్యంగా మాకు ఎంతో మంచి స్నేహితులయిన మీకు..."

సరోజ మాట్లాడలేదు.

కమల ఒక్కక్షణం ఆగి అంది.

"మనకి ఇష్టంలేకపోయినా, మనం వద్దనుకుంటున్నా, ఇలాటివి వస్తూనే ఉంటాయి. వచ్చినప్పుడు ధైర్యంగా ఉండటం అవసరం. నాకు తెలుసు, నీలో ఆ ధైర్యం చాలా ఉందని. ఇలాటి సమయాల్లోనే ఆ ధైర్యం, మనల్ని మనుష్యులుగా నిలబెట్టి, ఈ జీవిత పరీక్షలో పాస్ చేయిస్తుంది. ఒకటి మాత్రం గుర్తుంచుకో. ఏ క్షణాన ఏ అవసరం వచ్చినా మేమంతా నీ పక్కనే ఉన్నామని. మనమందరం మన దేశాన్నీ, మనవాళ్ళందరినీ వదిలి ఇంత దూరం వచ్చాం. ఇక్కడ మనమే ఒకళ్ళకొకళ్ళం బంధువులం. సుఖాల్లోనేకాక, కష్టాల్లో కూడా మనం ఒకళ్ళకొకళ్ళం అండగా ఉండవలసిన వాళ్ళం..."

ఏమీ మాట్లాడకపోయినా సరోజ కళ్ళల్లోని కృతజ్ఞతాభావం, ఆప్యాయతతో కూడిన మెరుపూ కమలను కదిలించాయి. కమల సరోజ చేతిని తనచేతిలోకి తీసుకుని మృదువుగా నొక్కింది.

కమల సరోజని హాస్పిటల్లో రాజు గది దగ్గర దింపి మళ్ళీ మర్నాడు కలుస్తానని

చెప్పి వెళ్ళిపోయింది.

ఆరోజు సాయంత్రం వినీత చదివే స్కూలుకి వెళ్ళి ఆ పిల్లను కారులో ఎక్కించుకుని తమ ఇంటికి తీసుకువెళ్ళింది సుధ.

ఇంటికి వెళ్ళగానే ఫ్రిడ్జ్‌లోనించి బత్తాయి రసం గ్లాసులోపోసి వినీతకు ఇచ్చింది సుధ.

అది తీసుకుని, టి.వి. ఆన్‌చేసి సోఫాలో కూర్చుంది వినీత.

సుధ వినీత పక్కనే సోఫాలో కూర్చుంది.

"నాక్కూడా ఈటీవీ షో అంటే బాగా ఇష్టం" అంది.

వినీతతోపాటు ఆ షో అయిపోయేదాకా అక్కడే కూర్చుంది సుధ.

షో పూర్తయ్యాక అంది సుధ. "వినీతా! నీకు అన్నం వేడిచేసి పెడతాను"

"ఒకే" అంది వినీత టీవీ చూస్తూనే.

పది నిమిషాల్లో అన్నీ సిద్ధంచేసింది సుధ.

"ఆంటీ! మరి నీకో? " అడిగింది వినీత.

సుధ నవ్వింది. "నీతోపాటూ నేనూ తింటాను. అంకుల్ ఇవాళ బాగా ఆలస్యంగా వస్తారు" అంది.

వినీత అన్నం తింటుండగా అంది సుధ "మనం అన్నం తిన్న తర్వాత, కాస్సేపు మాట్లాడుకుని,అప్పుడు హాస్పిటల్‌కి వెళ్దాం"

వినీత తన పెద్ద కళ్ళు టపటపలాడించి, "అవును, నేనూ హాస్పిటల్‌కి వెడదామని అడుగుదామనుకుంటున్నాను" అంది.

సుధ నవ్వుతూ అంది "డాడీని చూడాలని ఉంది కదా" అని.

తలూపింది వినీత అవునన్నట్టుగా.

భోజనాలు ందయాక అంది సుధ.

"మనమందరం భారతీయులం. ఇంత దూరంవచ్చి అమెరికాలో ఉంటున్నాం. అంటే మనం ఇండియాకి కన్న పిల్లలం. అమెరికాకి పెంపుడు పిల్లలం. ఎలా అనుకున్నా మనం ఈరెండు దేశాలకూ సంబంధించినవాళ్ళం. ఈరెండు సంస్కృతులలో భిన్నత్వమున్నా, ఒకదానికొకటి చక్కగా అన్వయించుకుని, వాటిల్లోని మంచిని గ్రహించే తెలివితేటలున్నాయి మనకు"

సుధ మాట్లాడే తీరు ఎప్పుడూ అలాగే ఉంటుంది కనుకా ఆవిడ చెప్పే విషయం మీద అంతకుముందే చాలా చర్చలు స్కూల్లోనూ, ఇంట్లోనూ కూడా వింది కనుకా, అర్థంచేసుకునే తెలివితేటలు ఉన్నాయి కనుకా, వినీత నిశ్శబ్దంగా వింటోంది.

"ఇండియాలో ఒకళ్ళకొకళ్ళు తోడుగా ఉండటమేకాకుండా కావలసిన వ్యక్తులమధ్య అనురాగాలూ, అనుబంధాలూ ఎక్కువ. తమకు కావలసినవాళ్ళు సుఖంగా ఉంటే ఎంత ఆనందిస్తారో కష్టాలు వస్తే అంత బాధపడతారు. కష్టాలు వచ్చినప్పుడు వేదాంతపరంగా వాళ్ళ ఆవేదనను తీర్చుకుంటారు. అమెరికాలో అలాకాదు. భౌతికంగా అన్నీ విపులంగా వివరించుకుని కష్టాలకు సిద్ధమౌతారు. అందువల్ల అమెరికాలో ప్రేమ, అనురాగం లేవనుకోవటం తప్పు. ప్రేమ, అనురాగం, ఒకదేశానికీ, ఒక సంస్కృతికీ సంబంధించినవికావు. అవి అందరిలోనూ ఉన్నాయి. అవి విశ్వవ్యాప్తం..."

"నేను ఇంతకుముందే విన్నాను అవన్నీ. అవునూ... ఇవన్నీ ఇప్పుడెందుకు చెబుతున్నావు" అడిగింది వినీత.

చిన్నగా నవ్వింది సుధ.

"వస్తున్నాను. మీ డాడీకి ఆరోగ్యం బాగాలేదని నీకు తెలుసు. మనం రోజూ రాజుపడుతున్న బాధ, డాక్టర్ల ప్రయత్నం చూస్తూనేవున్నాం. ఇలాటి సమస్యలకు రకరకాల ముగింపులు ఉంటాయి" చెప్పటం ఆపింది సుధ.

వినీత దీర్ఘంగా ఆలోచిస్తోంది.

సుధ రెండు నిమిషాలు నిశ్శబ్దంగా ఉండి అడిగింది "ఏమిటాలోచిస్తున్నావ్? " అని.

వినీత సాలోచనగా అన్నది. "నాకు




మూడు రకాల ముగింపులు ముఖ్యంగా కన పడుతున్నాయి"

ఆ పిల్ల మాటలకు ఒక్కక్షణం ఆశ్చర్య పోయి వెంటనే తేరుకుని అడిగింది సుధ "గుడ్! అవేమిటో చెప్పు" అని.

"ఒకటి- పూర్తిగా తగ్గిపోయి డాడీ మామూలుగా అయిపోవటం" ఆగింది వినీత.

"అవును, ఈ హాస్పిటల్లో డాక్టర్లు శక్తివం చనలేకుండా ప్రయత్నం చేస్తున్నారు. ఇక్కడ తగ్గకపోతే ఇంకోచోట ప్రయత్నం చేస్తాం" అంది సుధ వినీత మాటలకు ప్రోత్సాహం ఇస్తూ.

"రెండవది... పూర్తిగా తగ్గకపోవటం. మందులతో ఒకరోజు హుషారుగానూ, ఒక రోజు బాధతోనూ... అలా జీవితం గడిపివే యటం..."

వినీత చాలా తెలివైన పిల్ల అని తెలిసినా, ఆ అమ్మాయి మాటలకు ఆశ్చర్యపోయింది సుధ.

"అవును. అదింకొక ముగింపు. దానివల్ల మనవాళ్ళు, మనపక్కనే ఉంటారు. మనం వాళ్ళకు బాగా సహాయం చేయవచ్చు. వాళ్ళు కూడా ధైర్యంగా చావుతో పోట్లాడి గెలిచే అవకాశాలు ఉన్నాయి" అన్నది సుధ.

"ఇక మూడవది, చనిపోవటం" అంది వినీత.

అని తన పెద్దకళ్లను మరింత పెద్దవిచేసి అదోలా చూసింది సుధని.

సాధ్యమైనంత మామూలుగా అనటానికి ప్రయత్నంచేస్తూ అంది సుధ.

"అవును, అది మూడవ ముగింపు. మన కెవ్వరికీ ఇష్టంలేని ముగింపు. మనం ఎప్పుడూ వద్దనుకునే ముగింపు. కానీ ఒక్కొ క్కప్పుడు అదే మంచిదనిపిస్తుంది" అంది సాలోచనగా.

"ఎలా? " అడిగింది వినీత.

"నేనంటే నీకు ఇష్టమేనా? " అడిగింది సుధ.

"చాలా ఇష్టం. ఐ లవ్ యు" అంది వినీత.

"థాంక్స్" చిన్నగా నవ్వింది సుధ, వినీత చేతిని తనచేతిలోకి తీసుకుంటూ.

ఒక్కక్షణం ఆగి అంది.

"ఉదాహరణకి నన్నే తీసుకో. నాకేదో కడుపులో అనారోగ్యం అనుకో. విపరీతంగా బాధ పెట్టేస్తుంటుంది. భరించలేక ఏడిచే స్తుంటాను. డాక్టర్లు ఎంత ప్రయత్నంచేసినా అది తగ్గదు. వాళ్ళు ఇంక చేసేదేమీ లేదు అంటారు. అప్పుడు ఆ బాధ నేను రోజూ అలా భరిస్తుంటే నీకు బాగుంటుందా, లేక ఒక్కసారిగా ఆ బాధలన్నీ వదిలేసి చని పోతే నీకు బాగుంటుందా" అని అడిగింది సుధ.

వినీత మూడు నిమిషాలు మాట్లాడలేదు. దీర్ఘంగా ఆలోచించింది.

ఒక్కక్షణం ఆగి, సోఫాలో సుధకు కొంచెం దగ్గరగా జరిగి "జీవితాంతం ఆ బాధ భరించటంకన్నా, చనిపోవటమే నయం" అంది వినీత.

"అవును. మానాన్నగారి విషయంలో సరిగ్గా అలానే జరిగింది. ఆయనపడ్డ బాధలు చూడలేకపోయేవాళ్ళం. చివరకు ఆయన చనిపోయాక అనుకున్నాం ఆయన తోపాటూ ఆయన బాధలూ పోయాయి. అదృష్టవంతుడని" సుధ కళ్ళు తుడుచు కుంది.

వినీత మాట్లాడలేదు. ఆమెకు ఇంకొంచెం దగ్గరగా జరిగింది.

ఒక్కక్షణం ఆగి అంది సుధ. "మన ముందు తిరిగే మనవాళ్ళు చనిపోతే చాలా బాధగా ఉంటుంది. కాని వాళ్ళ జీవితం మన బంధాలను చూసి బాధపడి మన కోసం ఆగదు. ఇండియాలో మనం, బెంగు ళూరునుంచి హైద్రాబాద్ రైల్లో వెళ్తుంటే, మనపెట్టెలో కొంతమంది ఎక్కుతుంటారు. కొంతమంది దిగుతుంటారు. జీవితం కూడా అంతే. ఎవరి ఊరు వచ్చినప్పుడు

వాళ్ళు దిగిపోవలసిందే. వాళ్ళు వదిలేసిన సీట్లలో కొత్తవాళ్ళు ఎక్కుతుంటారు. మనతో సరదాగా కాలక్షేపం చేసినవాళ్ళు దిగి వెళ్ళిపోతుంటే కొంచెం బాధగా ఉంటుందిగానీ, వాళ్ళ ప్రయాణం మన కోసం ఆగదు. అలాగే మన ప్రయాణం అయిపోయాక, మన ఊరు వచ్చాక మనం కూడా వెళ్ళిపోవలసిందే"

వినీత ముఖం చూస్తుంటే ఆమెకు అంతా అర్థమయిందనీ దీర్ఘంగా ఆలోచిస్తోందనీ తెలుస్తూనేవుంది.

సుధ ఆ ఆలోచనలకు అంతరాయం కలిగించకుండా మౌనంగా వున్నది.

వినీత చటుక్కున తలెత్తి, "మానాన్న చనిపోతాడని చెప్పారా డాక్టర్లు?" అని అడిగింది.

ఆ ప్రశ్న ఆ పిల్ల దగ్గరనించి రావటంకోసమే, సంభాషణను అలా నడిపించిన సుధకు, ఆ ప్రశ్న రాగానే ఆ పిల్లలో ఒకవిధమైన వణుకు ప్రారంభమయింది. మెడవెనుక స్ట్రెస్ తెలుస్తున్నది. వినీత చేతిని తన చేత్తో మృదువుగా వత్తుతూ దగ్గరకు లాక్కుంది.

"అవును. అదే డాక్టర్లు చెప్పారు. కాన్సర్ పొట్టంతా వ్యాపించిందిట. ఇంకా మూడు నెలలకన్నా బతకటం కష్టం అని చెప్పారు"

వినీత మనసులోని భావాలు, ఎలా పెల్లుబుకుతున్నాయోకానీ, సుధ నడుముచుట్టూ చేతులువేసి, ఆమెకు హత్తుకుపోయింది.

రెండు నిమిషాలు ఇద్దరూ మాట్లాడలేదు. వినీత చేతులలో పట్టు కొంచెం సడలాక సుధ అంది.

"ఈ పరిస్థితిని మనం రెండు రకాలుగా ఎదుర్కోవాలనిపిస్తోంది నాకు"

వినీత కుతూహలంగా చూసింది సుధను.

"ఒకటి. ఈ దేశం డాక్టర్లకు తక్కువ కాదు. వైద్యశాస్త్రంలో ప్రపంచంలో ప్రథమ స్థానంలో ఉంది. కనుక మనం ఇంకా మంచి మంచి డాక్టర్లకు చూపిద్దాం. సురేష్ అంకుల్ అప్పుడే స్పెషలిస్ట్‌లతో మాట్లాడుతున్నాడు. వేరే డాక్టర్‌ను త్వరలో కలుద్దామని ప్రయత్నం చేస్తున్నాడు"

సుధ చెప్పటం ఆపింది వినీతకు ఆలోచించుకోటానికి కొంత సమయం ఇస్తూ.

ఒక్క క్షణం ఆగి వినీత అడిగింది "ఈ పరిస్థితిని రెండు రకాలుగా ఎదుర్కోవాలి అన్నావే మరి ఆ రెండోది ఏమిటి?" అని.

సుధ మాటలలో వేగం కొంచెం తగ్గించి అంది "వైద్యశాస్త్రం ఎంత ముందుకు పోతున్నా, ఎంత ధైర్యంగా మనం చావుతో పోట్లాడినా, పుట్టిన ప్రతివాళ్ళకీ చావు తప్పదు. అది పూర్తిగా మన చేతుల్లోలేదు. కాకపోతే, మనం చివరిదాకా ప్రయత్నం చేస్తాం అంతే. కానీ ఆ చావు త్వరలో వస్తుంది అని తెలిసినప్పుడు దానికి సిద్ధమవటం అవసరం. మానసికంగా, భౌతికంగా, ఆర్థికంగా మనం సిద్ధంకావాలి"

"అంటే...?"

"అంటే అన్నివిధాలా... అన్నీ ఆలోచించి అని..."

"చర్చిలోనూ, మన గుడిలోనూ ప్రార్థనలు చేస్తే?" అడిగింది వినీత.

"తప్పకుండాను. మనం చేసే ప్రయత్నాల్లో అదీ ఒకటి. ఈ ప్రయత్నాల్లో ఏది ఫలించినా మనం అదృష్టవంతులమయిపోతాం. కానీ అవేవీ ఫలించని పరిస్థితుల్లో మనం మనవాళ్ళు మనల్ని వదలి వెళ్ళిపోతున్నారనే భావాన్ని ముందుగానే మనసులోకి తీసుకువచ్చి దానికి సిద్ధమవటం అవసరం!"

వినీత మాట్లాడలేదు. రెండు కళ్ళల్లోనూ కన్నీటి బిందువులు బయటకు రావటానికి బిడియపడుతూ తళతళా మెరుస్తున్నాయి. వినీత తలను తన ఒడిలో పెట్టుకుని నుదిటిమీద ముద్దుపెట్టుకుంది సుధ.

పది నిమిషాలు గడిచాయి.

సుధ ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపో




యింది.

"ఓకె హనీ! మనమిప్పుడు మా కొత్త కారులో హాస్పిటల్‌కి వెడుతున్నాం" అంది ఉత్సాహం తెచ్చిపెట్టుకుని. మూడు నిమిషాల్లో ఇద్దరూ కారెక్కి హాస్పిటల్‌కి బయల్దేరారు.

★ ★ ★

యూనివర్సిటీ లైబ్రరీలో నాలుగు పుస్తకాలూ, అరడజను మెడికల్ జర్నల్సూ టేబుల్ మీద పరుచుకుని దీక్షగా చదువుతున్నాడు సురేష్.

అతను ఎంత ఎక్కువగా ఆ జబ్బు గురించి తెలుసుకుంటున్నాడో అతనిలో నిరుత్సాహం అంతగా పెరుగుతోంది. అయినా పట్టు విడవకుండా వివరాలు సేకరిస్తున్నాడు. మధ్యమధ్యలో కొన్ని పేర్లూ, వాళ్ళ ఫోన్ నెంబర్లూ రాసుకుంటున్నాడు.

అప్పటికి అతను లైబ్రరీకి వచ్చి నాలుగు గంటలు పైగా అయింది.

కడుపులో ఆకలిగా వుంది. మెడ దగ్గర నొప్పి అతని స్ట్రెస్‌లెవెల్ బాగా ఎక్కువగా వుందని చెబుతోంది. అయినా ఇంకొక జర్నల్లో హార్వర్డ్ మెడికల్‌స్కూల్ వాళ్ళ రీసెర్చి పేపర్ చదవవలసింది వుంది. సురేష్ లేచి ఒకసారి ఒళ్ళు విరుచుకుని కిటికీదగ్గరకు వెళ్ళి బయటకు చూస్తూ నుంచున్నాడు. బాగా చీకటి పడిందేమో ఆకాశంలో మిణుకుమిణుకుమంటున్న తారలు తప్ప అంతా చీకటిగా వుంది. ఆ చీకట్లో చందమామకోసం వెతికాడు సురేష్.

తూర్పు దిశన మబ్బుల్లో మునిగిపోయి వున్నాడు చంద్రుడు. బయటకు రావాలనీ, తన వెన్నెల వెలుగుని అందరికీ పంచాలనీ ప్రయత్నం చేస్తున్నాడు. కానీ నల్లటి మబ్బులు చందమామకు అడ్డంగా దట్టంగా వ్యాపించి వున్నాయి.

సురేష్‌కి ఏదో వింత ఆలోచన వచ్చింది. మనసులోని భావాలు పెల్లుబికినాయి కాబోలు "కమాన్... యుకెన్ డూ ఇట్ రాజూ... యు కెన్ డూ ఇట్..." అన్నాడు పెద్దగా.

అన్న తర్వాత కానీ అతనికి తెలియలేదు ఆ మాటలు ఎంత అసంకల్పితంగా బయటకు వచ్చాయో.

ఎవరన్నా తన మాటలు విన్నారేమోనని వెనక్కి తిరిగి చూశాడు.

తనని ఎంతసేపట్నించి చూస్తోందో కానీ ఒకామె సురేష్ వెనక్కి తిరగటంచూసి చిరునవ్వు నవ్వింది. సురేష్ కూడా నవ్వి మళ్ళీ తన టేబుల్‌దగ్గర కూర్చున్నాడు.

ఆమె చక్రాల కుర్చీలో కూర్చుని వుంది. ఆమె తెల్లటి అందమైన ముఖంలో అలసట బాగా తెలుస్తోంది. కొంచెం విశ్రాంతికోసం సురేష్‌తో సంభాషణ చేయటంకోసం ఎదురుచూస్తోందని తెలుస్తూనే వుంది.

చక్రాల కుర్చీని సురేష్‌కి ఎదురుగా లాక్కుని "మిమ్మల్ని డిస్టర్బ్ చేయటంలేదు కదా. నా పేరు కరీనా" అంది.

"లేదు... లేదు...హవ్వార్యూ... నా పేరు సురేష్" అన్నాడు.

ఆమె అతను చదువుతున్న పేపర్ చూసి "పాంక్రియాటిక్ క్యాన్సర్ గురించి చదువుతున్నారా" అంది.

సురేష్ తల వూపాడు.

"ఇందాకటినించీ చూస్తున్నాను. మీరు ఎన్నో పుస్తకాలు, పేపర్లూ చాలా సీరియస్‌గా తిరగేస్తున్నారు. మీరు డాక్టరా? " అని అడిగింది కరీనా.

"ఓ అయామ్ సారీ. మీకు సరిగ్గా పరిచయం చేసుకోలేదు. నా పేరు డాక్టర్ సురేష్. నేను గైనకాలజిస్టుని"

కరీనా నవ్వుతూ సురేష్‌ని అదోలా చూసింది.

సురేష్ కూడా నవ్వాడు "గైనకాలజిస్టుకి కాన్సర్ రీసెర్చి ఏమిటా అనుకుంటున్నారా! నా ఫ్రెండ్‌కి ఒంట్లో బాగాలేదు. అతనికో సంలెండి" అన్నాడు.

కరీనా గమ్మత్తుగా కళ్ళు చిట్లించి "నేనేమీ



అనలేదు. మీరే అన్నారు. కనీసం మీరొక డాక్టర్. నేను వట్టి లైబ్రరీ అసిస్టెంట్‌ని మాత్రమే. ఇవాళ కొంచెం ఫ్రీగా వుండటం వల్ల ఇక్కడ కూర్చుని వెన్నెముక గురించి కనపడిన పుస్తకాలన్నీ చదువుతున్నాను" అంది.

సురేష్ ఆమెవేపు కుతూహలంగా చూశాడే కానీ, సభ్యత అడ్డువచ్చి ఎందుకు అని మాత్రం అడగలేదు.

కరీనా తనే అంది. "మీరు మీ ఫ్రెండ్ గురించి అంతగా చదవటం చూస్తుంటే, మీరు స్నేహానికి ఎంత విలువిస్తారో తెలుస్తోంది"

"బాగా తెలిసినవాళ్ళు, కావలసినవాళ్ళు కష్టాల్లో వున్నప్పుడు ఎవరైనా ఆ మాత్రం సహాయం చేయకుండా ఎలావుంటారు? " అన్నాడు సురేష్.

చటుక్కున తల పైకెత్తి అతన్ని సూటిగా చూసింది కరీనా. ఒక్కక్షణం ఆగి అంది, "మనిషికీ మనిషికీ మధ్య ఆ అవగాహన, ఆదుకోవాలని తపించే సహృదయం ఉండటం చాలా అవసరం. అందరూ అలా అనుకుంటే అంతకన్నా కావలసినదేముంటుంది. ఉదాహరణకి నా సంగతే తీసుకోండి" చెప్పటం ఆపింది కరీనా.

సురేష్ ఏమీ మాట్లాడలేదు. ఆమెవేపు చూసి తలవూపాడు.

కరీనా నెమ్మదిగా అంది "నా ఆలోచనలు మీతో చెప్పాలని వుంది. మీ కభ్యంతరంలేకపోతేనే సుమా..." అని.

"చదివీ చదివీ నాకూ బోరు కొడుతోంది. మిగతావి రేపు చూస్తాను. ఇంకో పది నిమిషాల్లో ఇంటికి వెడదామనుకుంటున్నాను. చెప్పండి" అన్నాడు.

ఆమె ఒక్క నిమిషం కళ్ళు మూసుకుంది. కళ్ళు తెరిచి టపటపా ఆర్పి అంది. "నాకూ జెఫ్‌కి సరిగ్గా ఆరు నెలలక్రితమే పెళ్ళయింది. జెఫ్ ఒక బాంక్‌లోనూ, నేను ఫస్ట్ లేడీ అనే జిమ్‌లో ఎక్సర్‌సైజ్ ఇన్‌స్ట్రక్టర్‌గానూ పనిచేస్తూ వుండేవాళ్ళం. మాకు పెళ్ళయిన వారం రోజుల తర్వాత ఒక సాయంత్రం నేను జిమ్‌నించి కారులో కంట్రీ రోడ్డుమీద ఇంటికి వస్తున్నప్పుడు హఠాత్తుగా ఒక కుక్కపిల్ల కారుకి అడ్డం వచ్చింది. దాన్ని తప్పించబోయి కారుని పక్కకి తిప్పితే కారు ఆ స్పీడుకి ఆగలేక రోడ్డు పక్కన గుంటలో పడి దొర్లుకుంటూ వెళ్ళి అక్కడ వున్న చెట్టుకి గుద్దుకుంది. అపస్మారకంగా పడిపోయిన నేను నాలుగు రోజులు కోమాలో వున్నాను. స్పృహలోకి వచ్చాక కానీ తెలియలేదు వెన్నెముక విరిగిపోయిందని. తర్వాత ఒకదానిమీద ఒకటి, మూడు ఆపరేషన్లు చేశారు. ఇప్పుడు వీల్ ఛైర్‌కే అంకితమయిపోయాను" కరీనా చెప్పటం ఆపింది.

"సారీ టు హియర్ దట్" అన్నాడు సురేష్.

"ఒక వారంరోజులు నా దగ్గర వున్నాడేమో జెఫ్. నన్ను ఆ పరిస్థితిలో అలాగే వదిలేసి వెళ్ళిపోయాడు నన్ను పెళ్ళాడిన పెద్దమనిషి!" కరీనా ఆ మాటలు కొంచెం కోపంగానే అంది.

సురేష్ ఆమెవేపు సాదరంగా చూశాడు.

"అందరూ అలా వుంటారని నేను అనటంలేదు. చాలామంది మంచిమనుషులు నా జీవితంలో తారసపడ్డారు. కానీ ఇతను నా జీవితాన్ని పంచుకోవలసిన మనిషి. ఇలా అర్ధాంతరంగా నా జీవితంలోనించి వెళ్ళిపోతాడని నేనసలు అనుకోలేదు" అంది.

"మరి... మీకు సహాయంగా..." సురేష్ అడిగాడు.

ఆమె నవ్వింది. "చెప్పానుగా. చాలా మంది మంచిమనుషులు నా జీవితంలో తారసపడ్డారని. అలాటివాళ్ళల్లో ఒక మనిషి నాకు అండగా నిలబడ్డాడు. అతనే నాలోని గుండెధైర్యం, మనోనిబ్బరం అనేవాటిని నిద్రలేపాడు. అతని సహాయంతోనే ఇలా





వున్నాను. రోజూ థెరపీకి వెళ్ళటమే కాక, ఎన్నో ఎక్సర్‌సైజ్‌లు చేసేదాన్ని. కదలిక కోసం వీల్‌ఛైర్‌లో వుంటున్నానే కానీ చాలా కష్టపడి శరీరాన్ని నా స్వాధీనంలోకి తెచ్చుకున్నాను. నెలరోజుల క్రితమే ఈ లైబ్రరీలో అసిస్టెంటుగా చేరాను. ఎవరిమీదా భారం కాకుండా నా బతుకు నేను బతుకుతున్నాను. సమయం దొరికినప్పుడల్లా ఈ వెన్నెముక గురించి కాస్త అర్థంచేసుకుందామని ఈ పుస్తకాలలో వెదుకుతున్నాను" అంది.

ఆ చిన్న వయసులోనే ఎముకలు విరిగిపోయి అవిటిదయిపోయిన ఆమె నమ్ముకున్న మనిషి అవసరానికి ఆదుకోకుండా అంతర్ధానమైనా కూడా అంత త్వరగా తేరుకోవటం, ఎంతో ఆత్మ విశ్వాసంతో ముందుకు పోవటం సురేష్‌ని నిజంగా ఆశ్చర్యపరిచింది. ఆ మాటే ఆమెతో అన్నాడు.

ఆమె నవ్వింది. "మళ్ళీ మామూలు మనిషి అవటానికి అదొక్కటే మార్గం మరి. అదీకాక మా నాన్న అంటుండేవాడు ఎప్పుడూ 'పెర్సిస్టెన్స్, పట్టుదల అవసరమని, అదిలేకపోతే జీవితంలో ఏదీ సాధించలేమ'ని. నాలో ఎన్ని నరాలు వున్నాయో అన్నిసార్లు చెప్పాడాయన. అందుకే నరనరాన జీర్ణించుకుపోయిందది"

సురేష్ ఆమెవేపు సూటిగా చూసి, నవ్వుతూ అన్నాడు "మిమ్మల్ని చూస్తుంటే గర్వంగానూ, మీ పట్టుదలని చూస్తే అసూయగానూ వుంది నాకు"

ఆమె కూడా నవ్వింది.

ఇంతలో ఎవరో కుర్రవాడు పుస్తకాలతో కౌంటర్ దగ్గరకు రావటం చూసి, ఆమె "నేను వెళ్ళాలి. నైస్ టాకింగ్ టు యు" అని వెళ్ళిపోయింది.

చక్రాల కుర్చీలో ముందుకు వెడుతున్న ఆమెను దీక్షగా చూశాడు సురేష్. ఎక్కడో చదివింది గుర్తుకు వచ్చింది ది ఫోర్స్ ఆఫ్ హ్యూమన్ పవర్ అని. మనిషి తలుచుకుంటే చాలాచాలా చేయవచ్చు

తను రాసుకున్న నోట్సూ, పేర్లూ, ఫోన్ నెంబర్లూ అన్నీ తీసుకుని బ్రీఫ్‌కేస్‌లో పడేశాడు. లేచి బయటకు వస్తూ కౌంటర్‌దగ్గర పనిచేసుకుంటున్న కరీనావేపు స్నేహపూర్వకంగా చూసి, "బైబై... హేవ్ ఎ నైస్ ఈవెనింగ్ అండ్ గుడ్ లైఫ్" అని బయటకు వచ్చాడు.

పార్కింగ్ లాట్‌లో కారు దగ్గరకు వస్తూ ఆకాశంలోకి చూశాడు సురేష్.

ఆకాశంలో ఆ చీకట్లో మబ్బులచాటునించి బయటకు వచ్చి తెల్లటి, చల్లటి వెన్నెలను వెదజల్లుతున్నాడు చందమామ.



అక్కడ హాస్పిటల్లో రాజు నిద్రపోవటం లేదని, కళ్ళు మూసుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడనీ సరోజకు తెలుసు.

సరోజ వెళ్ళి మంచంమీద అతని పక్కనే కూర్చుని అతని ముఖాన్నే దీక్షగా చూస్తోంది.

రెండు నిమిషాల తర్వాత రాజు కళ్ళు తెరిచాడు. సరోజ రాజు భుజంమీద చేయి వేసి గోముగా చూసింది.



రాజు కనురెప్పలు ఆర్పకుండా చూశాడు సరోజని.

"నీకు తగ్గుతుందనీ, ఈ అనారోగ్యంనించి బయటపడతావనీ నాకు గట్టి నమ్మకం ఉంది నీకు నయమవటానికి ఏం చేయాలన్నా చేద్దాం. నువ్వు మాత్రం అధైర్యపడకు" అంది సరోజ ధృడంగా.

రాజు అన్నాడు, "నాకూ తగ్గుతుందనే నమ్మకం, ఆశా ఉన్నాయి. కానీ"

"కానీలేదు, అణాలేదు. అవన్నీ పోయాయిప్పుడు. ఇక్కడ డాక్టర్లు లీగల్ ప్రాబ్లమ్స్ వస్తాయని ఏవో అనవసరమైనవి చెప్పి భయపెడుతుంటారు. నువ్వేమీ డీలా పడకు" అంది సరోజ రాజు పెరిగిన గడ్డం మీద మృదువుగా నిమురుతూ.

రాజు ఆమె చేయి పట్టుకుని అన్నాడు. "నాకు తెలుసు అవన్నీ. కానీ నేను ఆలోచిస్తోంది అది కాదు. ఒకవేళ వాళ్ళు చెప్పిందే నిజమనుకో. నిజంగా నాకు మూడు నెలల కన్నా బతికే అవకాశంలేదనుకో. అప్పుడు నేనూ, నువ్వూ, వినూ దానికోసం సిద్ధమవటం అవసరం అందుకని"

అతన్ని మాట్లాడనీయకుండా తన చేత్తో నోరు మూసింది సరోజ.

"అలా ఎన్నటికీ జరగదు. ఇక్కడ ఏ రోగినీ అంత తొందరగా చనిపోవటానికి ఒప్పుకోరు. చివరిదాకా పట్టుదలతో ప్రయత్నం చేస్తూనే ఉంటారు"

"అవుననుకో... కానీ..."

"కానీలు లేవన్నానా" ఆమె గొంతు కొంచెం గాద్గదికమైంది. "నీకు తగ్గగానే మనందరం పిట్స్‌బర్గ్‌లో వేంకటేశ్వరస్వామి గుడికి వెళ్దాం. పూర్తిగా తగ్గిన తర్వాత ఇండియా వెళ్ళి తిరుపతి వెళ్దాం"

రాజు ఏమీ అనలేదు. ఆమె ముఖాన్నే దీక్షగా చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

అప్పుడే వచ్చారు వినీత, సుధ.

వినీత గబగబా వచ్చి రాజు బుగ్గమీద ముద్దుపెట్టుకుని, "ఐ లవ్ యు డాడీ!" అని అతన్ని కావలించుకుని, అతని గుండెలమీద తల ఆనించి పక్కనే పడుకుంది.

సుధని కళ్ళతోనే అడిగింది సరోజ "అసలు విషయం చెప్పావా" అని.

కళ్ళు ఆర్పి అవునని సమాధానం చెప్పింది సుధ.

రాజు కూడా వాళ్ళిద్దరిమధ్యా జరిగిన "కళ్ళ" సంభాషణ చూసి విషయం అర్థంచేసుకున్నాడు. వినీతను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. వినీత అతనికి ఇంకా దగ్గరగా జరిగి హత్తుకు పడుకుంది.

"సురేష్ వచ్చాడేమో చూసి వస్తాను" అని సుధ ఆ గదిలోనించి బయటకు వెళ్ళింది. పోతూపోతూ తలుపు దగ్గరకు వేసి వెళ్ళింది వాళ్ళు మాట్లాడుకోవటానికి స్వతంత్రంగా ఉంటుందని.

అయిదు నిమిషాలు గడిచాయి. ఎవరూ ఏమీ మాట్లాడటంలేదు. రాజుమీద చేయి వేసి పడుకున్న వినీత మధ్యమధ్యలో రాజుని గట్టిగా హత్తుకుంటోంది అతను ఎక్కడికయినా పోతాడేమోనన్నట్టుగా. వినీత మనసులో ఎగసిపడుతున్న భావాలు అతని హృదయంమీద స్పందిస్తుంటే రాజు కూడా కళ్ళు మూసుకున్నాడు.

సరోజ వినీత భుజంమీద చేయివేసి ప్రేమగా నిమురుతూ అడిగింది. "విన్నూ! అన్నం తిన్నావా?"

వినీత కళ్ళు తెరచి అంది "తిన్నాను. సుధ ఆంటీ నేనూ కలిసి తిన్నాం" అంది. అంటూనే లేచి సరోజ ఒడిలో తలపెట్టుకుని పడుకుంది.

ఒక్క క్షణం ఆగి, "సుధ ఆంటీ అన్నీ చెప్పింది. అయితే డాడీ..." అంది.

సరోజ కళ్ళల్లోనించి వస్తున్న నీళ్ళను కనపడకుండా బలవంతంగా ఆపుకుంటూ, "అవును" అంది.

ఒక్కక్షణం ఆగి, "అలా అని ఇక్కడి డాక్టర్లు అంటున్నారు. అయినా మనం

అన్నిచోట్లా ప్రయత్నంచేద్దాం. ఇక్కడ కాక పోతే ఇంకోచోట" అంది సరోజ ఈసారి చాలా ధృడంగా.

"అవును. మొన్న టీవిలో, ఒక షోలో వచ్చింది. క్యాన్సర్‌మీద ఎంత రీసెర్చి జరుగుతుందో చూపించారు. ఇంతకుముందు కన్నా కూడా ఇప్పుడు క్యాన్సర్ తగ్గటానికి అవకాశాలు ఎక్కువ అని చెప్పారు" అంది వినీత.

రాజు వినీతను ఆశ్చర్యంగా చూశాడు. తనకు దగ్గరగా లాక్కుని ముద్దుపెట్టుకున్నాడు.

"నువ్వు చెప్పింది నిజమే. అందుకే మన ప్రయత్నాలు మనం చేద్దాం. తగ్గితే మనందరికీ మంచిది. తగ్గలేదనుకో, కనీసం మన ప్రయత్నాలు మనం చేశామన్న తృప్తి వుంటుంది" అన్నాడు రాజు.

"తగ్గకపోవటమన్న ప్రశ్నేలేదు. తగ్గుతుంది. నాకు తెలుసు" అంది సరోజ.

రాజు సరోజను ప్రేమగా చూశాడు.

రాజు వినీతతో అన్నాడు. "సురేష్ అంకుల్, హ్యూస్టన్‌లో ఎం.డి. ఆండర్సన్ హాస్పిటల్లోని డాక్టర్‌తో మాట్లాడతానన్నాడు. వాళ్ళక్కడ నాకు పూర్తిగా తగ్గుతుందని గారంటీలు ఇవ్వకపోయినా, గట్టి ప్రయత్నం చేస్తారు. తర్వాత చూద్దాం. ఏమవుతుందో"

"నేను మెడిసిన్ డిగ్రీచేశాక, అక్కడే రీసెర్చి చేస్తాను" అంది వినీత.

రాజు వినీతను ఆశ్చర్యంతో చూసి, "అలాగే" అన్నాడు.

అప్పుడే వచ్చింది సుధ. "సురేష్ బహుశా రాడు. ఇంటికి వెళ్ళిపోయి వుంటాడు"

సురేష్ ఇంటికి వెళ్ళిపోయాడనీ, ఆ మాట అతను ముందే చెప్పాడనీ సుధకే కాక రాజుకీ, సరోజకీ కూడా తెలుసు. వాళ్ళ ముగ్గురి ఏకాంతంకోసం ఆ వంక పెట్టి సుధ బయటకు వెళ్ళిందని కూడా వాళ్ళకు తెలుసు.

సుధని ఆప్యాయంగా చూసింది సరోజ

"టైము దాదాపు పది అవుతోంది. ఇంటి దగ్గర సురేష్‌కి ఆలస్యమయిపోతుందేమో. ఇంక వెళతావా" అంది

"ఏం వినూ... వెళ్దామా" అడిగింది సుధ.

"వెళ్ళండి. రేపు వినూకి స్కూలు కూడా వుంది" అన్నాడు రాజు.

వినీత రాజుకి ఒక ముద్దు, సరోజకు ఒక కౌగలింత ఇచ్చింది.

"వినూ మా ఇంట్లోనే పడుకుంటుంది వాళ. నేను రేపొద్దున్నే స్కూల్లో దించుతాలే" అంది సుధ వినీతతో కలిసి బయటకు నడుస్తూ.



మర్నాడు పొద్దున్న డాక్టర్ బర్చ్ వచ్చి రాజుని పరీక్షించాడు.

"మీరు ఈరోజు సాయంత్రం ఇంటికి వెళ్ళిపోవచ్చు మీ మెడికల్ ఇన్‌స్యూరెన్స్‌లో హోంకేర్‌కి కూడా వాళ్ళు పే చేస్తారు. అందుకని ఇంటి దగ్గర నర్సింగ్ సర్వీసెస్ ప్రిస్క్రైబ్ చేస్తాను. వారానికి రెండుసార్లు నర్స్ వచ్చి ఇంట్రావీనస్ ఇంజక్షన్ ఇస్తుంది. రెండు వారాలకొకసారి ఇక్కడకు తీసుకువస్తే రాజు ఎలా వున్నాడో పరీక్ష చేస్తాను. రాజు బాగా కోలుకోవాలని కోరుకునే వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి" అన్నాడు డాక్టర్ బర్చ్

అక్కడ వున్న పాడ్‌మీద కావలసిన ప్రిస్క్రిపన్లు రాసి అవన్నీ సరోజకు వివరంగా చెప్పాడు.

సరోజతోనూ, రాజుతోనూ కరచాలనం చేసి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిన ఒక గంటకు వచ్చాడు సురేష్.

రాగానే రాజు దగ్గర కూర్చుని అన్నాడు సురేష్. "నేను ఇవాళ పొద్దున్నే హ్యూస్టన్‌లో డాక్టర్ హోల్‌మన్‌ని పిలిచి మాట్లాడాను. నీ రికార్డంతా ఫెడరల్ ఎక్స్‌ప్రెస్

మెయిల్లో పంపించాను. అది ఆయనకు రేపొద్దున్న పదిగంటలకు అందుతుంది. రేపు సాయంత్రం ఆయనకు ఫోన్‌చేసి మాట్లాడుతాను. అప్పటికి ఆయన నీ రికార్డు చూస్తాడు కనుక ఆయన అభిప్రాయం తెలుస్తుంది. ఆయనతో మాట్లాడుతుంటే కొండంత ధైర్యం వస్తుంది ఎవరికైనా. సబ్జక్ట్ బాగా తెలిసినవాడు, అనుభవజ్ఞుడు. ఆయన చేతిలో నువ్వు కోలుకుంటావని నాకు అనిపిస్తోంది"

సురేష్‌వేపు కృతజ్ఞతాపూర్వకంగా చూసింది సరోజ.

డాక్టర్ బర్చ్ చెప్పిన వివరాలు చెప్పి, ఆయన రాసిన కాగితాలు చూపించింది సరోజ.

సురేష్ ఒక్క క్షణం ఆలోచించి సరోజతో అన్నాడు.

"మీరు ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసుకి వెళ్ళి అక్కడ బిల్లు కట్టేసి రండి. నేను ఈలోగా డాక్టర్ బర్చ్‌తో మాట్లాడి వస్తాను. ఆ పని అవగానే ఇంటికి వెళ్దాం" అన్నాడు సురేష్.

సరోజ తల వూపింది.

ఆ తర్వాత సరోజనీ, రాజునీ వాళ్ళింట్లో దించాడు సురేష్.

"మీరిద్దరూ పూర్తిగా విశ్రాంతి తీసుకోండి. రేపు డాక్టర్ హోల్‌మన్‌తో ఫోన్‌లో మాట్లాడాక ఇక్కడికి వచ్చి ఆయన ఏమన్నదీ చెబుతాను" అన్నాడు.

★ ★ ★

మర్నాడు సాయంత్రం రాజూ వాళ్ళింటికి వచ్చాడు వసంత్.

రాగానే రాజు చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నాడు.

"ఏమిటి గురువుగారూ... నేను ఊళ్ళో లేకుండా చూసి హడావిడి చేశారుట"

అతను కొంచెం హాస్యంగానే ఆ మాటలు అనాలనుకున్నా అతని ముఖంలోని భావాలు స్పష్టంగా కనిపిస్తూనే వున్నాయి.

"అవును... అదీ"

"నేను రాగానే ప్రకాష్‌తో మాట్లాడాను. ఆయన అన్నీ వివరంగా చెప్పారు. సురేష్ హ్యూస్టన్ డాక్టర్‌గారితో మాట్లాడుతున్నారని కూడా చెప్పారు. దటీజ్ ది వే టు గో" అన్నాడు వసంత్.

"నువ్వు ఊళ్ళో లేకపోవటమేమిటి. మొన్ననేగా వచ్చావ్ ఇండియానించి" అంది సరోజ.

వసంత్ పెద్దగా నవ్వాడు. "పెళ్ళి చేసుకోటానికి మళ్ళీ ఇండియా వెళ్ళాననుకున్నారా? అదేమీ లేదు. ఆఫీసు పనిమీద అనుకోకుండా కాలిఫోర్నియా, అదేశాన్ హోసేకి వెళ్ళాను. రెండు రోజులకు మాత్రమే. ఆ రెండు రోజుల్లోనే మీరు హడావిడి చేసేశారు"

అప్పుడే అక్కడికి వచ్చాడు సురేష్. అతని వెనకనే ప్రకాష్.

"ఏమయింది? దొరికాడా డాక్టర్ హోల్‌మన్? " అడిగాడు రాజు.

"ఆహా! ఇప్పటిదాకా ఆయనతోనే మాట్లాడుతున్నాను" అన్నాడు సురేష్.

పక్కనే ఫోన్‌లో మాట్లాడుతున్న సరోజ ఫోన్ పెట్టేసి వచ్చి తనూ రాజు పక్కనే మంచంమీద కూర్చుంది.

సురేష్ ఒక్కక్షణం ఆగి చెప్పటం ప్రారంభించాడు. "నేను డాక్టర్ హోల్‌మన్‌తో మాట్లాడాను. ఆయన మనం పంపించిన రికార్డంతా క్షుణ్ణంగా పరిశీలించాడు. ఆయన అభిప్రాయం కూడా ఇక్కడ డాక్టర్ బర్చ్ చెప్పినదే. ఈ రకమైన కాన్సర్ అరుదనీ, ఎప్పుడో ఎక్కడో తప్పరాదనీ, అందువల్ల ఈ కాన్సర్‌మీద ఎక్కువ రీసెర్చి జరగలేదని, దానికంటూ ఒక నిర్ధారణమైన వైద్యం లేదనీ అన్నాడు. కానీ ఈమధ్య వాషింగ్‌టన్‌లోని సియాటెల్‌లో యిలాటి కేసు వస్తే దానితో చాలా సమాచారం సేకరించారని చెప్పాడు.

దాని ఆధారంగా డాక్టర్ హోల్‌మన్ మిగతా వైద్యశాస్త్ర నిపుణులతో కలిసి




హ్యూస్టన్‌లో రీసెర్చి చేస్తున్నామని చెప్పాడు. ఆయన చెప్పిన విషయాలు కొన్ని నిరుత్సాహం కలిగిస్తే, కొన్ని మన అదృష్టాన్ని తలుపుకొట్టి పిలుస్తున్నాయా అనిపించింది. చివరకు ఆయన నిర్ణయించినదిది. ఆయన వచ్చేవారమంతా జర్మనీలో ఒక కాన్ఫరెన్సుకి వెడుతున్నాడుట. ఆయన అక్కడినించి వచ్చాక రాజుని హ్యూస్టన్ తీసుకువెళ్ళి అక్కడ ఎడ్మిట్ చేయటం. వాళ్ళు కొన్ని మందులతో ప్రయోగాలు చేసి శాయశక్తులా ప్రయత్నం చేస్తారు. ఈ కేసు వాళ్ళ రీసెర్చికి ఎంతో ఉపయోగపడుతుంది కనుక, వాళ్ళు కూడా చాలా జాగ్రత్తగా ఉత్సాహంగా పనిచేయటానికి సిద్ధపడుతున్నారు. వాళ్ళ వైద్యవిధానం పనిచేస్తే మన అదృష్టం బాగుంటే రాజుకి నయమవుతుంది. లేకపోతే డాక్టర్ బర్చ్ చెప్పినట్టు మనకిక మూడు నెలలే" సురేష్ చెప్పటం ఆపాడు.

సరోజ అడిగింది "గట్టిగా తగ్గుతుందని చెప్పలేదా? "

"లేదు. ఆయన మాత్రం ఎలా చెప్పగలడు. ఇదంతా ఒక ప్రయోగంలా చేస్తాడు. అది ఫలిస్తే రాజుకేకాక వైద్యశాస్త్రంలోనే ఒక మంచి సంఘటన"

"పోనీ ఇంకెక్కడయినా ప్రయత్నం చేస్తే? " అడిగింది సరోజ.

"ప్రస్తుతానికి ఇంతకుమించి వేరే అవకాశం ఉంటుందని నేను అనుకోను అయినా నేను వేరే ప్రయత్నాలు చేయననుకోకండి. నాకు తెలిసిన ప్రొఫెషనల్స్‌నందర్నీ కనుక్కుని దేశమంతా గాలిస్తాను" అన్నాడు సురేష్.

రాజు సురేష్ చేయి పట్టుకుని కృతజ్ఞతాపూర్వకంగా నొక్కాడు.

"మనకి ఉన్న మూడు నెలలలోనూ, రెండు మూడు నెలలు మళ్లీ అక్కడే ఆస్పత్రిలో సర్జరీలు, కీమోథెరపీలు, ఇంజక్షన్లూ, మందులతో రాజుని బాధపెట్టడం సమంజసమా? " సాలోచనగా అన్నాడు ప్రకాష్.

అంతకుమించి వేరేమార్గం ఉందా? " అడిగాడు సురేష్.

"నేను వద్దు అనటంలేదు. ఇది రాజు, సరోజలు ఆలోచించి నిర్ణయించుకోవలసిన విషయం. సురేష్! ఈ రోజు రాత్రి రాజూ, సరోజ మాట్లాడుకుని ఒక నిర్ణయానికి వస్తారు. రేపు నీకు ఏ సంగతీ చెబితే దాన్ని బట్టి మనం మిగతా కార్యక్రమం నిర్ణయిద్దాం" అన్నాడు ప్రకాష్.

"అలాగే" అన్నాడు సురేష్.

"డాక్టర్ హోల్‌మన్ ఇంకో వారంరోజుల దాకా దొరకకపోవటంవల్ల ఒక లాభం కూడా ఉంది. లలితగారు ఇక్కడికి రాగానే అంతా గాభరాగా ఉంటుంది కనుక, కొంచెం సెటిల్ అవటానికి టైమ్ ఉంటుంది" అన్నాడు వసంత్.

"అవును. నువ్వు చెప్పింది నిజమే" అంది సరోజ.

"మర్చిపోయాను గురువుగారూ... మీ షార్ట్‌టర్మ్ డిసెబిలిటీ గురించి కనుక్కున్నాను. కొన్నాళ్ళు పూర్తి జీతంతోనూ తర్వాత జీతం తగ్గించుకుంటూనూ వెడతారు. మూడు నెలలదాకా నెట్టవచ్చునన్నారు. ఇవిగో వివరాలు" అంటూ తన జేబులోని కాగితాలు రాజుకి అందించాడు వసంత్.

రాజు ఆ కాగితం తీసుకుని చదివి మడిచి పక్కనే టేబుల్‌మీద పెట్టాడు.

"థాంక్స్" అన్నాడు వసంత్‌తో.

సరోజ అడిగింది "సెలవు సరిపోతుందా' అని.

"ఏం ఫరవాలేదు. సరిపోతుందిలే" అన్నాడు రాజు.

అతని మనస్సులో చటుక్కున ఏదో తళుక్కుమంది.

డాక్టర్ తనకి ఇంకా మూడు నెలలు టైమిచ్చాడు. ఆఫీసులో సెలవు కూడా మూడు నెలలే వుంది. తరవాత?

ఆ భావన రాగానే రాజులోని ఉత్సాహం మళ్ళీ చప్పబడిపోయింది.

వసంత్ రాజు ముఖకవళికలు గమనిస్తూనే ఉన్నాడు.

"ఇంకా ఏం చేయాలో చెప్పండి. మీ కోసం నా పెళ్ళి ఆపుకోమన్నా ఆపుకుంటాను" అన్నాడు నవ్వుతూ.

సరోజ కూడా నవ్వింది.

"ఆ పని మాత్రం చేయకు. బ్రహ్మచారి, బెండకాయ ముదరకూడదుట" అంది.

రాజు కూడా నవ్వాడు.

వాళ్ళు ముగ్గురూ కాసేపు కూర్చుని వెళ్ళిపోయారు.

"లలితకు మళ్ళీ ఒకసారి ఫోన్‌చేసి మాట్లాడతావా? రెండురోజుల్లో ఇండియాలో బయల్దేరుతుందికదా" అన్నాడు రాజు.

సరోజ లలితకు ఫోన్‌చేసి ప్రయాణంలో తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ మళ్ళీ చెప్పింది.

"డల్లాస్‌లోని సమయంకన్నా ఇండియా పదకొండున్నర గంటల ముందు ఉంటుంది. అంటే మద్రాసులో శుక్రవారం పొద్దున్న పదకొండున్నర గంటలయితే డల్లాస్‌లో గురువారం అర్ధరాత్రి పన్నెండు గంటలవుతుందన్నమాట. ఇండియానించి అమెరికా వస్తుంటే సమయం కలిసివస్తుంది అందుకే శుక్రవారం తెల్లవారుఝామున రెండు గంటలకు బొంబాయిలో బయల్దేరితే శుక్రవారం సాయంత్రం నాలుగు గంటలకల్లా డల్లాస్‌లో ఉంటుంది విమానం"

"అయితే ఇండియాకన్నా అమెరికా వెనకబడి వుందన్నమాట" అంటూ నవ్వాడు రమణ.

డల్లాస్ ఎయిర్‌పోర్టుకి వచ్చి రిసీవ్ చేసుకుంటామనీ, కష్టమ్స్‌లోనూ ఇమ్మిగ్రేషన్ లోనూ ఎలా ప్రవర్తించాలో, ఏం చేయాలో, ఏం చేయకూడదో, అన్నీ వివరంగా చెప్పింది సరోజ.

"లలిత రావటానికి మూడు రోజులున్నా నీ హడావిడి అప్పుడే మొదలయింది" అన్నాడు రాజు నవ్వుతూ.

సరోజ కూడా కనపడని నవ్వు నవ్వింది.

తర్వాత రాజుతో అంది సరోజ. "మనం హ్యూస్టన్ ప్రయాణం గురించి మాట్లాడవద్దూ. అక్కడికి వెడితే నీకు తగ్గుతుందని నాకు నమ్మకం కలుగుతోంది. నేనూ నీతో పాటే అక్కడ ఉంటాను. ఏమంటావ్" అని.

"నాకూ అదే అనిపిస్తున్నది. కానీ ఈ మూడు నాలుగు నెలలూ వినీతను వదలి అక్కడ..." అన్నాడు రాజు.

"చూద్దాం. లలిత ఇక్కడికి వస్తున్నది కూడాను. అదీకాక మనవాళ్ళందరూ ఇక్కడ అండగా ఉన్నారుకదా. మధ్యమధ్యలో వినీత లలితతో కలిసి అక్కడికి రావచ్చును. లలిత వినీతనీ ఇక్కడి విషయాలనీ చూసుకుంటుంది"

"మనం ముందు ఈ వైద్యానికి సరే అనుకుంటే మిగతావన్నీ ఆలోచించి ప్లాన్ చేసుకోవచ్చు" అన్నాడు రాజు.

"నా ఉద్దేశం చెప్పానుకదా. నీ ఉద్దేశం ఏమిటి?" అడిగింది సరోజ.

"మనకీ వేరే ఇంకొక మార్గం కనిపించటం లేదు. అక్కడికి వెళ్ళి వైద్యం మొదలుపెడతాం. మూడు, నాలుగు వారాలు చూద్దాం. అంతా సవ్యంగా జరుగుతుంటే తగ్గేదాకా అక్కడే ఉందాం. అలా కాకపోతే, వెంటనే వెనక్కి వచ్చేద్దాం. తర్వాత కార్యక్రమం అప్పటి పరిస్థితిని బట్టి నిర్ణయిద్దాం"

"లలిత వచ్చాక ఒక వారంరోజులు టైమ్ కూడా ఉంటుంది కనుక దానికీ ఇక్కడ అలవాటవుతుంది" అంది.

"సరే అలాగే చేద్దాం" అన్నాడు రాజు.

"అయితే సురేష్‌తో చెబుదామా డాక్టర్‌గారికి ఫోన్‌చేసి చెప్పమని?" అడిగింది సరోజ.

"అలాగే రేపు నేను ఫోన్‌చేసి చెబుతాలే. ఆశ మానవజీవితానికి శ్వాస అన్నాడో




మహారచయిత. ఆ ఆశే మనల్ని నడిపిస్తున్నదిప్పుడు. ఆ ఆశే నా జీవితానికి శ్వాస పోస్తే, అంతకన్నా కావలసినదేముంటుంది" అన్నాడు రాజు.

మేడ మీదనించి అప్పుడే అక్కడికి వచ్చింది వినీత.

"వినూ! ఈ హాస్పిటల్ హడావిడిలో పడి నీతో చెప్పటం మరిచిపోయాను. ఇండియా నించి లలిత పిన్ని వస్తున్నది" అన్నాడు రాజు.

వినీత కళ్లు ఒక్కసారిగా మెరిశాయి. "లలిత పిన్ని వస్తున్నదా? " అంది.

"అవును. వీసా కూడా వచ్చేసింది. ఇంక మూడు రోజుల్లోనే వస్తుంది" అంది సరోజ.

"వాటెబవుట్ మై కజిన్స్" అడిగింది వినీత.

"వాళ్ళకి మరి స్కూలుందికదా. అందుకని పిన్ని ఒక్కత్తే వస్తున్నది" అంది సరోజ.

వినీతకు కూడా లలిత వస్తున్నదంటే చాలా ఆనందంగా ఉంది. ఇండియానించి అమెరికాకి చుట్టాలు రావటమే అరుదు కనుక ఎవరయినా వస్తున్నారంటే ఆ ఉత్సాహం రెట్టింపు మరి.

ఆరోజు సాయంత్రం ఇంటి ముందర గులాబి మొక్కలకి వాటర్‌హోస్‌తో నీళ్లు పెడుతున్నది కమల. అప్పుడే బయటికి వచ్చింది లావుపాటి పక్కింటి లిండా. "హాయ్ కమలా! హవ్వార్యూ" అంటూ.

ఆవిడ్ని చూసి కమల పలకరింపుగా నవ్వింది. తెలుగులో "బాగున్నారా పిన్నిగారూ" అనే అర్థం వచ్చేలా.

"మీ గులాబులు బాగా వస్తున్నాయి. నేనూ బాక్‌యార్డులో మంచి గులాబిమొక్కలు వేద్దామనుకుంటున్నాను" అంది లిండా.

"అవును మీ ఫెన్స్ పక్కన ఫ్లవర్‌బెడ్‌లో గులాబులు వేస్తే అందంగా వుంటుంది" అంది కమల.

"మీ స్నేహితుడికి ఇప్పుడెలా వుంది? " అని అడిగింది లిండా.

వివరంగా చెప్పింది కమల "హ్యూస్టన్‌లో ట్రీట్‌మెంట్ చేయిద్దామా అని చూస్తున్నారు. అదొక్కటే మార్గం అనిపిస్తున్నది" అంది.

"ఏమిటో ఈ రోగాలూ, రొస్టులూ ఎంత రీసెర్చి జరుగుతున్నా ఎన్ని మందులు కనిపెడుతున్నా రోజురోజుకీ కొత్త రోగాలు పుట్టుకువస్తున్నాయి. దీనికి అంతెక్కడో అర్థం కావటంలేదు" లిండా అంది.

అవునన్నట్టు తల వూపింది కమల.

"నువ్వు ఎప్పుడు మీ స్నేహితుడికి సహాయంగా వెళ్ళాలన్నా, మీ అరవిందని మా ఇంట్లో దించి వెళ్లు. ఏమీ ఫరవాలేదు. నేను జాగ్రత్తగా చూసుకుంటాలే" అంది.

కమల ఆవిడ్ని కృతజ్ఞతాపూర్వకంగా చూసి "థాంక్స్" అంది.

లిండా ఒక్కక్షణం తటపటాయించి అంది. "నిన్న మా ఫ్రెండ్ డెనీస్‌తో మాట్లాడుతున్నప్పుడు ఆవిడ ఒక విషయం గురించి మాట్లాడింది"

కమల తల పైకెత్తి ఆవిడ్ని కుతూహలంగా చూసింది.

"నువ్వు ఫెయిత్ హీలింగ్ అన్నమాట ఎప్పుడైనా విన్నావా? " అడిగింది ఆవిడ.

"వినకపోవటమేం. ఇండియాలో చాలా మంది దీన్ని నమ్ముతారు కూడాను" అంది కమల విభూతితోనూ, గంగాజలంతోనూ, స్వామివారి చేతి స్పర్శతోనూ ఎన్నో రోగాలు తగ్గాయని విన్న కథలు గుర్తుకి తెచ్చుకుంటూ.

"వాటెబవుట్ యు? నువ్వు నమ్ముతావా? " అని అడిగింది లిండా.

కమల అదోలా నవ్వింది. ఒక్క క్షణం ఆలోచించి అంది. "నేనా నాకు అలాటివాటిమీద ఏమాత్రం నమ్మకంలేదు. అలాటివాటికి సైంటిఫిక్ బేసిస్ ఏమీ లేదుకదా"

లిండా నవ్వింది. "లేదు కాబట్టే వాటిని

ఫెయిత్ హీలింగ్ అనేది. కొంతమంది సైకాలజిస్టులు ఫెయిత్ హీలింగ్‌లో కూడా సైంటిఫిక్ లాజిక్ వుందని వాదిస్తారనుకో. ఆ వాదనలు మనకి అనవసరం. కానీ కొంతమందికి ఆ ఫెయిత్ హీలింగ్‌తో ఎంతో కాంప్లికేటెడ్ రోగాలు తగ్గినట్టు కథలు విన్నప్పుడు నమ్మకంవున్నా లేకపో యినా అదోవిధమైన ఆశ కలుగుతుంది కదూ" అంది.

"అవును. మరీ నిరాశ పెరిగిపోయిన ప్పుడు, వేరే ఇంకేమీ మార్గం లేనప్పుడూ... నమ్మకం వున్నా లేకపోయినా ప్రయత్నం చేస్తే నష్టం ఏమిటిలే అనిపిస్తుంది"

లిండా నవ్వింది. "గమ్మత్తుగా లేదూ. నమ్మకాన్నీ అపనమ్మకాన్నీ వేరుచేస్తూ వాటి మధ్య గీసే గీత పేరు నిరాశ అన్నమాట. వేరే ఏ మార్గమూ లేనప్పుడు విచక్షణా జ్ఞానం చెట్టెక్కేస్తుందన్నమాట. మనుష్యుల ఆలోచనలు ఎంత గమ్మత్తుగా వుంటాయో చూడు" అంది.

కమల కూడా నవ్వింది. "అవును! నాకీ విషయం ఎప్పుడూ తట్టలేదు సుమా" అంది.

ఒక్క క్షణం ఆగి లిండా అంది. "సర్వప్ర యత్నాలూ చేసినా ఫలితం లేనప్పుడు అలా టివాటిమీద ఆధారపడటంవల్ల లాభం ఎలావున్నా నష్టంలేదు. కానీ అన్ని ప్రయ త్నాలూ మానేసి వీటినే నమ్ముకునే వాళ్లు న్నారు. వాళ్ళని చూస్తేనే నాకు బాధగా వుంటుంది. అలాటి కథలు చాలా విన్నాను కూడాను"

కమల నెమ్మదిగా అంది "అవును. మనం కష్టాల్లో వున్నప్పుడు స్వలాభంకోసం ఇలాటివాళ్లు మోసాలు చేయటం నేనూ చూశాను"

"నిన్న డెనీస్ ఫెయిత్ హీలింగ్ గురించి చాలా గొప్పగా చెప్పింది. నాకు మాత్రం నమ్మబుద్ధేయలేదనుకో" అంది లిండా.





ఆ విషయాలు చెప్పటంలో లిండాకి వేరే ఏ ఉద్దేశమూ లేదనీ, తన మనసులోని ఆలోచనలనే అలా పైకి మాట్లాడుతున్నదనీ అర్థమయింది కమలకి.

"నాకు ఒకటనిపిస్తున్నది. అనారోగ్యంతో వున్న వ్యక్తి వైద్యంతో పాటుగా, మనోధై ర్యంతో ఆ అనారోగ్యానితో గట్టిగా పోరాడ గలిగితే త్వరగా కోలుకునే అవకాశముం టుంది. అలా జరిగిన కేసులు వున్నాయి కూడాను. మరి దాన్ని ఫెయిత్ హీలింగ్ అనవచ్చో లేదో నాకు తెలీదు" అంది కమల.

"మనం దాన్నే పేరుతో పిలిచినా నునోధై ర్యంతో కూడిన నమ్మకం వేరు, గుడ్డిన మ్మకం వేరు" అంది లిండా.

కమల మనసులో అనుకున్నది, "అవును. వైద్యంతోనూ మందులతోనూ రోగాలు నయం చేయకుండా మొక్కుబడులతోనూ భజనలతోనూ నయమవుతాయని మనం అనుకోవటంలేదూ. అది మరి గుడ్డినమ్మకం కాదూ" అని.



మర్నాడు పొద్దున్నే రాజు సురేష్‌కి ఫోన్ చేశాడు.

"సురేష్! రాత్రి నేనూ, సరోజా ఒక నిర్ణ యానికి వచ్చాం. హ్యూస్టన్‌లోని ఎం.డి. ఆండర్సన్ హాస్పిటల్లో వైద్యం చేయిస్తేనే బాగుంటుందనిపిస్తున్నది. డాక్టర్ హోల్ మన్ ఆఫీసుకి ఫోన్‌చేసి చెబుతావా? " అని అడిగాడు.

"తప్పకుండాను. ఇప్పుడే ఫోన్ చేస్తాను. ఆయన జర్మనీ వెళ్ళేలోపునే చెబితే ముందర తన టీమ్ ఆఫ్ డాక్టర్స్‌తో ఈ విషయం చర్చించటానికి ఆయనకి అవకాశం ఉంటుంది. ఉయ్ విల్ సపోర్ట్ వాటెవర్ డెసిషన్ యు టేక్" అన్నాడు సురేష్.

"పదిరోజుల్లో అక్కడికి వచ్చి హాస్పిటల్లో చేరతామని చెప్పు" అన్నాడు రాజు.

"అలాగే" అని రాజుతో చెప్పి వెంటనే హ్యూస్టన్‌కి ఫోన్‌చేసి, డాక్టర్ హోల్‌మన్‌కి

ఆ విషయం చెప్పాడు సురేష్.

★ ★ ★

రాజు ఆఫీసుకి వెళ్ళాల్సిన పని వుందంటే సరోజ అతన్ని కారులో ఆఫీసుకి తీసుకువెళ్ళింది.

రాజు ఆఫీసులో తన క్యూబికల్ దగ్గరకు వచ్చేసరికి, అందరూ రాజు చుట్టూతా చేరారు.

"హేయ్... లుక్, హూ ఈజ్ హియర్" అన్నాడు క్రిస్ పెద్దగా అరుస్తూ. రాజు చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

అతని మాటలు వినగానే తన ఆఫీసులో నించి బయటకు వచ్చిన అమాండా "వాటె ఎ సర్‌ప్రైజ్! యు ఆర్ బాక్" అంటూ వచ్చి రాజుని కౌగలించుకుంది.

పక్కనే వున్న సరోజను కూడా కౌగలించుకుని "నిన్ను మళ్ళీ చూడటం ఆనందంగా వుంది" అంది.

సరోజ అమాండా చేతిని మృదువుగా నొక్కింది.

సరోజ బ్యాంక్ పనీ, షాపింగూ పూర్తిచేసుకుని రెండు గంటల్లో వచ్చి రాజుని ఇంటికి తీసుకువెడతానని చెప్పి వెళ్ళిపోయింది.

క్రిస్, అమాండా, మిగతా సహోద్యోగులు రాజు ఆరోగ్యం గురించి చాలా ప్రశ్నలడిగారు. రాజు ఓపిగ్గా, అందరికీ జవాబులు చెప్పాడు. కొందరు ఎక్కడెక్కడ ఏయే డాక్టర్లు సమర్థులో చెప్పారు.

రాజు మేనేజర్ డానీబేకర్ కూడా వచ్చి రాజుతో చాలాసేపు మాట్లాడాడు.

"నువ్వు ఈ ప్రాజెక్టు వర్కుల గురించి ఎక్కువగా ఆలోచించి మనస్సు పాడు చేసుకోకు. మేం అన్నీ చూసుకుంటాం. నీలాంటి తెలివైన ఇంజనీరుని మేము వదులుకోలేము. కనుక నీ ఉద్యోగం గురించి ఏమీ దిగులు పడకు. షార్ట్ టర్మ్ డిసెబిలిటీకి నేను రికమెండ్ చేస్తాను. ఇక్కడ నీతో ఏదన్నా అత్యవసరం వస్తే ఫోన్ చేస్తాలే. ఆరోగ్యంగా నువ్వు తిరిగి రావటమే మాకు ముఖ్యం. గుడ్‌లక్ ఇన్ యువర్ హ్యూస్టన్ ట్రీట్‌మెంట్" అన్నాడు కరచాలనం చేసి.

రాజు డానీని కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు.

"నేను మన డివిజన్ క్వార్టర్లీ ఆపరేషన్ రివ్యూ మీటింగ్‌కి వెళ్ళాలి. ఆలస్యమవుతున్నది" అని డానీ రాజుకి షేక్‌హాండ్ ఇచ్చి "జాగ్రత్త" అని చెప్పి చకచకా వెళ్ళిపోయాడు.

సరోజ తన పనులన్నీ పూర్తిచేసుకుని రాజుని తీసుకుని ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నం పన్నెండుగంటలయింది.

సరోజ డైనింగ్‌టేబుల్ దగ్గర భోజన ప్రయత్నాలు చేస్తుండగా రాజు లుంగీ కట్టుకుని వస్తూ, ఆన్సరింగ్ మెషీన్‌లో మెసేజస్ ఉండటం చూసి అటువెళ్ళి ఆన్సరింగ్ మెషిన్ స్విచ్ ఆన్ చేశాడు.

మొదటిది కమల దగ్గరనించి రాజుకి ఎలా వుందని అడుగుతున్నది. రెండవది ఉన్నిక్రిష్ణన్ అనే అతని దగ్గరనించి. అతనెవరో రాజుకి తెలియదు. అతని ఇంగ్లీష్ ఉచ్చారణలో మలయాళం తొంగిచూస్తూనే ఉంది.

"నేనండీ... నా పేరు ఉన్నిక్రిష్ణన్. నేనెవరో మీకు తెలియదు. నేనూ డల్లాస్‌లోనే ఉంటాను. మీతో చాలా ముఖ్యమైన విషయమొకటి మాట్లాడాలి. సాయంత్రం అయిదున్నరదాకా నేను ఆఫీసులో ఉంటాను. ఒక్కసారి పిలవండి. నా ఫోన్ నెంబర్ 339-5674. ధన్యవాదాలు"

"ఎవరా ఉన్నిక్రిష్ణన్ ఏమా కథ..." అడిగింది సరోజ గ్లాసుల్లో నీళ్ళు నింపుతూ.

"అన్నం తిన్న తర్వాత ఫోన్ చేస్తాలే. అప్పుడు తెలుసుకుందాం. అతనెవరో అతని కథేమిటో" అన్నాడు రాజు డైనింగ్‌టేబుల్ దగ్గర కూర్చుంటూ.

రాజు, సరోజా భోజనాలు చేస్తుండగా మళ్ళీ మోగింది ఫోన్.

సరోజ ఫోన్ తీసుకుని మాట్లాడి "ఉన్నిక్రిష్ణన్" అంటూ కార్డ్‌లెస్ ఫోన్‌ని రాజుకి అందించింది.

"నేను ఉన్నిక్రిష్ణన్‌ని. మీతో మాట్లాడదామని ఫోన్ చేశాను" అన్నాడతను.

"మీ మెసేజ్ ఆన్సరింగ్ మెషిన్‌లో ఇప్పుడే చూశాను. భోజనం చేశాక మాట్లాడదామనుకున్నాను. ఈలోగా మీరే పిలిచారు. ఐ యామ్ సారీ" అన్నాడు రాజు.

"ఇటీజ్ ఓకే... నేనే మీ ఫోన్‌కాల్ కోసం ఆగవలసింది. ఎనీవే మీరు భోజనం చేస్తున్నట్టున్నారు. కాసేపు ఆగి పిలవనా?' అన్నాడు ఉన్నిక్రిష్ణన్.

"ఫరవాలేదు... చెప్పండి" అన్నాడు రాజు.

"ముందు నన్ను పరిచయం చేసుకోనీండి. నేను ఇక్కడే డల్లాస్‌లో ఒక పెట్రోలియం కంపెనీలో సైంటిస్ట్‌గా పనిచేస్తున్నాను. మేము ఈ ఊళ్ళో ముప్పై ఏళ్ళనించీ ఉంటున్నాము. మీతో మాట్లాడాలనుకుంటున్నాను"

"నైస్ టు మీట్ యు ఓవర్‌ఫోన్... ఏ విషయం గురించి మాట్లాడాలనుకుంటున్నారు? "

"మీరు సాయంత్రం ఖాళీగా వుంటానంటే, మీ ఇంటికి వస్తాను" అన్నాడు ఉన్నిక్రిష్ణన్.

"రండి తప్పకుండాను. కాకపోతే విషయం ఏమిటో"

"మా ఇల్లు నారాయణగారి ఇంటి దగ్గరే. నిన్న సాయంత్రం నారాయణగారి భార్య శ్యామల మా ఆవిడతో మీ అనారోగ్యం గురించి చెబుతుంటే నేను పక్కనే ఉన్నాను. ఈ విషయంలో నా అనుభవం ద్వారా జరిగిన ఒక సంఘటన మీతో చెప్పాలనుకుంటున్నాను. మీకు పూర్తిగా తగ్గే అవకాశం కూడా వుందని నా నమ్మకం. ఆ విషయం మీతో మాట్లాడదామని మీ ఇంటికి వద్దామనుకుంటున్నాను. మీకు అభ్యంతరం లేకపోతేనే" అన్నాడు ఉన్నిక్రిష్ణన్.

"అయ్యో... అదేమిటి? మీరంతట మీరు సహాయం చేయటానికి ముందుకు వస్తుంటే నాకు అభ్యంతరం దేనికి. రండి తప్పకుండాను" అని తన ఇంటికి రావటానికి గుర్తులు చెప్పాడు రాజు.

"ఆరున్నరకల్లా వస్తాను" అని ఫోన్ పెట్టేశాడు ఉన్నిక్రిష్ణన్.

ఉన్నిక్రిష్ణన్ చెప్పిన విషయాలన్నీ సరోజకు చెప్పాడు రాజు.

"చాలా మంచివాడులాగా కన్పిస్తున్నాడు. పోనీలే. నీకు తగ్గితే అదే చాలు. ఏ పుట్టలో ఏ పాముందో" అంది సరోజ.

సాయంత్రం సరిగ్గా ఆరున్నర గంటలకు ఇంటి ముందర కారు. ఉన్నిక్రిష్ణన్ వచ్చాడు.

అతను సన్నగా, పొడుగ్గా ఉన్నాడు. తెల్లటి చొక్కా, నల్లటి పాంట్‌లో టక్ చేశాడు. నల్లటి పెద్ద మీసం చాలా అందంగా చెక్కినట్టు ఉంది.

"రండి... రండి" అంటూ లోనికి ఆహ్వానించింది సరోజ.

అతను నమస్కారం పెట్టాడు.

"నేను ఉన్నిక్రిష్ణన్" అన్నాడు సరోజకూ, రాజుకూ తనని పరిచయం చేసుకుంటూ.

లోపలికి వచ్చి సోఫాలో కూర్చున్నాక అన్నాడు. "శ్యామలగారి దగ్గర అన్ని వివరాలూ తెలుసుకున్నాను. ఇదే రకమైన కాన్సర్ మూడు సంవత్సరాల క్రితం మా అమ్మగారికి వచ్చింది. కీమోథెరపీ చేయించాం. తగ్గలేదు. అసలు రెస్పాన్సే లేదు. ఆవిడ ఆరు నెలలకు మించి బతకదని డాక్టర్లు తీర్మానించారు. అప్పుడే కేరళనించి మిత్రుడు సుకుమారన్ చెప్పాడు ఈ వైద్యం గురించి"

సరోజా, రాజూ కుతూహలంగా వింటున్నారు.

"అది ప్రత్యేకంగా తయారుచేసిన ఆయుర్వేదం మందు. ముందు నేను పెద్ద శ్రద్ధ

చూపించలేదు ఆ వైద్యం మీద. కానీ ఇక్కడ డాక్టర్లందరూ ఆశలు వదిలేశాక మన ప్రయత్నం మనం చేయాలికదా. అందుకనే అక్కడనించి వస్తున్న స్నేహితుల ద్వారా ఆ మందు తెప్పించి వాడాము. మా అమ్మగారు, వారానికి ఒక్కరోజు చొప్పున ఆ రోజునించీ ఈరోజుదాకా ఆ మందు తీసుకుంటూనే ఉన్నారు" ఉన్నిక్రిష్ణన్ చెప్పటం ఆపాడు.

"అంటే ఆవిడకు ఇప్పుడు పూర్తిగా తగ్గిపోయిందా? " అడిగింది సరోజ.

"తగ్గిపోయింది. ఆవిడ ఆరునెలలకన్నా మించి బతకదన్న డాక్టర్లు, ఆరునెలల తర్వాత ఆవిడ్ని పరీక్షించి నిర్ఘాంతపోయారు. ఆవిడకేమీ అనారోగ్యం లేదని నిర్ధారణ చేశారు. ఇది జరిగి మూడు సంవత్సరాలు దాటింది. మా అమ్మగారు ఈనాటికీ, మంచి ఆరోగ్యంగా ఉన్నారు" ఆ మాట అంటున్నప్పుడు ఉన్నిక్రిష్ణన్ కళ్ళల్లోని మెరుపు రాజుకీ సరోజకీ స్పష్టంగా కనపడింది.

సరోజ అడిగింది "మరీ కీమోథెరపీ, ఇంగ్లీష్ మందులు తింటున్నవాళ్ళకు ఆయుర్వేదం మందు పనిచేస్తుందా? "

"ఇదే అనుమానం నాకూ వచ్చింది. వాళ్ళు చెప్పిందేమిటంటే ఏ మందులయినా ఆయుర్వేదానికి అడ్డురావని. ఇక్కడి డాక్టర్లు లాభంలేదన్నా, మనం చూస్తూ చూస్తూ ఊరుకోలేంకదా! ఇటు ఇంక ఏమీ ఉపయోగపడవన్న ఇంగ్లీష్ మందులు వాడాలో అటు పనిచేస్తాయో లేవో తెలియని ఆయుర్వేదం మందులు వాడాలో తెలియక ఇరుకునపడ్డాం. కానీ మా కేరళ మిత్రుడు సుకుమారన్ చెప్పింది మాత్రం రెండూ వాడమని. దానికీ దీనికీ సంబంధం లేదనీ ఆ థెరపీలు చేస్తున్నా ఈ మందులు వాడవచ్చని చెప్పాడు. అలానే మేము రెండూ వాడాం. చివరకు మా అమ్మ మాత్రం బతికి బయటపడింది" అన్నాడు ఉన్నిక్రిష్ణన్.

"మరి ఆ మందు ఇక్కడ దొరుకుతుందా? ప్రత్యేకంగా చేయించాలంటున్నారు"

"దొరకదు. కొట్టాయంలో ఆ డాక్టరుగారి ఫోన్‌నెంబరు ఇస్తాను. ఆయన ఇంగ్లీష్ కూడా చాలా బాగా మాట్లాడుతారు. మీరు ఆయనతో అన్నీ వివరంగా చెప్పండి. నేను చెప్పానని చెప్పండి. మందు ఆయన తయారుచేశాక నాతో చెప్పండి. క్రిస్మస్ సెలవలకి చాలామంది మలయాళీలు ఇండియా వెడతారు. వాళ్ళ ద్వారా నేనామందు ఇక్కడికి తెప్పిస్తాను. వాడి చూడండి. పనిచేస్తుందా, మీ అదృష్టం లేదా మీరు అనుకున్న వైద్యంతోనే తగ్గుతుందేమో చూద్దాం"

సరోజ అడిగింది "ఖర్చులూ అవీ ఎంత అవుతాయో? మేము ఫోన్ చేసినప్పుడు ఆయన చెబుతారా? ఆయనకి ఎలా పేచేయాలి? "

చిన్నగా నవ్వాడు ఉన్నిక్రిష్ణన్. "ఆయన స్వంతంగా తయారుచేసి ఇస్తున్న మందది. మందు తయారు చేయటానికయ్యే ఖర్చు మాత్రమే తీసుకుంటాడు. చాలా తక్కువ. ఆయనకు అసలేమాత్రం ధనాపేక్ష లేదు. ఆయనతో మాట్లాడుతుంటే మీకు తెలుస్తుందా విషయం. అయినా నాకు ఆయన దగ్గర ఎకౌంటు ఉందిలెండి. మీరు ఏమీ ఇవ్వక్కర్లేదు. మీకు పూర్తిగా తగ్గితే మాత్రం మీకు తోచింది పంపిస్తే ఆయన కష్టానికి ఫలితం దక్కినందుకు సంతోషిస్తాడాయన. ఆయన పేరు వైద్యవార్ పంకజాక్షన్. ఆయన అడ్రసూ, ఫోన్ నెంబరూ ఇవిగో" ఉన్నిక్రిష్ణన్ ఆ వివరాలున్న కాగితం అందించాడు.

"ఇక వెడతాను" అంటూ లేచాడు ఉన్నిక్రిష్ణన్.

"ఉండండి. కాఫీ తాగి వెడుదురుగాని" అంది సరోజ.

"కాఫీ నాకు అలవాటులేదు. మళ్ళీ వస్తాలెండి. మీకు పూర్తిగా తగ్గిన తర్వాత నేనూ



మా ఆవిడా ఇద్దరం మీ ఇంటికి వచ్చి, మీతోపాటూ భోజనం కూడా చేస్తాం" నవ్వుతూ నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు ఉన్నిక్రిష్ణన్.

"చాలా మంచివాడిలాగా కనిపిస్తున్నాడు" అన్నాడు రాజు.

"దేవుడల్లే వచ్చాడు మన గురించి విని" అంది సరోజ.

కృతజ్ఞతతో ఆవిడ కళ్లల్లో రెండు నీటిబిందువులు మెరుస్తున్నాయి.



ఆ రోజే లలిత వచ్చేరోజు.

సరోజకు పట్టలేనంత ఉత్సాహంగా వుంది. లలిత వస్తున్నదన్న ఆలోచనతోనే ఆమెకు వేయి ఏనుగుల బలం వస్తున్నది. ఇంట్లో అటూ ఇటూ హడావిడిగా తిరుగుతూ ఇక్కడివక్కడా అక్కడివిక్కడా మారుస్తున్నది.

అంతకుముందురోజే వంటింట్లో అన్ని డబ్బాలమీదా, సీసాలమీదా 'కందిపప్పు', 'మినప్పప్పు', 'పంచదార', 'ఆవకాయ', 'గోంగూరు'లాంటి లేబుల్స్ రాసి అంటించింది.

ఆ హడావిడి చూస్తున్న రాజు పెద్దగా నవ్వాడు. "నువ్వు లైబ్రరీలో పనిచేస్తే బాగుండేది. చక్కగా లేబుల్స్ అన్నీ అంటిస్తున్నావు. ఇంక కేటలాగులు తయారుచేయటమే తరువాయి" అన్నాడు.

"ఇన్నాళ్ళనించీ ఈ ఇంట్లో ఉంటున్నావ్, నీకే తెలీదు ఏ డబ్బాలో ఏముందో. ఇక ఎన్నోవేల మైళ్లు ప్రయాణంచేసి మొదటిసారిగా ఇక్కడకు వస్తున్నది లలిత. అలాంటిది దానికేం తెలుస్తుంది. అందుకే ఈ లైబ్రేరియన్ పని" ఉక్రోషంగా అంది సరోజ.

మళ్ళీ పెద్దగా నవ్వాడు రాజు. "నాకేనాడన్నా, ఇక్కడ ఫలానాది వుంది అని చెప్పావా? అన్నిచోట్లా వెతుక్కోలేక చిక్కి సగమయ్యాను" అన్నాడు.

"అలా ఎందుకు చేశానో తెలుసా? " కిసుక్కున నవ్వింది సరోజ.

"నామీద ప్రేమతో మొగుడికెందుకులే వంటింటి బాధ అని కదూ"

సరోజ అతనివేపు కొంటెగా చూసి ఒకసారి తల పైకెగరేసి అంది "కాదు... నీలాటివాళ్ళకి లావు తగ్గటానికి అదొక ఎక్సర్సైజ్ అని రీడర్స్ డైజస్ట్‌లో చదివాను" అని పెద్దగా నవ్వింది.

రాజు కూడా నవ్వాడు.

ఇంతలో ఫోన్ మోగింది.

కమల.

సరోజతో అంది "నేను సరిగ్గా రెండు గంటలకు మీ ఇంటికి వస్తాను. ఇద్దరం కలిసి డి.ఎఫ్.డబ్ల్యు. ఎయిర్‌పోర్టుకి (అంటే జంటనగరాలయిన డల్లాస్- ఫోర్టువర్త్‌ల మధ్యన ఉన్న ఎయిర్‌పోర్టు) వెడదాం. మూడూ, మూడున్నరకల్లా అక్కడికి చేరవచ్చు ఫ్లైట్ మూడున్నరకు వస్తుంది. ఇమ్మిగ్రేషన్, కస్టమ్స్ అయి లలిత బయటకు వచ్చేసరికి నాలుగు దాటుతుంది. కనుక ఫరవాలేదు"

"సరే, నేను రెడీగా ఉంటాను" అంది సరోజ.

"రాత్రి సరిగ్గా నిద్రపట్టిందా? లలిత ధ్యాసలో సీలింగ్ ఫ్యాన్‌ని చూస్తూ పడుకు





న్నావా?" అడిగింది కమల నవ్వుతూ.

"నిజంగానే నాకు నిద్ర పట్టలేదు కమలా. ఏవో పిచ్చి ఆలోచనలు. మధ్య మధ్యలో లలిత వస్తున్నదనే ఆనందం. కనీసం ఒక అరగంట కూడా నిద్రపోలేదు" అంది సరోజ.

"లలిత రావటం నీకూ రాజుకీ కూడా ఎంతో మనోధైర్యాన్నిస్తుంది సరోజా. నీ ఉత్సాహం, నీ గొంతులోనే తెలుస్తున్నది"

కమలతో మాట్లాడి ఫోన్ పెట్టేసి రాజుతో అంది సరోజ. "ఇంకా చాలా పనులున్నాయి. లలిత వచ్చేలోగా చేయవలసినవి" అంటూనే వాషింగ్ మెషిన్‌లో పడేయటానికి దుప్పట్లూ తువ్వాళ్ళూ తీసుకువెళ్లింది.

★ ★ ★

కమల, సరోజ ఎయిర్‌పోర్టు టెర్మినల్లో లలిత దిగేచోటుకి వచ్చేసరికి మధ్యాహ్నం మూడూ పదిహేను అయింది.

ఇంకా విమానం దిగలేదు. అనుకున్నట్టుగానే సరిగ్గా మూడున్నరకు వస్తున్నదని కంప్యూటర్ చూపిస్తున్నది. ఎదురుగా ఉన్న "స్టార్‌బక్స్ కాఫీ" షాపుకి వెళ్ళి రెండు కాఫీలు తీసుకుంది కమల.

ఇద్దరూ అక్కడ కూర్చుని కాఫీలు తాగుతున్నారు.

చాలా హడావిడిగా వుంది ఎయిర్‌పోర్టు. అమెరికాలో బాగా బిజీగా వుండే ఎయిర్‌పోర్టులలో డల్లాస్ ఒకటి. కనీసం రెండు మూడు నిమిషాలకొక విమానం కిందికి దిగటమో, పైకెగరటమో జరుగుతుంది అక్కడ. అది అంతర్జాతీయ విమానాశ్రయం అవటంవల్ల, ఎన్నో దేశాల విమానాలు, వ్యక్తులు, రకరకాల వేషభాషలు. సాంస్కృతికపరంగా ఏన్నో తేడాలు.

ఇన్ని తేడాలలోనూ అందరిలోనూ ఒక్కటిగా ఏమీ తేడా లేకుండా కనిపిస్తున్నది ఒక్కటే. అది హడావిడి. ఆత్రుతతో కూడిన హడావిడి.

విమానం ఎక్కటానికి వెళ్ళేవాళ్లు పాస్‌పోర్టులూ, టిక్కెట్లూ, సామాన్లూ చూసుకుంటున్నారు. తమ బంధుమిత్రులకు వీడ్కోలు ఇస్తూ బాధగా కన్నీళ్లు తుడుచుకుంటున్నారు. విమానం దిగినవాళ్ళు ఇమ్మిగ్రేషన్‌కీ, కస్టమ్స్‌కీ వెళ్ళటం, బయట తమ బంధువులకోసం ఆత్రుతగా చూడటం, వాళ్ళు కనపడగానే పరుగున వెళ్ళి వారిని కావలించుకోవటం చేస్తున్నారు. కొందరి కళ్ళల్లో బాధతో ఆప్యాయతతో ప్రేమతో కూడిన భాష్పాలు.

తలమీద ముసుగు పైకి వేసుకుని తన భర్త వెనుకనే వెడుతున్నది ఒక ఇరానియన్ యువతి. చీర కట్టుకున్న ఒక లావుపాటి ఆవిడ మొగుడి వెనకాల భారంగా పరుగులు పెడుతున్నది. ఒక పక్కన పది మంది జపాను వాళ్ళు గుండ్రంగా చేరి డల్లాస్‌లో తమ కార్యక్రమం చర్చిస్తున్నారు. వాళ్ళు మర్యాదగానే మాట్లాడుకుంటున్నా ఆ భాష తెలియనివాళ్ళకు వాళ్ళు ఒకళ్లమీద ఒకళ్లు పెద్దగా అరుచుకుంటున్నట్టు అనిపిస్తున్నది.

ఒక తెల్లమ్మాయి తన కాళ్ళ మునివేళ్ళ మీద నుంచుని చేతులు ఓ పొడుగాటి అబ్బాయి భుజాలమీదుగా వేసి అతన్ని గాఢంగా ముద్దు పెట్టుకుంటున్నది. నడవలేని వాళ్ళని తీసుకువెడుతున్న ట్రాలీకారు, అడ్డంగా వున్న మనుష్యులను తప్పుకోమని హారన్ కొట్టగానే ఉలిక్కిపడి కొంచెం పక్కకు జరిగి వాళ్ళిద్దరూ మళ్ళీ ప్రేమాయణంలో మునిగిపోయారు.

బాస్కెట్‌బాల్ ప్లేయర్లు కాబోలు, ఎంత దూరంలో ఉన్నా ఏడడుగుల పైన పొడుగ్గా ఉండటంతో అందరికీ కనిపిస్తున్నారు. వాళ్ళ ఆటోగ్రాఫుల కోసం చుట్టూ మూగిన జనం, కాపరి చుట్టూతా వున్న గొర్రెల్లా వున్నారు.

ఎదురుగుండా వున్న కంప్యూటర్‌మీద ఫ్రాంక్‌ఫర్ట్‌నించి డల్లాస్ వస్తున్న విమానం





అప్పుడే దిగినట్టు సమాచారం చూపిస్తున్నది.

అది చూసి సరోజ లేచి నుంచున్నది.

కమల నవ్వింది. "ఇంకా చాలా సమయం వుంది సరోజా! లలిత బయటకు రావటానికి కనీసం ఇంకో అరగంట పడుతుంది" అంది.

"తెలుసు. కాస్త కాళ్లు సాగుతాయని లేచి నుంచున్నానంతే" అని కమల తనవేపే సూటిగా నవ్వుతూ చూస్తుండటం చూసి తనూ నవ్వింది.

"ఓకే ఐయామ్ ఎక్సైటెడ్... సోవాట్" అంది నవ్వుతూ.

ఆమె ఆ మాటలు అన్న తీరుచూసి మళ్లీ నవ్వింది కమల.

"ఇంకో అరగంట ఓపిక పట్టు.. ఇంతకీ ఎన్నాళ్లయింది లలితను చూసి" కమల అడిగింది.

"రెండేళ్ల నాలుగు నెలలు.. అంటే ఇరవై ఎనిమిది నెలలు. అందుకే ఆగలేకుండా ఉన్నాను. దానికీ నాకూ చిన్నప్పటినుంచీ వున్నదా అనుబంధం" అంది సరోజ.

పబ్లిక్ ఎనౌన్స్‌మెంట్ సిస్టమ్‌లో, విమానాల రాకపోకలూ, ఫలానా వాళ్లు వాళ్లవాళ్లని ఎక్కడ కలవాలో మొదలైన వివరాలు, ఒక్క క్షణం కూడా ఆగకుండా చెబుతూనే వున్నారు.

ఎదురుగుండా ఉన్న టీవీలో ఆరోజు స్టాక్ మార్కెట్‌లో ఏఏ స్టాకులు పైకి వెళ్లాయో, ఏవి క్రిందకు వెళ్లాయో, ఎందుకు అలా జరిగిందో చెబుతున్నారు.

అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్న సరోజను చూస్తూ అలానే కూర్చుంది కమల.

సమయం నాలుగూ పదిహేను అయింది.

సరోజ, కమల ఒక పక్కగా నుంచుని గేటులోనుంచి బయటకు వచ్చేవారిని చూస్తున్నారు.

దూరంగా ఆకుపచ్చని చీరలో ఆత్రుతగా అటూ ఇటూ చూస్తున్న లలిత సరోజ కనపడగానే చేయి పైకెత్తింది.

నవ్వుతూ పరుగెత్తుతున్నంత వేగంగా నడుస్తూ ముందుకు వచ్చింది. ఒక చేతిలో సూట్‌కేస్ ఇంకో చేతిలో లాగే సూట్‌కేస్ ఒక షోల్డర్‌బాగ్ లలితను అంతకన్నా వేగంగా ముందుకు పోనివ్వటంలేదు.

సరోజ కూడా చకచకా ముందుకు వచ్చి లలితను కావలించుకుంది. లలిత చేతిలోని షోల్డర్ బాగ్‌ని కమల తీసుకుని లలితవేపు పలకరింపుగా నవ్వుతూ చూసింది.

లలితకానీ సరోజ కానీ చుట్టుపక్కల ఎవ






రినీ పట్టించుకోవటంలేదు.

లలిత చేసిన 23 గంటల ప్రయాణపు అలసట ఆమె ముఖంలో స్పష్టంగా తెలుస్తూనే వుంది. కానీ సరోజను చేరుకున్న ఉత్సాహం ఆమె అలసటను పక్కకు నెడుతోంది.

కమలను చూపిస్తూ అంది సరోజ. "మాకు మంచి స్నేహితులు, సన్నిహితులు అని ఫోన్‌లో చెబుతుంటానే... కమల అని... ఆవిడే ఈవిడ.."

లలిత "నమస్కారమండీ" అంది.

కమల నవ్వింది. "మనలో మనకి నమస్కారాలు ఏమిటి. ప్రయాణం బాగా జరిగిందా? " అని అడిగింది.

"బాగానే జరిగింది" అంది లలిత.

సామానంతా పక్కనేవున్న బండిలో పెట్టి దాన్ని తోసుకుంటూ ముగ్గురూ బయటకు వచ్చారు.

లలిత సరోజ చేయిపట్టుకుని నడుస్తూ అడుగుతోంది. "బావగారికి ఎలా వుందే అక్కయ్యా" అని.

"అన్నీ వివరంగా చెబుతాను. అసలు వీళ్లు మన తిండి ఏమన్నా పెట్టారా విమానంలో సరిగ్గా తిన్నావా" అడిగింది సరోజ.

"బొంబాయి నుంచీ ఫ్రాంక్‌ఫర్ట్ దాకా వచ్చిన విమానంలో బాగానే వుంది పూరీ కూరా.. కాస్త వెజిటబుల్ రైస్. కాకపోతే ఫ్రాంక్‌ఫర్ట్‌నించీ ఇక్కడకు వచ్చిన విమానంలోనే అంత బాగా లేదు"

"అంటే ఆకులూ అలములూ, దుంపలూ, బలుసాకులూ పెట్టారా" అంది కమల నవ్వుతూ.

నవ్వింది లలిత.

ఎస్కలేటరూ, ఎలివేటరూ దాటి, బయటపడి పార్కింగ్ లాబ్‌లోకి వచ్చేసరికి ఇంకో అరగంటపట్టింది.

"కమలా నువ్వు ఏమీ అనుకోవుకదా. నేనూ లలితా వెనుక సీటులో కూర్చుని మాట్లాడుకుంటాం" అంది సరోజ.

"అదే మంచిది, నేను డ్రైవింగ్ మీద కాన్‌సెన్‌ట్రేట్ చేయవచ్చు" అంది కమల నవ్వుతూ.

దారిలో లలిత సరోజ అడిగిన వాటికి ఏవో జవాబులు చెబుతున్నా మధ్యమధ్యలో రాజుకి అసలేం జరిగింది అని అడుగుతూనే వుంది. సరోజ మాత్రం మాట దాటేసి ఇండియా కబుర్లు అడుగుతోంది.

"సరోజా రాజుకి ఎలా ఉంది అని అడుగుతోంది లలిత" కమల నెమ్మదిగా అంది, తన దృష్టిని రోడ్డు మీద నిలుపుతూ.

సరోజ ఒక్కక్షణం ఏమీ మాట్లాడలేదు. ఉన్నట్టుండి లలితను కావలించుకుని ఒక్కసారిగా బావురుమంది.

లలితకు ఫలానా కారణమని తెలియకపోయినా రాజు ప్రమాద స్థితిలో ఉన్నాడని అనుమానంగానే ఉంది. లలిత సరోజ తల మీద చేయివేసి ఆమెను గట్టిగా హత్తుకుంది. మాట్లాడబోయిందికానీ మాట్లాడలేకపోయింది.

కమల నెమ్మదిగా అంది... "రాజుకి టెర్మినల్ కాన్సర్ అని డాక్టర్లు చెప్పారు. ఇంకా మూడు నాలుగు నెలల కన్నా మించి బతకటం కష్టం అని చెప్పారు"

లలిత ఆ మాటలకు బిత్తరపోయింది.

కమలకు రియర్ వ్యూ అద్దంలో లలిత

కళ్లల్లో భయం, విచారం స్పష్టంగా కనపడు తున్నాయి. ఒక్క క్షణం ఆగి కమల అంది.

"డాక్టర్లు అలా అన్నారుకానీ సర్వ ప్రయత్నాలూ చేస్తూనే ఉన్నారు. మా అందరికీ రాజుకి నయమవుతుందనే నమ్మకం వుంది. మీరు భయపడకండి. కొన్నాళ్లలో రాజు పూర్తిగా కోలుకుంటాడు. సరోజతో పాటూ మీరూ పక్కన వుంటే ఆ ధైర్యంతో త్వరగా కోలుకుంటాడు"

సరోజను ఇంకా దగ్గరకు తీసుకుంది లలిత. లలిత కళ్లల్లోని నీళ్లు ఆమె తెల్లటి బుగ్గలమీదుగా సరోజ నల్లటి జుట్టులో కలిసి పోతున్నాయి. సరోజ వెక్కివెక్కి ఏడుస్తోంది.

కమల తన కళ్లల్లో నిలిచిన నీటిబిందువులను, కొనగోటితో తుడుచుకుని కారు స్పీడు తగ్గించి ఫ్రీవే మీదనించి రాజు ఇంటికి వెళ్లే రోడ్డు మీదకు తిప్పింది. సరోజను కానీ లలితను కానీ ఓదార్చటానికి ప్రయత్నం చేయలేదు కమల.

రెండు నిమిషాల తర్వాత సరోజ లలిత పమిటె చెంగుతో తన కన్నీళ్లు తుడుచుకుంది.

"లలితా... కమల చెప్పినట్టు రాజుని మంచి డాక్టర్లకు చూపిస్తున్నాం. రాజుకి తగ్గుతుందనే ఆ గట్టి నమ్మకమే ముందుకి నడిపిస్తోంది" అంది సరోజ.

సరోజ ముఖంలోకి వింతగా చూసింది లలిత. నెమ్మదిగా అంది.

"హాలాహలంలాంటి ఇలాంటి వార్తను నాక్కూడా చెప్పకుండా ఇన్నాళ్లూ ఎలా భరిస్తున్నావే"

సరోజ మాట్లాడలేదు. ఆ ప్రశ్నకు జవాబు తెలుసు కనుక లలిత కూడా ఏమీ మాట్లాడలేదు.

"రాజు గురించి డాక్టర్లు చెప్పిన వివరాలన్నీ వినీతకు కూడా చెప్పాము" అంది కమల.

ఆ కొత్త వాతావరణం పరిసరాలేకాక రాజు ఆరోగ్యం, కమల చెబుతున్న వివరాలు లలిత ఆలోచనలను ఒక క్రమమైన పద్ధతిలోకి రానీయటంలేదు. అంతా గజిబిజిగా వుంది.

"వినీత కూడా పరిస్థితిని బాగా అర్థం చేసుకుంది. ఇప్పటిదాకా ధైర్యంగానే ఉన్నాం" అంది సరోజ.

లలిత మౌనంగా ఉండటంచూసి సరోజ అంది మళ్లీ.

"లలితా ఇన్ని వేల మైళ్లు ప్రయాణం చేసి నా దగ్గరకు మొదటిసారిగా నువ్వు వస్తుంటే నీకు ఇలాంటి వార్తతో ఆహ్వానం చేస్తున్నాను. అధైర్యపడకు. రాజుని అంత త్వరగా వెళ్లనీయం. మనకి తోడుగా ఇక్కడ మన మంచిని కోరే మంచి స్నేహితులు వున్నారు. కాన్సర్ వైద్యంలో నైపుణ్యం పొందిన డాక్టర్లు ఉన్నారు. కాన్సర్‌లో గొప్ప రీసెర్చి చేస్తున్న హాస్పిటళ్లు వున్నాయి. రాజుని అంత సులభంగా వెళ్లనీయం. అతనికీ తెలుసు తన మనోబలంతో మృత్యువుని జయిస్తాడని" అంది సరోజ లలిత కన్నీళ్లు తుడుస్తూ.

సరోజను ఆశ్చర్యంగా చూసింది లలిత.

"నువ్వు ఎంత ఎదిగిపోయావే అక్కయ్యా" అంది నెమ్మదిగా.

"అవును. సరోజ మీకన్నా నాలుగేళ్లు పెద్దకదా" అంది కమల నవ్వుతూ ఆ భారీ సన్నివేశాన్ని కొంచెం తేలికపరుస్తూ.

సరోజ కూడా నవ్వి "నాలుగేళ్లు కాదు.. రెండేళ్లే" అంది.

"అయితే నువ్వంతగా ఎదగలేదు. ఏదో కొంతగానే" అంది కమల మళ్లీ కొంచెం హాస్యం జతచేస్తూ.

ఇంటిముందు కారు ఆగగానే పరుగెత్తుకుంటూ బయటకు వచ్చింది వినీత.

లలితను చూసి గబగబా ముందుకు వచ్చి ఆమెను కావలించుకుంది "హాయ్ పిన్నీ" అంటూ.

వినీతకు లలితను చూస్తుంటే చాలా

ఉత్సాహంగా వుంది.

సరోజ, కమల కారు డిక్కీలోనించి సామాన్లు తీస్తుంటే బయటకు వచ్చాడు రాజు.

"లలితా... ప్రయాణం బాగా అయిందా!" అన్నాడు నవ్వుతూ.

రాజుని తేరిపారి చూసింది లలిత.

అతనికి దగ్గరగా వచ్చి "బాగానే అయింది. మీకెలా వుంది బావగారూ" అంది అతన్నే దీక్షగా చూస్తూ.

"నాకేం.. సుబ్బరంగా వున్నాను"

అతన్ని వింతగా చూస్తూ అంది లలిత.

"లేదు, మీరు బాగా తగ్గిపోయారు. మీరు మూణ్ణెల్ల క్రితం ఇండియా వచ్చినప్పటికన్నా ఇప్పుడు బాగా తగ్గిపోయారు" అని ఒక్క క్షణం ఆగింది.

కమల ఒక సూట్ కేస్, సరోజ ఇంకో సూట్ కేస్ లోపలకు తీసుకువస్తున్నారు.

"వినూ, కుడ్ యు గెట్ ది షోల్డర్ బాగ్ ప్లీజ్" అంది కమల.

లలిత రాజుచేయి పట్టుకుని మృదువుగా వత్తుతూ... "అక్కయ్య అంతా చెప్పింది బావగారూ" అంది. ఆమె గొంతులోని వణుకు ఆమెకే తెలుస్తోంది.

రాజు మాట్లాడకుండా లలిత భుజంమీద చేయివేసి ఆమెను లోపలికి తీసుకు వచ్చాడు.

"రమణా పిల్లలూ ఎలా ఉన్నారు" అడిగాడు రాజు.

"అందరూ బాగానే ఉన్నారు" అంది లలిత.

"బాగా అలిసిపోయి వుంటావు. సరోజా లలితకు కాస్త కాఫీ ఇస్తావా? "

కమల నవ్వింది. "అది మీరు చెప్పాలా. అన్నీ సరోజే చూసుకుంటుంది. సరోజ ఇక మనల్ని పట్టించుకోదు రాజూ! వాళ్ల చెల్లెలు వచ్చేసిందికదా" అంది.

సరోజ కూడా నవ్వింది.

"ఇక నేను వెడతాను సరోజా. అరవింద ఎదురు చూస్తుంటుంది"

"మెనీ థాంక్స్ కమలా" అన్నాడు రాజు.

"ఇటీజ్ మై ప్లెజర్... లలితా.. మళ్లీ కలుద్దాం" అంది కమల బయటకు నడుస్తూ.

★ ★ ★

లలిత స్నానం చేసి వచ్చి కూర్చున్నాక ఇండియా కబుర్లు అన్నీ అడిగి తెలుసుకుంటున్నది సరోజ.

రాజు అక్కడే కూర్చుని అన్నీ వింటున్నాడు.

వినీత అంది "పిన్నీ మే వాంట్ టు ఈట్ డిన్నర్" అని.

"చూశావా మాటల్లోపడి మరిచిపోయాను. ఎప్పుడు తిన్నావో ఏమో! పద తింటూ మాట్లాడుకుందాం" అంది సరోజ లేస్తూ.

గబగబా టేబుల్ మీద అన్నీ సర్దింది.

భోజనాల సమయంలో అడిగాడు రాజు. "రమణ ఉద్యోగం ఎలా వుంది" అని.

నవ్వింది లలిత. "మామూలే గవర్నమెంటు ఉద్యోగం ఎలా ఉంటుంది. కులాల పేరుతోనూ మతాల పేరుతోనూ ప్రజలను వేరు చేస్తున్నారు రాజకీయ నాయకులు. ఆ వినాయకులే ప్రభుత్వం కనుక అవన్నీ ప్రతి రోజూ అటు ఉద్యోగంలోనూ ఇటు దైనందిన జీవితంలోనూ కనపడుతూనే వుంటాయి"

లలిత పొలిటికల్ సైన్సులో మాస్టర్స్ డిగ్రీ చేసింది. కొన్నాళ్లు కాలేజీలో లెక్చరర్‌గా పనిచేసి తర్వాత ఉద్యోగం మానేసింది. కాలేజీ డిబేట్లలో చక్కగా మాట్లాడి ఎన్నో బహుమతులు కూడా గెలుచుకుంది.

"ప్రమోషన్లు కూడా లేవు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే. అందులోనూ రమణ లంచాలకూ అవినీతికీ వ్యతిరేకంగా వుంటాడు కనుక ముందుకు వెళ్లటం కష్టం" అంది లలిత.

"ఒక్కొక్కప్పుడు ఆలోచిస్తుంటే అనిపి

స్తుంది. కేవలం కొన్నివేలమంది స్వలాభాపేక్షగల రాజకీయ నాయకులు, ఇన్ని వేల మంది ప్రజలను, ఎన్నో ఏళ్లుగా ఎలా కాళ్ల కింద తొక్కిపెట్టి దేశసంపదని దోచుకుంటున్నారా అని. అది వాళ్ల తెలివి తేటల్లో వుందో ప్రజల చేతకాని తనంలో వుందో మాత్రం అర్థం కావటంలేదు"

"మీ రాజకీయాలు తర్వాత మాట్లాడుకుందురుకానీ లలితను మా అమ్మ ఆరోగ్యం సంగతి చెప్పనీయండి" అంది సరోజ.

లలిత సరోజతో ఆ విషయాలు మాట్లాడుతూ మధ్యలో రాజుని అడిగింది.

"అసలు డాక్టర్లు ఏమన్నారు... వివరంగా చెప్పండి"

రాజు సరోజవేపు చూశాడు అసలు సంగతి చెప్పావా అన్నట్టుగా.

సరోజ తల ఊపింది. ఒక్క క్షణం ఆగి అంది "మన భోజనాలు అవనీ తీరిగ్గా చెబుతాడు"

అన్నం తినటం అవగానే లలిత మేడమీదకు వెళ్లి తన బాగ్‌లోనుంచి వక్కపొడి పొట్లం తీసుకు వచ్చింది.

"మీ కోసం వక్కపొడి తెచ్చాను" అంది.

"ఇంత హడావిగా వస్తూ కూడా నాకేం కావాలో బాగా గుర్తు పెట్టుకున్నావే లలితా" అన్నాడు రాజు.

రాజు వక్కపొడి పొట్లం విప్పుతున్నప్పుడు అంది లలిత "మీరు తినవచ్చునో లేదో" అని.

రాజు నవ్వాడు. "నేను తినే వక్క పలుకు ఈ ఒక్క పలుకే" అన్నాడు.

లలిత కూడా నవ్వింది.

"అవును మంచిపలుకు. బాగా పలికావ్" అంది సరోజ పెద్దగా నవ్వుతూ.

రాజు-సరోజ మొదటినుంచీ జరిగిన విషయాలన్నీ వివరంగా చెప్పారు. మధ్యమధ్యలో ఇంకా వివరాలు అడుగుతూ అన్నీ తెలుసుకుంది లలిత.

"హ్యూస్టన్ తీసుకు వెళ్లటమే మంచిది. నేను వినీతకు తోడుగా ఇక్కడ ఉంటాను. అక్కయ్య మీతో వచ్చి మీ పక్కన ఉంటుందిలెండి" అంది లలిత.

"అదే మేమూ అనుకుంటున్నాం. ఇక్కడ మీకు సహాయం చేయటానికి మాకు మంచి స్నేహితులు ఉన్నారు. మధ్యమధ్యలో మీరు అక్కడికి వద్దురుగాని" అంది సరోజ.

"అక్కడికి వెళ్లి ట్రీట్‌మెంట్ మొదలుపెడితేకానీ ఏమీ తెలీదు. అసలు ఎన్నాళ్లు పడుతుందీ ఏమిటీ అని".

"ఇండియాకి ఫోన్ చేసి రమణతో మాట్లాడతావా? " అడిగింది సరోజ.

"మాట్లాడతావా ఏమిటి? పిలు... లలిత క్షేమంగా చేరిందని చెప్పద్దూ" అన్నాడు రాజు.

లలిత రమణతో ప్రయాణం బాగా జరిగిందనీ, సరోజా వాళ్లు అందరూ కులాసాయేననీ రాజుకి వైద్యం జరుగుతున్నదనీ చెప్పిందేకానీ అంతకన్నా ఎక్కువ వివరాలు చెప్పలేదు.

ఆ రాత్రి రాజుని మేడమీద మాస్టర్ బెడ్‌రూమ్‌లో వదిలేసి సరోజా లలితా గెస్ట్‌బెడ్‌రూంలో పడుకున్నారు. ఆ రాత్రంతా ఇద్దరూ ఒక్కక్షణం కూడా నిద్రపోకుండా మాట్లాడుకుంటూనే ఉన్నారు.

వినీత మాత్రం మధ్య రాత్రి లేచి వెళ్లి రాజుపక్కనే అతని మీద చేయివేసి పడుకుంది.

★ ★ ★

మర్నాడు ప్రొద్దున్న లలితకు ఇంట్లోవున్న పరికరాలను చూపించింది సరోజ.

కిచెన్‌లో గాస్‌స్టవ్, పైలట్ దీపంతో అగ్గిపుల్లలు లేకుండా ఎలా వెలిగించాలో, మైక్రోవేవ్ ఓవన్, డిష్ వాషింగ్, కిచెన్ గార్బేజ్ డిస్పోజల్ ఎలా వాడాలో, ఎయిర్ కండిషన్ హీటింగ్‌లు ఎలా ఎడ్జస్ట్ చేయాలో, ఇంటి సెక్యూరిటీ సిస్టమ్ ఎలా పని చేస్తుందో, స్మోక్ డిటెక్టర్, టివి, విసిఆర్‌లు ఎలా పనిచేస్తాయో అన్నీ చెప్పింది. ప్రతి




సోమవారం ప్రొద్దున్న గార్బేజి ట్రక్కు వచ్చే ముందర ఇంట్లో గార్బేజి నింపిన గార్బేజ్ కాన్ ఎక్కడ పెట్టాలో, పేపర్లు, సీసాలు, అల్యూమినియం డబ్బాలు వేసిన రీసైకిలింగ్ గార్బేజి డబ్బా ఎక్కడ, ఎప్పుడు పెట్టాలో చూపించింది.

ఆటోమేటిక్ స్ప్రింక్లర్ సిస్టమ్ వారానికి మూడుసార్లు లాన్‌కి నీళ్లు ఎలా పెడుతుందో ఎప్పుడు పెడుతుందో చూపించింది.

"చలికాలం వచ్చేసింది కనుక మన కూరగాయ మొక్కలన్నీ చచ్చిపోయాయి. కాకపోతే గులాబీ మొక్కలకు మాత్రం రోజు విడిచి రోజు నీళ్లు పోస్తాను. అవి మాత్రం చలికాలపు ఫ్రీజింగుకి చచ్చిపోవు. ఆ ఆకు పచ్చ రంగు కూడా దాదాపు అలానే ఉంటుంది" అంది సరోజ.

లాన్ మోవింగ్ క్లీనింగ్ చేసే జార్జి ఫోన్ నెంబరూ, ఎమర్జన్సీ ఫోన్ నెంబర్లూ సుధ, కమలల ఫోన్ నెంబర్లూ వేసిన కాగితం చూపించి ఫ్రిడ్జ్‌మీద మాగ్నెట్‌తో అతికించింది.

కిచెన్‌లో వున్న సీసాలు, డబ్బాలు, వాటి మీద అతికించిన లేబుల్స్ చూపించింది.

"నువ్వు చాలా ఆర్గనైజ్‌డ్‌గా ఉంటావే అక్కయ్యా! అదీకాక ఇంత పెద్ద ఇంటిని, మెయిన్‌టైన్ చేయటం కూడా చాలా కష్టం. చదువుకుంటూ ఉద్యోగం చేసుకుంటూ పని మనిషి కూడా లేకుండా ఇన్ని పనులు మీరు ఎలా చేసుకుంటారా అని ఆశ్చర్యంగా వుంది" అంది లలిత.

చిరునవ్వు నవ్వింది సరోజ.

"అమెరికాలో అన్నీ మెషీన్లే చేస్తాయనీ, మీరేదో తీరిగ్గా కూర్చుని బటన్లు నొక్కుతూ చాలా సుఖంగా ఉన్నారనీ అనుకుంటుంటారు చాలామంది. అన్ని పనులూ మీరే చేసుకుంటూ ఎలా సతమతమవుతున్నారో మీరు" అంది లలిత మళ్లీ.

"అవును ఇక్కడ మనుషులు తక్కువ అవటంతో పనివాళ్లు దొరకటం కష్టం. దొరికినా చాలా ఖరీదుకూడా. ఏదో అవసరమైనప్పుడు ఫోన్‌చేసి గంటకి ఇంత అని డబ్బులిచ్చి నాలుగైదు గంటల్లో పని చేయించుకోవటమేకానీ మనవేపులా ఫుల్‌టైమ్ పని మనుషులను పెట్టుకుంటే తడిసిమోపెడవుతుంది"

"అవున్లే వినీత స్కూలు ఇంకో పదిహేను రోజులే అన్నావుకదా"

"అవును. దానికి త్వరలో క్రిస్మస్ శెలవులు వస్తున్నాయి. అప్పటిదాకా రోజూ స్కూలు బస్‌వచ్చి తీసుకు వెడుతుంది. సరిగ్గా ఇంటిముందరే ఆగుతుంది. సరిగ్గా ఏడున్నరకు వస్తుంది. దాన్ని ఆరున్నరకు లేపితే చాలు. లంచ్ ఒక్కొక్క రోజు తీసుకు వెడుతుంది. మిగిలిన రోజులు, అక్కడే స్కూలు కాఫెటేరియాలో తింటుంది. బస్ సాయంత్రం మళ్లీ నాలుగూ నలభైకి వచ్చి ఇంటి ముందరే దించుతుంది"

"స్కూలుకీ బస్సుకీ నెలకి ఎంత కడతారు" అడిగింది లలిత.

"అవన్నీ ఉచితమే. ప్రతి సంవత్సరం మనం ఇంటి టాక్స్ కడతాంకదా. అప్పుడు దాంట్లో కట్టే స్కూలు టాక్స్‌తో వాళ్లు స్కూళ్లు నడపటం, బస్సులు నడపటం చేస్తారు"

"అంటే గవర్నమెంటు నడుపుతుందా? "

రాజు అన్నాడు. "లేదు ఇక్కడ గవర్నమెంటు దేంట్లోనూ వేలు పెట్టటానికి వీలు లేదు. ప్రజలు అంగీకరించరు. స్కూలు బోర్డుని ప్రజలే ఎన్నుకుంటారు. ఆ బోర్డే నడుపుతుంది స్కూలు జిల్లాని. ఆ జిల్లాలో కొన్ని ఎలిమెంటరీ స్కూళ్లూ, కొన్ని మిడిల్ స్కూళ్లూ, కొన్ని హైస్కూళ్లూ ఉంటాయి. ఆ స్కూలు జిల్లాలోని ప్రజలు టాక్సులు కడుతున్నారు కనుక వాళ్లే స్కూలు బోర్డు ఎన్నికలలో పాల్గొనటం సమర్థులైన వారిని ఎన్నుకోవటం లాటివి చేస్తారు. కాకపోతే

గవర్నమెంటు కొన్ని స్కూళ్ళకు గ్రాంటులు ఇస్తుంది గనుక గవర్నమెంటు పాలసీలకు అనుగుణంగా ఇవి నడుస్తాయి"

"అది సరేకానీ మేము హ్యూస్టన్‌కి ఇంకో నాలుగు రోజుల్లోనే వెళ్లేది. ఈ లోపల నీకు ఇక్కడ అన్నీ అలవాటయిపోతే నాకు దిగు లుండదు. అయినా రాకరాక వచ్చిన నిన్ను ఇలా వదిలి వెడుతున్నందుకు నాకు చాలా బాధగా వుందే లలితా, ఏదో నా స్వార్థం కోసం నిన్ను పిలిచినట్టుగా వుంది" సరోజ చివరి మాటలు కొంచెం భారంగా ఉన్నాయి.

లలిత అంది "అమెరికా వచ్చి తెలుగు మర్చిపోయినట్టున్నావు. నువ్వూ బావగారూ మా ఆయన ఆరోగ్యం గురించి సహాయం అడిగితే వచ్చి మా పక్కన నిలబడరా? నేనూ మా ఆయనా బావగారి ఆరోగ్యం కుదుటపడటానికి ముందుకు రావటం కూడా అంతే. నీ స్వార్థం ఎలా అవుతుందీ. నేను తిరిగి వెళ్లేదాకా అమ్మ వచ్చి రమణా పిల్లల దగ్గర ఉండటంలేదూ. అది ఎవరి స్వార్థమంటావు. మన సంస్కృతిలో అవి స్వార్థాలుకావు. కావలసిన వాళ్లం ఒకళ్ల కొకళ్లం అండగా నిలబడటం. ఆ అనురా గాలూ, అనుబంధాలూ పిలిచినా పిలవకపో యినా మనల్నలా కట్టిపడేస్తూనే వుంటాయి"

సరోజ లలితవేపు ప్రేమగా చూసింది.

★ ★ ★

ఆరోజు సోమవారం. రాజు, సరోజ హ్యూస్టన్‌కి వెళ్లే రోజు.

వినీతకు తాము హ్యూస్టన్‌కి వైద్యంకోసం వెడుతున్నామనీ లలిత పిన్ని అన్నీ చూసు కుంటుందనీ వివరంగా చెప్పింది సరోజ. లలితకు కూడా చెప్పవలసినవన్నీ చెప్పింది. వినీత రాజుకీ, సరోజకీ ముద్దులు ఇచ్చి స్కూలుకి వెళ్లింది. రాజు బస్సు చాలా దూరం వెళ్లేదాకా చేయి ఊపుతూనే ఉన్నాడు.





ఎనిమిదిన్నరకల్లా అక్కడికి వచ్చాడు సురేష్.

అతను వచ్చేసరికే అన్నీ సర్దుకుని సిద్ధంగా ఉన్నారు రాజూ సరోజా.

సురేష్ సూట్‌కేసులు కారు డిక్కీలో పెట్టి "ఇక వెడదామా" అన్నాడు.

సరోజ కారు వెనుక సీటులో ఒక దిండు దుప్పటి పడేసింది.

రాజు లలిత దగ్గరకు వెళ్లి "వస్తాము లలితా జాగ్రత్త" అన్నాడు.

లలిత రాజుతో "క్షేమంగా వెళ్లి లాభంగా రండి బావగారూ" అంది. అనుకోకుండా ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

రాజు ఆమె వేపు ఆప్యాయంగా చూసి కారు వెనుక సీటులో కూర్చున్నాడు.

లలిత పమిటె చెంగుతో కన్నీళ్లు తుడుచు కుంది.

సరోజ దేవుడి పటం ముందర ఒక్క క్షణం ధ్యానించి హాండ్‌బాగ్ తీసుకుని లలి తతో అంది.

"సాయంత్రం కాలేజీ అవగానే సుధ వచ్చి నీకూ వినీతకూ తోడుగా వుంటుంది. సురేష్ మమ్మల్ని హ్యూస్టన్‌లో దించి సాయంత్రానికి వచ్చేస్తాడులే"

లలితకు దగ్గరగా వచ్చి ఆమె చేయిపట్టు కుని అంది "వస్తాము లలితా... జాగ్రత్త వెళ్లగానే ఫోన్ చేస్తానులే"

"ఇక్కడి విషయాలు అన్నీ నేను చూసు కుంటానులే అక్కయ్యా వినీత సంగతి పూర్తిగా నాకు వదిలేయి. బావగారిని జాగ్ర త్తగా చూసుకో నీ ఆర్యోగం జాగ్రత్త" అంది లలిత.

సరోజ లలిత చేతిని మృదువుగా నొక్కింది.

సరోజ ముందు సీటులో ఎక్కాక సురేష్ కారు డోరు మూసి రాజుతో అన్నాడు.

"అవసరమైతే వెనకాల పడుకోటానికి వీలుగా ఉంటుందని పెద్ద కారు తెచ్చాను. రిలాక్స్" అన్నాడు.

సురేష్ నెమ్మదిగా కారుని డ్రైవ్‌వేలోనించి

బయటకు తీసి ముందుకు కదిలాడు.

వాళ్ల కారు కనుచూపు మేర దాటేదాకా లలిత చేయి ఊపుతూనే వుంది.

రాజు కారు సీటులో వెనక్కి ఆనుకుని కళ్లు మూసుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

సురేష్ ఎం.ఎస్.సుబ్బలక్ష్మి పాటల టేపు, కొంచెం వాల్యూమ్ తగ్గించి పెట్టాడు.

సరోజ కిటికీలోనించి బయటకు చూస్తూ, తను కూడా ఆలోచనలో పడింది.

సిగ్నల్ దగ్గర ఎర్రలైటు రావటంతో కారు ఆపాడు సురేష్.

కళ్లు తెరిచిన రాజు అడిగాడు సురేష్‌ని "సురేష్! హ్యూస్టన్ ఆసుపత్రిలో డాక్టర్ హోల్‌మన్ నీతో ఏం చెప్పాడు. ఏదన్నా హోప్ ఉందన్నాడా"

సరోజ అంది "ఇందాకటినించి వెనక నించి మాటలు వినపడకపోతే నిద్రలో పడ్డావనుకున్నాను"

రాజు అదోలా నవ్వి ఊరుకున్నాడు.

"నేను చాలా వివరంగా ఆయనతో చర్చించాను రాజూ. ఆయన చెప్పినదీ ఇక్కడ ఆసుపత్రిలో డాక్టర్ బర్చ్ చెప్పినదీ ఒక్కటే. ఇక్కడ కీమోథెరపీతో పెద్దగా మెరుగవలేదు కనుక ఆయన దానిమీద ఎక్కువ ఆధారపడడు. అంటే అసలు చేయడని కాదు. అవసరమైనంత వరకూ కీమో చేయవచ్చు. ఇదే వ్యాధి లక్షణాల మీద ఎక్కువగా కాకపోయినా కొంత రీసెర్చి జరిగిందన్నారుకదా. డాక్టర్ హోల్‌మన్ కూడా ఈ విషయం మీద కొంత పని చేశాడు. ఒక పేపరు ఈ మధ్యనే 'జామా'లో (జర్నల్ ఆఫ్ అమెరికన్ అసోషియేషన్) ప్రచురించాడు. అందుకే నీ కేసు విని ఉత్సాహంగా ముందుకు వచ్చాడు. ఈ వ్యాధికి ఫలానా మందు అంటూ ఏదీలేదు. కనుక ఆయన కొన్ని ప్రయోగాలు చేస్తాడు. వాటిల్లో దేనికి ఫలితం కనపడినా మనం అదృష్టవంతులం. మనకే కాదు, కాన్సర్ రీసెర్చికి కూడా ఎంతో లాభం. దేనికీ రెస్పాన్స్ రాకపోతే మనమిక చేసేదేమీ లేదు" అన్నాడు సురేష్.

రాజు ఒక్క నిమిషం మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా అన్నాడు. "ఒకవేళ ఇక్కడా తగ్గలేదనుకో. మనకి తరణోపాయం ఏమిటి? "

"రాజూ... ప్రపంచంలో వైద్యశాస్త్రం రోజు రోజుకీ ముందుకి పోతున్నది. ఎన్నో విచిత్రమైన రోగాలకు మందులు కనిపెడుతున్నారు. కొన్నాళ్ల క్రితం ఏమీ లాభం లేదని పెదవి విరిచేసిన రోగాలకు ఇవాళ పూర్తిగా నివారించే మందులు వచ్చాయి. అలాగే కొత్తకొత్త రోగాలు కూడా వస్తున్నాయనుకో. ఎన్ని మందులు కనిపెట్టినా మనం మానసికంగా ఆ అనారోగ్యాన్ని ఎలా ఎదుర్కొంటున్నామన్న దానిపై నివారణ ఆధారపడి ఉంటుంది. చక్కటి మందులు వాడినా కూడా మానసికంగా భయపడి, కృంగిపోయి చనిపోయిన వాళ్లున్నారు.

ఒక్కొక్కప్పుడు ఆ మనోబలం ప్రాణాలు పోయకపోవచ్చు కనీసం ఆయుర్దాయాన్ని పెంచే అవకాశాన్ని కలిగించవచ్చు. అందుకని... వైద్యాన్ని డాక్టర్లకు వదిలేసి నువ్వు ధైర్యంగా పరిస్థితులను ఎదుర్కోవటం అవసరం. మనసా, వాచా, కర్మణా... నీ మీదా, నీ బ్రతుకు మీదా నమ్మకం పెట్టుకుని ముందుకు పద. పక్కన మేమందరం ఉన్నాం. ఉంటాం. తర్వాత ఎలాగూ జరిగేది జరగకమానదు. కనీసం మనం చేయగలిగిదంతా చేశామన్న తృప్తి ఉంటుంది"

"భగవద్గీతలో చెప్పేది కూడా అదే. మీ ప్రయత్నం మీరు చేయండి. తర్వాత మిగిలింది నాకు వదిలేయండి అన్నాడు కృష్ణభగవానుడు..." వెనక్కి తిరిగి సరోజ అంది రాజుతో.

రాజు ఏమీ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు.

పక్కనించీ సైరన్ ఊదుకుంటూ ఎరుపు, నీలం రంగుల లైట్లను ఆర్పి వెలిగించు



కుంటూ, ఒక అంబులెన్సు దూసుకుపోయింది. సురేష్ కారుని రోడ్డుపక్కకు నడిపి, అక్కడ ఆపాడు అంబులెన్సు వాళ్ళని దాటి వెళ్ళేదాకా.

సరోజ అంది సురేష్‌తో " ఎవరికో ప్రాణం పోయటానికి హాస్పిటల్‌కి తీసుకెడుతున్నట్టున్నారు..."

సురేష్ అవునన్నట్టుగా తల ఊపాడు.

కారు ఫ్రీవే మీద హ్యూస్టన్‌వేపు గంటకు డెబ్భై మైళ్ళ వేగంతో దూసుకుపోతోంది.

రోడ్డుకి రెండుపక్కలా పెద్దపెద్ద చెట్లు, గాలికి తలలు ఊపుతున్నాయి.

అది డిశెంబరు నెల కావటంతో కొన్ని చెట్లు ఆకుపచ్చగా వున్నా చలికి కొన్ని పసుపు రంగులోనూ, కొన్ని కమలాఫలం రంగులోనూ వున్నాయి. కొన్ని చెట్లకయితే ఆకులు పూర్తిగా రాలిపోయి మోడులయిపోయాయి. అది టెక్సాస్ రాష్ట్రం కనుక కనీసం కొన్ని చెట్లయినా పచ్చపచ్చగా వున్నాయి. అదే ఉత్తరానవున్న న్యూయార్కు, మిషిగన్, ఇల్లినాయ్, ఇండియానా, ఒహైయోలాంటి రాష్ట్రాలలో అయితే ఆ సమయానికి మంచు దట్టంగా పడి ఆకులులేని చెట్లు ధవళ వస్త్రాలు కప్పినట్టు తెల్లటి తెలుపుతో చలికాలపు ఎండకి మెరుస్తూ వుంటాయి.

బయట టెంపరేచర్ తక్కువగా ఉండటం వల్లా కారు చాలా వేగంగా పోతున్నందు వల్లా సురేష్ కారులోని హీటర్ ఆన్ చేశాడు. బయట గాలితో కలిపి హీటర్ ఆన్ చేసినందువల్ల వేడిగాలి, చల్లటి గాలితో కలిసి హాయిగావుంది.

సరోజ వెనుదిరిగి చూసింది. రాజు నిద్రలోకి జారుకున్నాడు.

సరోజా, సురేష్ మాటల్లోపడ్డారు.

హ్యూస్టన్‌లోని ఎం.డి.ఆండర్సన్ హాస్పిటల్‌కి చేరేసరికి మిట్టమధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

హ్యూస్టన్ రోడ్లమీద ట్రాఫిక్ ఎక్కువ. అమెరికాలోని పెద్ద నగరాలలో అది నాలుగవది. అన్నిటిలోకి పెద్దది న్యూయార్కు నగరం. తర్వాత వరసలో లాస్‌ఏంజలస్, చికాగో, హ్యూస్టన్ వస్తాయి. హ్యూస్టన్‌లోని కొన్ని మెయిన్‌రోడ్లు అటు ఆరు, ఇటు ఆరు లైన్లతో అంటే మొత్తం పన్నెండు లైన్ల రోడ్లతో కిటకిటలాడుతూ వుంటాయి. మధ్యాహ్నం పూట ట్రాఫిక్ కొంచెం తక్కువగానే వున్నా, కొన్ని రోడ్లు మాత్రం ఏడు నెలల గర్భిణీ స్త్రీలాగా నిండుగానే వుంటాయి. చాలా ముఖ్యమైన కొన్ని రోడ్ల

మీద గంటకి కొన్ని వేల కార్లు వెడుతూ వుంటాయి. సాధారణంగా ఎప్పుడో తప్ప ఎక్కువగా ఏమీ రోడ్డు ప్రమాదాలు జరగకుండా ట్రాఫిక్ నెమ్మదిగా నడుస్తూనే ఉంటుంది.

ఇండియాలో పెరిగి కొత్తగా అమెరికా వచ్చిన వాళ్ళకి ముఖ్యంగా కనపడేదీ ఆశ్చర్యంగా ఉండేదీ ఒకటుంది. అది అన్ని వేల కార్లు వెడుతున్నా ఎక్కడా కారు హారన్లు వినపడక పోవటం! అత్యవసరమైన పని ఏమీ లేకుండా కారు హారన్ కొడుతూ పోలీసుల కళ్లల్లో పడితే వాళ్లు ట్రాఫిక్ టిక్కెట్టు ఇవ్వటం, కనీసం డెబ్భై ఐదు డాలర్లు ఫైన్ పడటం వింతగా వుంటుంది.

హాస్పిటల్ డ్రైవ్వేలో సురేష్ కారు ఆగటం చూసి అక్కడకు గబగబా వచ్చాడు నారాయణ.

"అరె మీరూ వచ్చారే ఆఫీసు వదిలేసి" అంది సరోజ.

"లంచ్ టైమేకదా! అదీకాక మా ఆఫీసు ఇక్కడికి ఐదు మైళ్లు కూడా వుండదు" అంటూ కారు వెనుక తలుపు తెరిచాడు నారాయణ.

కారు దిగుతున్న రాజుకి చేయి ఆసరా ఇస్తూ "నడుస్తారా... వీల్ ఛైర్ తెమ్మనేదా" అడిగాడు నారాయణ.

రాజు నవ్వాడు. "కారులో కాసేపు కూర్చుని కాసేపు పడుకుని నా కండరాలు అన్నీ బిగుసుకుపోయాయి. నడిస్తేనే ఒంటికి మంచిది" అన్నాడు కారు దిగుతూ.

సురేష్ కారు డిక్కీలోనించి సూట్ కేస్, బాగ్ దించాడు.

"సురేష్ మీరు కారు పార్క్ చేసి రండి. మేము ఎడ్మిషన్స్ కౌంటర్ దగ్గరుంటాం" అన్నాడు నారాయణ.

సురేష్ తలూపి కారుని పక్కనే వున్న పార్కింగ్ బిల్డింగ్‌వేపు నడిపాడు.

పది నిమిషాల్లో రాజుకి రూమ్ ఎలాట్ అయింది.

"డాక్టర్ హోల్‌మన్‌కి మీరు వచ్చారని మెసేజ్ పంపిస్తాం" అంది అక్కడి క్లర్క్.

సరోజ తలూపి మెడికల్ ఇన్‌షూరెన్స్ కార్డు పర్స్‌లో పెట్టుకుని రాజు, నారాయణల వెంట నడిచింది.

వాళ్లకిచ్చిన గది మూడవ అంతస్థులో వుంది.

రాజు బెడ్ పక్కనే టెలిఫోన్, పైన సీలింగ్‌నించి వేలాడుతున్న టి.వి. ఉన్నాయి. బెడ్ పక్కనే టి.వి. సౌండ్‌బాక్స్, మంచం పైకీ కిందకీ పోవటానికి కావలసిన స్విచ్‌లు ఉన్నాయి. కిటికీ పక్కగా సరోజకు ఫోల్డ్ చేసిన ఒక మంచం, బెడ్ పక్కనే బట్టలు తగిలించుకోటానికి క్లాసేట్, దాని పక్కనే బాత్‌రూమ్.

కిటికీలోనించి బయట రోడ్డుమీద కార్లు కనిపిస్తున్నాయి.

"రూమ్ విశాలంగా వుంది" అన్నాడు నారాయణ.

"అవును" అంది సరోజ తలూపుతూ.

"ఎన్నాళ్లుంటానో ఇక్కడ" అన్నాడు రాజు అనాలోచితంగా.

సరోజ అతనివేపు చటుక్కున తిరిగింది. నిశితంగా చూసింది.

నారాయణ కావాలనే నవ్వాడు. "ఎన్నాళ్లేమిటి తగ్గేదాకా! అంటే కొన్నాళ్లదాకా" ఈలోగా సురేష్ కూడా వచ్చాడు.

"రూమ్ బాగుంది" అన్నాడు అటూ ఇటూ చూసి.

"డాక్టర్ హోల్‌మన్‌కి మెసేజ్ ఇచ్చారుట. బహుశా మధ్యాహ్నం లోపల వస్తాడు రాజుని చూడటానికి" అన్నాడు సురేష్ మళ్లీ.

"లంచ్ ఎక్కడ చేద్దాం... నేను వెళ్లి ఏమన్నా తెచ్చేదా" అడిగాడు నారాయణ.

"నేను ఈ పూటకి పులిహోర తెచ్చాను. మనందరికీ సరిపోతుంది" అంది సరోజ, ప్లాస్టిక్ డబ్బా మూత తెరుస్తూ.

"ఎన్నాళ్లయింది పులిహోర తిని"

అన్నాడు నారాయణ.

"ఏం శని, ఆది వారాలు డల్లాస్ వెళతారుగా. శ్యామల పులిహోర చాలా బాగా చేస్తుందే" అంది సరోజ నవ్వుతూ.

"ఎందుకు చేయదూ.. కానీ తిని చాలా రోజులయింది" అన్నాడు నారాయణ.

"దాన్నిబట్టి ఆయన శ్యామలని ఎంత మిస్ అవుతున్నారో తెలుస్తుంది" అన్నాడు రాజు నవ్వుతూ.

అందరూ లంచ్ తినటం పూర్తిచేసి కబుర్లలో పడ్డాక కాస్సేపటికి వచ్చాడు డాక్టర్ హోల్‌మన్. కొంచెం పొట్టిగా, తెల్లటి పిల్లి గడ్డంతో గంభీరంగా ఉన్నాడు. తలమీద తెల్ల వెంట్రుకలు ఆయన వయసునేకాక వైద్యరంగంలో ఆయన అనుభవాన్ని కూడా చాటి చెబుతున్నాయి.

ఆయన అందరికీ తనని పరిచయం చేసుకున్నాడు. భారతీయుల పేర్లు అమెరికన్లకి పలకటం కష్టం కనుక, ఒకటికి రెండుసార్లు అందరి పేర్లూ అడిగి తెలుసుకున్నాడు. తను ఆ పేర్లు పలికి "సరిగ్గా అన్నానా తప్పు పలికానా" అని అడిగాడు. చాలా కలుపుగోలుగా మాట్లాడాడు.

తర్వాత రాజుకి సంబంధించిన ఫైల్ తెరిచి చెప్పసాగాడు.

"ఇది చాలా అరుదైన కాన్సర్" ఆయన చెప్పిన విషయాలు దాదాపుగా అన్నీ డల్లాస్‌లో డాక్టర్ బర్చ్ చెప్పిన విషయాలే.

అయినా ఆయన చెబుతున్నంతసేపూ రాజు, సరోజ, సురేష్, నారాయణ ఏమీ మాట్లాడకుండా జాగ్రత్తగా విన్నారు.

ఆయన మధ్యమధ్యలో సురేష్ వేపు తిరిగి "మీకు తెలుసుకదా ఈ విషయం" అని చెప్పటం ఒక డాక్టర్ పక్కనే వున్న ఇంకో డాక్టర్ని గుర్తించి మాట్లాడటంగా భావించి సురేష్ ఆయన వ్యక్తిత్వాన్ని అంచనా వేయసాగాడు.

"ఇవీ ఈ వ్యాధి గురించి మనకు తెలిసిన విషయాలు. ఇక ఈ వ్యాధికి చికిత్స ఏమిటో ఎలా చేద్దామనుకుంటున్నానో చెబుతాను" అని ఆయన ఒక్కక్షణం ఆగాడు.

రాజూ, సరోజా కుతూహలంగా చూస్తున్నారు.

"ఒకే నేను ఇప్పుడు చెప్పబోతున్న చికిత్సా విధానం నా ఒక్కడి అనుభవం నించే కాదు. మేము ఈ కేసుని ఒక పానల్ ఆఫ్ డాక్టర్స్‌తో చర్చించాం. ఇలాంటి కేసులు చాలా అరుదుగా వస్తుంటాయి. ఇలాంటి వ్యాధులకు ఇది చికిత్స అని కానీ ఇవి ఫలానా మందులు అని కానీ లేవు. డల్లాస్ హాస్పిటల్లోనేకాక ఇక్కడి డాక్టర్లం అందరం కూడా నిర్ణయించినది ఒకటే. ఈ వ్యాధికి ఈ స్థితిలో ఏమీ చికిత్స లేదు అని. రోగి ఎక్కువ రోజులు బతకటం కష్టం అని. అందుకే మనం కొన్ని ప్రయోగాలు చేద్దాం. కొంత కీమోథెరపీ ద్వారానూ, కొంత కొన్ని కొత్తమందుల ద్వారానూ ఇలా వివిధ రకాలుగా మేము రెండు మూడు ప్లానులు సిద్ధం చేశాం. ఎప్పుడు ఏది వాడటమో, మనకా చికిత్సల వల్ల వచ్చే ఫలితాల మీద ఆధారపడి వుంటుంది. అవన్నీ మనం అనుకున్నట్టుగా జరిగితే రాజు బతికి బయటపడతాడు. అంతేకాక వైద్యరంగానికి చాలా ఉపయోగకరమైన పని జరుగుతుంది. భవిష్యత్తులో ఇలాంటి వ్యాధి వచ్చే రోగులకు ఈ ఫలితాలు చక్కటి మార్గం చూపిస్తాయి. అలాకాక అనుకున్నట్టుగా రాజుకి తగ్గకపోతే రాజు మనకిక దక్కడు. అది ఎలాగయినా జరిగే పనే అని డాక్టర్లందరూ చెబుతూనే ఉన్నారు. మీరు ఈ చికిత్సకి అంగీకరిస్తే రాజుకి ఏం జరిగినా వైద్యరంగానికి విలువైన సమాచారం లభిస్తుంది. కాన్సర్ రీసెర్చికి చాలా లాభం కలుగుతుంది. నేను మిమ్మల్ని ఇలా చేయండని చెప్పటంలేదు. పరిస్థితిని అన్ని కోణాల లోనూ చూపిస్తున్నాను. అంగీకరించటం, అంగీకరించకపోవటం రాజు ఇష్టం. తర్వాత సరోజ ఇష్టం. తొందరలేదు. ఆలో




చించుకోండి. మీరు ఒక నిర్ణయానికి వచ్చాక ఇక్కడి నర్సింగ్ సూపర్వైజర్‌కి చెప్పండి. ఆవిడ నన్ను పేజ్‌చేసి ఇన్‌ఫర్మేషన్ ఇస్తుంది. దాన్నిబట్టి ఆలోచిద్దాం ఏం చేయాలో" ఆగాడు డాక్టర్ హోల్‌మన్.

"ఈ ప్రయోగాలవల్ల రాజుకి వేరే కాంప్లికేషన్స్ ఏమయినా వస్తాయా? ప్రమాదకరమైన..." వాక్యం ఎలా పూర్తి చేయాలో తెలియక గుండె గొంతుకలో కొట్టాడుతుంటే ఆగిపోయింది సరోజ.

డాక్టర్ హోల్‌మన్ సరోజ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"నేను జ్యూయిష్ మతానికి చెందినవాడిని. మాకు కూడా ఈ బంధాలు, అనుబంధాలు మీ భారతీయులలాగానే ఎక్కువ. మీరు అడుగుతున్న ప్రశ్న నాకు బాగా అర్థమయింది" ఒక్క క్షణం ఆగి మళ్లీ అన్నాడు.

"రాజు చాలా ప్రమాద పరిస్థితిలో అంత్యదశలో ఉన్నాడు. మనం వాడే ఏ మందులవల్లనయినా ఆ పరిస్థితి ఇంకా విషమిస్తుందని నేను అనుకోను. మనం చేసే ప్రయత్నం సుడిగాలిలో దీపానికి చేతులు అడ్డంపెట్టి ఆ వెలుగుని కాపాడదామనే మానవ ప్రయత్నం. దానివల్ల లాభం లేదా? ఉండవచ్చు మన ప్రయత్నం ఫలిస్తే ఉంటుంది. ఆ వెలుగుని కాపాడవలసి వచ్చినప్పుడు దీపం ఆరిపోయేదాకా రక్షణ కల్పించటం మన ధర్మం. మానవ ధర్మం. మా దేవుడయినా మీ దేవుడయినా పూనుకుంటే అది జరిగే పనే" సరోజ చేతిని ఆయన గట్టిగా వత్తాడు.

సరోజ ఒక్కసారిగా నీరసపడిపోయింది. ఏమీ మాట్లాడలేదు. కళ్లల్లో నీళ్లు బుగ్గలమీదుగా కిందకు జారుతున్నాయి.

డాక్టర్ హోల్‌మన్ ఆప్యాయంగా సరోజ భుజం తట్టాడు.

"మళ్లీ చూస్తాను" అని అక్కడవున్న అందరికీ షేక్‌హాండ్ ఇచ్చి వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లాక సురేష్ అన్నాడు "సరోజ గారూ మనం ముందు అనుకున్నట్టుగానే ఆయన అన్నీ చెప్పాడు. మనం ఆయన చెప్పిన చికిత్సకు అంగీకరిస్తే ఆయనకు నేను చెబుతాను"

వెంటనే రాజు అన్నాడు "సురేష్! ఇంక ఆలోచించుకునేదేమీలేదు. చికిత్స ప్రారంభించమని ఆయనకు చెప్దాం. మనకి వేరే అవకాశం లేకపోవటం ఒక కారణం. రెండవ కారణం, నేను బతికినా బతకకపోయినా ఈ ప్రయోగాలవల్ల కాన్సర్ రీసెర్చికి ఏవిధమైన ఉపయోగం కలిగినా అంతకన్నా మంచిపని ఇంకొకటి ఉండదు. వెంటనే ఆయనకు చెప్పు. ఏం సరోజా? "

సరోజ రాజుని ప్రేమగా చూసింది.

ఒక్క క్షణం ఆగి "అవును త్వరగా మొదలు పెట్టటమే మంచిది" అంది. కొత్తగా ముందుకు వస్తున్న ధైర్యం ఆమె మాటల్లో, మాట తీరులో తొంగి చూస్తూనే వుంది.

సురేష్ నర్సింగ్‌స్టేషన్ దగ్గరకు వెళ్లి అక్కడి నర్స్‌తో మాట్లాడాడు. ఆవిడ డాక్టర్ హోల్‌మన్‌కి ఫోన్ చేసింది. మూడు నిమిషాల్లో పిలిచాడు డాక్టర్ హోల్‌మన్.

సురేష్ ఫోన్‌లో రాజు, సరోజ ఆయన చెప్పిన వైద్యానికి అంగీకరిస్తున్నారనీ మర్నాటినించే వైద్యం ప్రారంభించవచ్చనీ చెప్పాడు.

"మంచి నిశ్చయం తీసుకున్నారు. ఇక మన ప్రయత్నాలు మనం చేద్దాం" అన్నాడు డాక్టర్ హోల్‌మన్.

ఒక అరగంట తర్వాత ఒక నర్స్ వచ్చింది. సరోజ చేత, రాజు చేత కొన్ని కాగితాల మీద సంతకాలు పెట్టించుకుంది. ఈ చికిత్స ఒక ప్రయోగంలా జరుగుతుందనీ రాజుకి తగ్గకపోయినా, వేరే ఇబ్బందులు వచ్చినా, చనిపోయినా డాక్టర్లకు కానీ హాస్పిటల్‌కుకానీ ఏ బాధ్యతా లేదనీ రాసిన కాగితం అది. రాజూ, సరోజా సంతకాలు

చేశారు.

మర్నాటినించే చికిత్స ప్రారంభించాడు డాక్టర్ హోల్‌మన్.



ఐదు రోజులు గడిచాయి. కీమోథెరపీ రెండుసార్లు చేశారు. అదీకాక డాక్టర్ హోల్‌మన్ రాసిన మందులన్నీ టైము ప్రకారం ఇస్తున్నారు నర్సులు. ఆ ఐదు రోజుల్లోనూ రాజుకి కడుపులో నొప్పి రాలేదు. చెప్పుకోదగ్గ సంఘటనలేవీ జరగలేదు.

ప్రతిరోజూ రాత్రిపూట, డల్లాస్‌నించి వినీత, లలిత ఫోన్‌చేసి మాట్లాడుతున్నారు.

వినీత పరీక్షలకు బాగా చదువుతున్నాననీ శని, ఆదివారాలలో కమలా, ప్రకాష్‌లతో కలిసి హ్యూస్టన్‌కి వస్తామనీ చెప్పింది.

ప్రకాష్, కమల, సురేష్, సుధలు అక్కడికి వచ్చి చూసి వెడుతున్నారని లలిత చెప్పింది.

సుధతో కలిసి ఇండియన్ గ్రోసరీకి వెళ్లి కావలసిన సరుకులూ కూరలూ తెచ్చుకున్నామని చెప్పింది లలిత.

"నిన్ను కష్టపెడుతున్నానే" అంది సరోజ నొచ్చుకుంటూ.

"నోరు ముయ్యవే. కష్టమంట కష్టం" అంది లలిత సరోజని ఇంకేమీ మాట్లడనీయకుండా.

హ్యూస్టన్‌లో కూడా నారాయణ ప్రతి సాయంత్రం హాస్పిటల్‌కి వచ్చి చూసి వెడుతూనే ఉన్నాడు.

వచ్చినప్పుడల్లా రాజుతోనూ సరోజతోనూ చాలాసేపు మాటలతో గడిపేవాడు. అతను స్వతహాగా మాటకారి కనుక సరోజకీ రాజుకీ కూడా మంచి కాలక్షేపం అయ్యేది. అదీకాక వచ్చేటప్పుడు తెలుగు పుస్తకాలు, ఇండియన్ మాగజైన్లూ తెచ్చి ఇచ్చేవాడు.



ఆ రోజు శనివారం ప్రొద్దున్నే వచ్చారు ఇద్దరు డెబ్బై ఏళ్ల పైబడ్డ మగువలు. ఇద్దరూ తెల్లటి శరీరాలేకాక తెల్లబడ్డ జుట్టుతో, తెల్లటి బట్టలతో సహాయం చేయటానికి వచ్చిన దేవదూతల్లా ఉన్నారు. హాస్పిటల్లోని రోగులకు మాట సహాయం, శారీరక సహాయం చేయటానికి కొంత మంది స్వచ్ఛంద సేవకులు అలా వస్తుంటారు. వారికి సమయం దొరికినప్పుడు ఒక కాలక్రమం ప్రకారం హాస్పిటల్ రోగుల దగ్గరకు వస్తుంటారు. చదువుకోటానికి పుస్తకాలు తేవటం, అవసరమైనవారికి అవి చదివి వినిపించటం, కబుర్లు చెప్పి వాళ్లని సంతోషపరచటం, ఎవరూ లేని వాళ్లకు కాస్సేపు తోడుగా వుండి వాళ్లకు దిగులు లేకుండా చేయటం, వారి చేతులు పట్టుకుని వరండాలో నడిపించటం లాంటివి చేస్తుంటారు. ఇక్కడ గమనించదగ్గ విషయం ఏమిటంటే వీళ్లల్లో చాలామంది వయసు మీరిన వాళ్లే! కొంతమంది వయసులో మరీ పెద్దవాళ్లు. వాళ్ల స్ఫూర్తి స్నేహపూరితమైన సేవాతత్పరతా చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది.

ఆ వచ్చిన ఇద్దరూ తమను పరిచయం చేసుకున్నారు. ఒకావిడ పేరు కాథరీన్. రెండో ఆవిడ పేరు ఎలిజబెత్. వాళ్లతో పాటు కొన్ని రంగు కాగితాలు, సెల్లో టేపు

లాటివి కొన్ని తెచ్చారు.

"క్రిస్మస్ ఇంక ఇరవై రోజులే వుంది. అందుకని మీ గదిని అలంకరిద్దామని వచ్చాం" అంది కాథరీన్ అందంగా నవ్వుతూ.

"మీకు అభ్యంతరం లేదుగా" అంది ఎలిజబెత్.

"అయ్యో అదేమిటి అభ్యంతరం ఎందుకు" అంది సరోజ.

వాళ్లిద్దరూ క్రిస్మస్ పండగను సూచించే ఎరుపు, ఆకుపచ్చరంగుల కాగితాలు టేపుతో గది కిటికీల చుట్టూ గదిలోనూ గది తలుపుమీదా అందంగా అంటించారు.

బయట తలుపు మీద ఒక విమానం బొమ్మ అంటించారు.

సరోజ సహాయంతో దానిమీద రాజు పేరు రాసి పక్కనే "కాకినాడనించి హ్యూస్టన్‌కి డల్లాస్ మీదుగా" అని రాశారు. ఆ ఎరుపు ఆకుపచ్చ రంగు కాగితాలతోనే ఇండియా జెండాలాగా చేసి తలుపు మీద అంటించారు.

కేథరీన్ రాజు పక్కనే కూర్చుని ఇండియా గురించి మొదలుపెట్టి రాజు ఆఫీసులో చేసే పనిదాకా ఎన్నో విషయాలు అడిగింది.

ఎలిజబెత్ కొన్ని జోకులు చెప్పింది. రాజు, సరోజలకు సమయం పదకొండు గంటలయినట్టు కూడా తెలియలేదు.

అప్పుడే వచ్చారు వినీత, లలిత, అరవింద, కమల, ప్రకాష్‌లు డల్లాస్‌నించి.

వినీత వస్తూనే సరోజను కావలించుకుంది.

వాళ్ళు రాగానే కేథరీన్, ఎలిజబెత్‌లు ఇక వెళ్ళాలని లేచారు.

సరోజ వినీతను, లలితను వాళ్ళకు పరిచయం చేసింది.

"యు హేవ్ ఎ వండ్రఫుల్ ఫ్యామిలీ. గాడ్ విల్ బ్లెస్‌యు. రాజు విల్ బి ఆల్‌రైట్" అని మనస్ఫూర్తిగా దీవించి ఇద్దరూ వెళ్ళిపోయారు.

లలిత రాజు దగ్గర మంచం మీద కూర్చుని అడిగింది, "బావగారూ, మీరు బాగా చిక్కిపోయారు. ఎలావుంది ఇప్పుడు" అని.

"ఇప్పుడు చాలా నయం. ఈ నాలుగు రోజులూ ఏబాధా తెలియలేదు. ట్రీట్‌మెంట్ కూడా ఒక పద్ధతిలో జరుగుతోంది. కొంచెం మెరుగవుతున్నదేమో అనిపిస్తోంది" అన్నాడు రాజు.

సరోజ అరవిందను అడిగింది, "ఎలా వుంది స్కూలు. బాగా చదువుతున్నావా? "

అరవింద తల వూపి "ఆంటీ! ఉయ్యార్ మిస్సింగ్ యు అండ్ అంకుల్" అంది.

సరోజ అరవిందకు ఒక హగ్ ఇచ్చింది.

వినీత "గెట్ వెల్" కార్డు ఒకటి తయారుచేసి తీసుకువచ్చింది. రాజుకి ఇవ్వగానే, రాజు అది చదివి వినీతను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. వినీత కబుర్లు చెబుతోంది.

"ఎలావుందే... అమెరికాలో ఇప్పటిదాకా నీ జీవితం" అడిగింది సరోజ నవ్వుతూ లలితని.

లలిత ఏమీ మాట్లాడకుండా చిరునవ్వు నవ్వి, కారేజీలోనించీ పులిహోర, పెరుగన్నం, పూరీలు, కూర మొదలైనవి బయటకు తీసింది.

"ఇదేమిటే... ఇన్ని చేశావ్" అంది సరోజ.

"నీకోసం, కష్టపడి ప్రేమతో చేసి తెస్తే ఇన్నెందుకు అంటావేమిటి. మీరిద్దరూ తిన్నాక, మిగిలినవి ఫ్రిడ్జ్‌లోపెట్టు" అంది కమల.

ప్రకాష్, రాజు మంచం దగ్గరకు కుర్చీ జరిపి కూర్చుని, అతని ఆరోగ్యం గురించీ ట్రీట్‌మెంట్ గురించీ మెడికల్ ఇన్స్యూరెన్సు గురించీ మాట్లాడుతున్నాడు.

వినీత సరోజను గట్టిగా పట్టుకుని ఆమెను అతుక్కుని కూర్చున్నది.



"మేము దారిలో పిజ్జా తిన్నాం" అంది వినీత.

"లలితకు పిజ్జా రుచి చూపిద్దామన్నాడు ప్రకాష్. అందుకే పిజ్జా హట్‌కి వెళ్లాం" అంది కమల.

సరోజ నవ్వింది. "ఎలా వుందే పిజ్జా, లలితా నీకు నచ్చిందా?"

"ఉల్లిపాయ దిబ్బరొట్టెలావుంది. కాకపోతే చాలా కూరగాయలు, ఛీజ్, టమోటా సాస్ వేశాడంతే" అంది లలిత.

రాజుతోపాటూ అందరూ నవ్వారు.

సరోజ రెండు ప్లేట్లలో రాజుకీ తనకీ వడ్డించింది.

భోజనాలు పూర్తిచేశాక రాజు అన్నాడు.

"సరోజా! లలితకు ఈ ఊళ్లోని మీనాక్షి గుడి చూపించవద్దూ. ప్రకాష్! వీళ్లను గుడికి తీసుకు వెడతావా"

"దానికేం భాగ్యం. రండి వెడదాం" అన్నాడు ప్రకాష్.

"నేను రానులెండి. రాజు ఒక్కడే ఉండాల్సి వస్తుంది" అంది సరోజ.

"నేనేమన్నా చిన్నపిల్లాడినా ఫరవాలేదులే వెళ్లు" అన్నాడు రాజు.

"అదికాదు" అంటున్న సరోజ మాటలకు అడ్డం వస్తూ అన్నాడు రాజు.

"నా గర్ల్‌ఫ్రెండ్స్ కేథరీన్, ఎలిజబెత్‌లు నన్ను ఎత్తుకుపోతారని భయమా" అంటూనే పెద్దగా నవ్వాడు.

లలితకు రాజు అలా సరదాగా మాట్లాడుతుంటే చాలా సంతోషంగా ఉంది.

"అదికాదే అక్కయ్యా! రోజూ హాస్పిటల్లో నీకు బోరు కొట్టేసి ఉంటుందేమో నువ్వా వస్తే బాగుంటుందని" అంది లలిత.

కమల అంది "డల్లాస్‌నించీ హ్యూస్టన్ దాకా రెండు వందల ఇరవై మైళ్లు మూడున్నర గంటలు కారులో కూర్చునేసరికి నాకు బడలికగా వుంది. ప్రకాష్! ఒక పని చేయండి. సరోజ, లలిత, వినీత, అరవింద, నువ్వూ వెళ్లండి. నేను ఇక్కడే ఈ కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడతాను. రాజుకి ఏదన్నా అవసరమొస్తే చూస్తానులే. మీరు మాత్రం అయిదింటి లోపల వస్తే మంచిది. మనం కనీసం ఏడు గంటలకన్నా డల్లాస్‌కి తిరుగు ప్రయాణం కట్టాలి"

కమల సలహా అందరికీ నచ్చింది.

సరోజ ఐదు నిమిషాల్లో తయారయింది. కమలను రాజుకు తోడుగా ఉంచి అందరూ బయల్దేరారు.

"మీనాక్షి గుడి ఇక్కడికి నలభై మైళ్లు ఉంటుందనుకుంటాను. ట్రాఫిక్ లేకపోతే గంటలో వెళ్లవచ్చు" అన్నాడు ప్రకాష్ కారుని పార్కింగ్ గరాజ్‌లోనించి బయటకు తీస్తూ.

ముందు సీట్లో అతని పక్కనే కూర్చుంది అరవింద.

వెనక సీట్లో వినీత సరోజకు బాగా దగ్గరగా కూర్చుంది. సరోజకు రెండవ పక్క లలిత కూర్చుంది.

"నీకు ఒక్కదానికీ అక్కడ ఎలా వుంది. సారీనే నిన్ను అమెరికా రాగానే అక్కడ వదిలేసి వచ్చాను" అంది సరోజ నొచ్చుకుంటూ.

"నీ ముఖం! అలా మాట్లాడవద్దని చెప్పానా! బావగారికి నయం కావటమే ముఖ్యం. మిగతావన్నీ ఆటలో అరటి పళ్లే" అంది లలిత.

"మేమంతా ఉన్నాంకదా సరోజా! కమలా, సుధా రోజూ ఫోన్‌లో మాట్లాడుతూనే వున్నారు. వంటలు కూడా ఫోన్‌మీదే వండుతున్నారు. మధ్యమధ్యలో వెళ్లి చూసి వస్తున్నాం. వినీత కూడా లలిత దగ్గర బాగా అలవాటు పడింది. నువ్వేమీ దిగులు పడకు" అన్నాడు ప్రకాష్.

దారిలో వినీత సరోజతో స్కూలు విశేషాలు ఆపకుండా చెబుతూనే వుంది.

మీనాక్షి గుడిలో రాజు పేర అష్టోత్తరం చేయించింది సరోజ. రాజుకోసం కొంత కుంకుమ, విభూతి జిప్‌లాక్ సంచిలో తీసు




కుంది.

గుడి బయటకు వచ్చి ఒక చెట్టు కింద గడ్డిమీద కూర్చున్నారు అందరూ. చెట్లమీదుగా చల్లటి గాలి వీస్తోంది. అందరూ స్వెట్టర్లూ, విండ్ బ్రేకర్లూ వేసుకోవటంవలన కొంచెం చలి అనిపిస్తున్నా ఆహ్లాదకరంగా ఉంది.

"ఈ గుడి చాలా బాగుందే. గోపురం అదీ అచ్చం మనవేపు గుడిలా వుంది" అంది లలిత మెచ్చుకుంటూ.

"అవును ఇది 1982లో పూర్తయింది. మధురనించీ, తిరుపతినించీ శిల్పులనూ, పనివాళ్లనూ ఇక్కడకు రప్పించి ఈ గుడి కట్టారు. ఈ ప్రదేశాన్ని పీర్‌లాండ్ అంటారు. హ్యూస్టన్ నగరానికి దక్షిణాన ఉందన్న మాట. మొదట్లో ఈ చుట్టుపక్కల ఇళ్లవాళ్లు ఈ గుడి ఇక్కడ కట్టకూడదని కొంత గొడవ పెట్టారుట కానీ తర్వాత ఏ సమస్యలూ లేకుండా అంతా సవ్యంగా జరిగిపోయింది" అన్నాడు ప్రకాష్.

సరోజ ప్రసాదం అందరికీ ఇచ్చింది.

"ఇది పేరుకి మీనాక్షి గుడికానీ చూశావు కదా ఇక్కడ వేంకటేశ్వరస్వామీ, గణపతి, రాముడు, కృష్ణుడు, అయ్యప్ప అందరూ వున్నారు. అన్ని ఇష్టదైవాలూ ఉన్నారిక్కడ" అంది సరోజ లలితతో.

"దీనికయిన ఖర్చు ఎవరు పెట్టుకుంటారు" అడిగింది లలిత.

"ఇంకెవరు మనవాళ్లే. అందరూ తలో చేయీ వేశారు. వేస్తున్నారు. చాలామంది ధనవస్తు సహాయమే కాకుండా శనాదివారాలు ఇక్కడికి వచ్చి చాలా శ్రమదానం చేశారు. ఇప్పటికీ కూడా శెలవులున్నప్పుడల్లా ఇక్కడికి వచ్చి ఎన్నో పనులు చేస్తూనే ఉంటారు. ఇక్కడే పిల్లలకు ఉత్సాహకరమైన కార్యక్రమాలు నిర్వహించటం, రకరకాల పండుగ వేడుకలు చేసుకోవటం చాలా బాగుంటుందిక్కడ" అన్నాడు ప్రకాష్.

"అవును. ఇంత దూరం వచ్చి కూడా మన మతం, సంప్రదాయం మరచిపోకుండా వ్యయ ప్రయాసలకు ఓర్చి గుడి కట్టడం, ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించటం చాలా బాగుంది. ఇక్కడ చాలా ప్రశాంతంగా వుంది కూడాను" అంది లలిత.

★ ★ ★

హాస్పిటల్లో రాజు మందుల ప్రభావంవల్ల నిద్రలోకి జారుకున్నాడు.

కమల కూడా అలసిపోయి ఉన్నదేమో కుర్చీలో వెనక్కి ఆనుకుని పడుకుంది. చదువుతున్న పుస్తకం చేతిలోనించి జారి కిందపడింది.

ఇంతలో ఫోన్ మోగింది. చటుక్కున కళ్లు తెరిచి ఫోన్ అందుకున్నది కమల. రాజు కూడా ఆ శబ్దానికి కళ్లు తెరిచాడు.

"కమలా నేను సుధని"

సరోజా వాళ్ళు గుడికి వెళ్ళారని చెప్పింది కమల.

"ఉండు. ఫోన్ రాజుకి ఇస్తాను. మాట్లాడుదువుకాని" అంది కమల ఫోన్ రాజుకి అందిస్తూ.

ముందుగా సుధ, తరువాత సురేష్, రాజు యోగక్షేమాలు కనుక్కున్నారు.

ఫోన్ పెట్టేశాక అన్నాడు రాజు కమలతో, "మీరందరూ చాలా సహాయం చేస్తున్నారు. మీమధ్య నాకెంత ధైర్యంగా ఉంటుందో తెలుసా"

కమల నవ్వింది "మీరంత ఫార్మల్‌గా ఉండనవసరంలేదు. ప్రకాష్‌కి ఒంట్లో బాగా లేకపోతే మీరు సహాయం చేయరా? మీరు మా పక్కనే నిలబడరా? " అంది.

"తప్పకుండాను. కానీ ప్రకాష్‌కే కాదు. ఇంకెవరికీ ఇలాంటి వ్యాధి రాకూడదు" అన్నాడు రాజు సాలోచనగా.

కమల చటుక్కున రాజుకేసి చూసింది.

ఒక్కక్షణం ఆగి అంది. "మీరు ఇందాక లలితతో ఈ వారం రోజుల చికిత్సతోనూ పరిస్థితి మెరుగవుతున్నట్టుందని అన్నారు.

అంతేకాదు, మీ ముఖం కూడా చాలా తేటగా కనిపిస్తున్నది నాకు. మీకు త్వరలో తగ్గిపోతుందని నాకు బాగా అనిపిస్తున్నది"

రాజు నవ్వి ఊరుకున్నాడు.

"మీరు ఏమన్నా తింటారా? " అడిగింది కమల.

"వద్దు. అక్కడ ఆరెంజ్ జ్యూస్ ఉంది. కొంచెం ఇవ్వండి చాలు. మీరు కూడా జ్యూస్‌కానీ, కోక్‌కానీ తాగండి. కాఫీ కావాలంటే కింద కేఫ్‌టేరియాలో దొరుకుతుంది" అన్నాడు రాజు.

జ్యూస్ ఇస్తూ అడిగింది కమల "మీరు ఎక్సర్‌సైజ్ ఏమన్నా చేస్తున్నారా రోజూ" అని.

"నేనూ సరోజా రోజుకి నాలుగైదుసార్లు కారిడార్‌లోనూ, మధ్య మధ్యలో అలా మెట్ల మీదుగా కిందకు వెళ్ళి పైకి రావటంలాంటివి చేస్తున్నాము. కింద జిమ్, స్విమ్మింగ్ పూల్ కూడా ఉన్నాయి. కాకపోతే ఇంకా అక్కడికి వెళ్ళటం మొదలుపెట్టలేదు.

కొంచెంసేపయిన తర్వాత హఠాత్తుగా అన్నాడు రాజు. "కమలా మీరు నాకొక ప్రామిస్ చేస్తారా? "

"ఏమిటి? " ఆశ్చర్యంగా అడిగింది కమల.

"ఒకవేళ నాకేదన్నా జరిగితే అప్పుడు సరోజకూ, వినీతకూ కనీసం కొన్నాళ్ళు చాలా అండ కావాలి. సరోజ మనసు బాగా తెలిసిన వ్యక్తిగా మీరు ఆమె పక్కన నిలబడాలి. ఆమెకు ధైర్యం చెప్పి నేను లేని బాధ ఆమె మరచిపోయేలా చేయాలి. మీ దంపతులిద్దరూ ఆ మాత్రం సహాయం చేయగలరా? " సూటిగా అడిగాడు రాజు.

"రాజూ అంతా సవ్యంగా జరుగుతున్న ఈ సమయంలో ఆ అనుమానం ఎందుకు వచ్చింది. అంతదాకా వస్తుందని నేను అనుకోను" అంది కమల, అతని మాటలకు చలించిపోతూ.

రాజు దృఢంగా అన్నాడు, "ఒకవేళ నాకు ఆయువుతీరిందనుకో ఓన్లీ ఇఫ్ ఇట్ హాపెన్స్"

"అలా జరిగినా జరగకపోయినా నా మనసులోని మాట చెబుతున్నాను. సరోజకు ఎప్పుడు ఏ అవసరం వచ్చినా పక్కనే వుంటాను. సరోజ, వినీతల సుఖంకోసం నేనూ, ప్రకాష్ ఏదన్నా చేస్తాం అని మాట ఇస్తున్నాను. సరేనా!" రాజు చాపిన చేతిలో చేయివేస్తూ అంది కమల. ఆ మాటలు అంటుంటే కమల గొంతు బొంగురుపోయింది.

రాజు కళ్ళు మూసుకున్నాడు.

"థాంక్స్... కమలా థాంక్స్" అన్నాడు.

కమల రాజుని చూస్తూ అలానే కూర్చుంది.

కొంచెంసేపట్లో సరోజ, లలిత, ప్రకాష్ పిల్లలతో తిరిగివచ్చారు.

రాత్రి ఏడు గంటలకు లలిత, వినీత, అరవిందలతో బయల్దేరారు కమలా, ప్రకాష్‌లు.

"నేను మళ్ళీ ఫోన్ చేస్తానులే" అన్నాడు ప్రకాష్.

"లలితని, వినీతని మేము జాగ్రత్తగా చూసుకుంటాంలే, నువ్వు దిగులుపడకు" అంది కమల.

★ ★ ★

ఇంకొక పదిరోజులు గడిచాయి.

సరోజ, లలితల మధ్య ఫోన్‌కాల్స్ నడుస్తూనే వున్నాయి.

రాజుకి వైద్యం అనుకున్న ప్రకారం జరుగుతూనే వుంది. రెండు రోజులకొకసారి, డాక్టర్ హోల్‌మన్ వచ్చి రాజుని పరీక్షించి వెడుతూనే ఉన్నాడు. అంతకుముందు మూడు రోజులనించీ దాదాపు ప్రతిరోజూ వస్తూనే వున్నాడు. రకరకాల పరీక్షలు చేస్తున్నాడు.

రాజుకి మాత్రం రెండు మూడుసార్లు కడుపునొప్పి ఎక్కువగా రావటం, చాలా బాధ పడటం జరిగింది కానీ అంతకన్నా వేరే ఆదుర్దా పడవలసిన సంఘటనలేవీ జరగలేదు.




ఆరోజు మధ్యాహ్నం నారాయణ ఆఫీసులో పనిచేసుకుంటుండగా సరోజ అతనికి ఫోన్ చేసింది.

"నారాయణగారూ మీరు బిజీగా లేకపోతే ఒక్కసారి హాస్పిటల్‌కి రాగలరా? " ఆమె గొంతులో ఆదుర్దా తెలుస్తూనే వుంది.

"బిజీగానే ఉన్నానుకానీ అవసరమైతే తప్పకుండా వస్తాను. రాజుగారికి ఎలా వుంది? " అడిగాడు నారాయణ.

సరోజ ఒక్క క్షణం మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా అంది.

"ఇప్పుడే డాక్టర్ హోల్‌మన్ వచ్చి చూసి వెళ్ళాడు. మళ్ళీ ఒక గంటలో వస్తానన్నాడు. రాజుని... రాజుని... నారాయణ గారూ! మీరు వెంటనే రాగలరా? " ఆమె గొంతు జీరబోయింది.

"ఇప్పుడే బయల్దేరుతున్నాను. ఇరవై నిమిషాల్లో అక్కడ ఉంటాను. మీరేమీ గాభరా పడకండి" అని తన సీటులోనించి చటుక్కున లేచాడు నారాయణ.

మేనేజర్‌తో అత్యవసరమైన పనిమీద తను బయటకు వెడుతున్నానని చెప్పి



హాస్పిటల్‌కి బయల్దేరాడు.

నారాయణ హాస్పిటల్లో రాజు గదిలోకి అడుగుపెట్టేసరికి సమయం మధ్యాహ్నం మూడు గంటలయింది.

రాజు మంచంమీద కాక పక్కన కుర్చీలో కూర్చుని వున్నాడు. సరోజ మంచంమీద కూర్చుని వుంది. రాజు సరోజ చేతిని పట్టుకుని ఏదో అంటున్నాడు. ఆమె కళ్లల్లో నీళ్లు.

గాభరాగా అడిగాడు నారాయణ. "ఏం జరిగింది. డాక్టర్ ఏమన్నాడు? "

సరోజ ఏదో చెప్పబోయింది కానీ నోటినించి మాట బయటకు రాలేదు.

రాజు "రండి. అలా కూర్చోండి" అని నారాయణతో అని, సరోజవేపు తిరిగి ఆమె భుజంమీద చేయి వేశాడు.

ఒక్కక్షణం ఆగి అన్నాడు. "ఇందాక డాక్టర్ హోల్‌మన్ వచ్చాడిక్కడికి. గత నాలుగురోజుల్లోనూ చాలా పరీక్షలు చేశారు. ఇవాళ పొద్దున్నే ఆయన తన టీమ్ ఆఫ్ డాక్టర్స్‌తో చిన్న మీటింగ్ పెట్టారుట. వాళ్ళు చివరకు నిశ్చయించిన దేమిటంటే"

చెప్పటం ఆపి కళ్లు మూసుకుని మళ్ళీ అన్నాడు రాజు. "కడుపులో కాన్సర్ అనుకున్నదానికన్నా వేగంగా వ్యాపిస్తున్నదనీ, ఇంతవరకూ జరిగిన వైద్యం ఏమీ ఫలించటంలేదనీ అన్నాడు. మళ్ళీ ఇంకొక గంటలో వచ్చి మాట్లాడతానన్నాడు"

సరోజ ఎంత ధైర్యంగా ఉందామనుకున్నా ఆమె దుఃఖం ఆగలేదు. వెక్కి వెక్కి ఏడ్చింది. రాజు ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

నారాయణకు ఏమనాలో తోచలేదు. ఇంతలో కారిడార్‌లో చేతిలో పాడ్‌తో నడిచివస్తున్న డాక్టర్ హోల్‌మన్ కనపడ్డాడు.

"డాక్టర్‌గారు వస్తున్నారు" అన్నాడు.

సరోజ లేచి కళ్లు తుడుచుకుంది.

డాక్టర్ హోల్‌మన్ వచ్చి అందర్నీ విష్ చేశాడు. నారాయణకు షేక్‌హాండ్ ఇచ్చాడు.

గొంతు సవరించుకుని అన్నాడు. "ఇందాక చెప్పానే... మేము చేస్తున్న వైద్యం ఏమాత్రం పనిచేయటంలేదని కాన్సర్‌కి జరిగే చికిత్సలన్నీ చేశాం. ఫెడరల్ డ్రగ్ అడ్మినిస్ట్రేషన్‌వారు అనుమతించిన మందులన్నీ వాడాం. ఆ మందులూ, పద్ధతులూ అన్నీ ఏమీ లోపం లేకుండా జరిగాయి. అంతేకాక మా రీసెర్చిలో భాగంగా వేరే మందులూ పద్ధతులూ కూడా ప్రయోగాత్మకంగా వాడి చూశాం. అవేమీ ఫలించకపోవటం మన దురదృష్టం. ఏదిఏమైనా ఇక మనం చేయగలిగిందేమీ లేదని నా అభిప్రాయం"

నారాయణ అడిగాడు "ఇదే వైద్యం కొంచెం డోసు పెంచో లేక వేరేచోట..."

డాక్టర్ హోల్‌మన్ నారాయణ భుజం మీద చేయివేసి అన్నాడు. "అలాటివి చాలా చేయవచ్చు అయినా వాటివల్ల ఏమీ లాభంలేదని రెండుసార్లు నిరూపింపబడింది. డల్లాస్‌లోనూ ఇక్కడా. రాజుకి ఆయువు త్వరలో తీరే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ఆ కొద్దివారాలు హాస్పిటల్లో ఉండే బదులు ఇంటి దగ్గర కుటుంబ సభ్యులతో ప్రశాంతంగా గడపటం మంచిదని నా ఉద్దేశం. నేను ఇంటి దగ్గర అవసరమైన నర్సింగ్ సర్వీసెస్, ప్రిస్క్రిప్షన్లూ ఇస్తాను. ఇంకా ఏదయినా అవసరమైతే అక్కడ డాక్టర్ బర్చ్ ఉన్నారుకదా. ఆయన చూస్తారు"

"అంతకుమించి మనం చేసేదేమీ లేదా? " అడిగాడు నారాయణ.

డాక్టర్ హోల్‌మన్ నెమ్మదిగా అన్నాడు. "దురదృష్టవశాత్తూ... లేదు"

ఒకచేయి రాజు భుజంమీదా, ఇంకోచేయి సరోజ భుజంమీదా వేసి మృదువుగా వత్తాడు.

రాజు అడిగాడు "అయితే డల్లాస్‌కి వెళ్ళి





పోవటం"

"అవును. అదే మంచిది. మీ ఫైలు కాపీ లుతీసి మీకు ఇవ్వమని ఆఫీసులో చెప్పాను. ఇంకొక నాలుగురోజుల్లో క్రిస్మస్ పండగ కూడా వుంది. మీరు, మీ కుటుంబసభ్యులతో, మిత్రులతో ఆనందంగా గడపండి. జరగబోయేదానికి వగచి వేశారే కన్నా పరిస్థితులకు సిద్ధమయి శేషజీవితాన్ని కావలసినవారితో, కావలసిన విధంగా గడపటం వివేకవంతుల లక్షణం" అన్నాడు డాక్టర్ హోల్‌మన్.

రాజుని కావలించుకుని కొన్ని క్షణాలు అతని వీపుమీద ఆప్యాయంగా నిమిరాడు.

సరోజను దగ్గరకు తీసుకుని ఆమె నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

నారాయణతో కరచాలనం చేసి, "ప్లీజ్ టేక్ కేర్ ఆఫ్ దెమ్" అన్నాడు.

అని చకాచకా వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళగానే భోరుమని ఏడ్చింది సరోజ రాజు అక్కునజేరి.

ఆమె తలని, రాజు తన భుజానికి హత్తుకున్నాడు.

కొంచెంసేపు ఆగి అన్నాడు రాజు.

"సరోజా ఇక మనం నాకు తగ్గిపోతుందని, నేను బతికి బయటపడతాననీ మనల్ని మనం మభ్యపెట్టుకోవడం అనవసరం. దానివల్ల ఏమీ ప్రయోజనం లేదు కూడా. మనమందరం ముఖ్యంగా నువ్వూ, నేనూ, వినీతా నా ప్రయాణానికి సిద్ధమవటం అవసరం"

సరోజ రాజు గుండెలమీదపడి వెక్కివెక్కి ఏడ్చింది.

"రాజు వెళ్ళిపోవటానికి వీల్లేదు" అని పదే పదే అంటూ విలవిల్లాడింది.

నారాయణ పక్కకు తిరిగి కళ్ళు తుడుచుకున్నాడు.

రాజు అన్నాడు. "సరోజా డాక్టర్ చెప్పింది అక్షరాలా నిజం. ఇది జరగదు. వాళ్ళేదో అబద్ధం చెబుతున్నారు అనుకోవటం భావ్యం కాదు. ఇలాంటి వ్యాధికి మరణమే చికిత్స అని తెలిసీ తెలియనట్టు నటించవద్దు మనం. ఈరోజునించీ మనం చేయవలసిన ముఖ్యమైనపని ఒకటివుంది. నేనూ, నువ్వూ, వినీతా నా జ్ఞాపకాలు చిరకాలం నిలిచి ఉండేలా నా శేషజీవితాన్ని గడపటం. మిగిలివున్న ఈ కొద్దిరోజులూ, నా జీవితంమీద నాకు ఎనలేని తృప్తిని కలిగించేలా చేసుకోవటం" ఒక్కక్షణం ఆగాడు రాజు.

రాజు గుండెలమీదనించి తల పైకెత్తి కన్నీళ్లు నిండిన కళ్ళతో, అతన్ని వింతగా చూసింది సరోజ.

నారాయణ రాజు దగ్గరికి వెళ్ళి అతని భుజం తట్టాడు. రాజు చెప్పిన మాటలు ఆ సమయంలో చెప్పటం ఎంతో అవసరమైనందుకూ అంత బాధలోనూ అతను ఎంతో వివరంగా చెప్పినందుకూ అన్నిటికీ మించి అతని పక్కనే మేమందరం ఉన్నామనే అర్థం వచ్చేటట్టూ.

సరోజ మనసులో ఆలోచనలు ఉవ్వెత్తుగా పైకి లేస్తున్నాయి. ఆ ఆలోచనల మధ్య గుండె దిటవు చేసుకోటానికి ప్రయత్నం చేస్తోంది.

నారాయణ రాజుతో అన్నాడు "రాజు గారూ ఇప్పుడేం చేద్దాం"

రాజు అదోరకంగా నవ్వాడు. "మనకి వేరే మార్గం వుందని అనుకోను. రేపు శుక్రవారం కనుక మీ ఆఫీసు అయిపోగానే మేము కూడా మీతోపాటూ డల్లాస్ వచ్చేస్తాం. ఇక్కడ దుకాణం కట్టేసి"

సరోజ చటుక్కున తల ఎత్తింది.

"అవును సరోజా. అదే మంచి పద్ధతి. నేనూ, నువ్వూ, వినీత, లలిత అందరం కలిసి గడుపుదాం. నా శేషజీవితాన్ని ప్రశాంతంగా గడుపుదాం. అంతేకాకుండా నేను చేయవలసిన ముఖ్యమైన పనులు చాలా మిగిలిపోయాయి" అన్నాడు రాజు.

ఈసారి నారాయణ చటుక్కున తల ఎత్తి

రాజుని విచిత్రంగా చూశాడు. వెంటనే తమాయించుకుని అన్నాడు.

"రేపు లంచ్ కాగానే వెళ్ళిపోదాం. నేను రెండు వారాలనించీ రోజూ రాత్రి ఎనిమిది దాకా ఆఫీసులో పనిచేస్తూనే ఉన్నాను. ఐ యామ్ ఎహెడ్ ఆఫ్ మై స్కెడ్యూల్స్. కనుక ఫరవాలేదులెండి. మధ్యాహ్నం వెళ్ళ వచ్చు"

"నేను రాత్రికి లలితకు ఫోన్‌చేసి చెబుతాను, వచ్చేస్తున్నామని" అన్నాడు రాజు.

"మనం వెళ్ళేలోగా ఒక్కసారి సురేష్ డాక్టర్ హోల్‌మన్‌తో మాట్లాడితే మంచిదేమో" అన్నాడు నారాయణ.

"నేను సురేష్‌కి ఫోన్‌చేసి చెబుతాను ఆ విషయం" అన్నాడు రాజు.

సరోజ నెమ్మదిగా అంది "నారాయణ గారూ! డల్లాస్ వెళ్ళేలోగా నేనూ, రాజూ ఒక్కసారి మీనాక్షి గుడికి వెడితే బాగుంటుందని వుంది నాకు. తీసుకువెడతారా? "

"అయ్యో అదేమిటండీ అలా అడుగుతారు. తప్పకుండాను. ఇప్పుడెలాగూ నాలుగు దాటింది. ఇంకా మళ్ళీ ఆఫీసుకి వెళ్ళటం అనవసరం. ఇప్పుడే వెడదాం. మీరు తయారవండి. ఈలోగా నేను మా ఆఫీసుకి ఫోన్‌చేసి రావటం లేదని చెబుతాను" అన్నాడు నారాయణ.

నారాయణ ఫోన్‌చేసి వచ్చేసరికి, రాజూ సరోజా సిద్ధంగా ఉన్నారు.

ఫేనిన్ రోడ్డుమీదుగా 610 లూప్‌మీదకు వెళ్ళి అక్కడినుంచి 288 రోడ్డుమీదకు తిప్పి పీర్‌లాండ్ వేపుకి కారు నడిపాడు నారాయణ.

ఆ ట్రాఫిక్‌లో మీనాక్షి గుడికి చేరేసరికి దాదాపు ఆరు గంటలయింది. డిసెంబర్ నెల సాయంత్రాలు కావటంవల్ల అప్పటికే చీకటి పడుతోంది. చల్లగా, హాయిగా, ప్రశాంతంగా వుంది.

సరోజ రాజు పేరుతో పూజ చేయించింది. రాజు ఇద్దరి పేర్లూ చెప్పించాడు.

నూటపదహారు డాలర్లకు గుడి పేరున చెక్కు రాసి ఇచ్చింది సరోజ.

ముగ్గురూ బయటికి వచ్చి పక్కనే వున్న గడ్డిలో కూర్చున్నారు.

"ఇక్కడ చాలా ప్రశాంతంగా వుంది కదూ" అన్నాడు నారాయణ.

"అవును మనసు బాగా లేనప్పుడు ఇక్కడకు వచ్చి కాసేపు ఈ చల్లటి గాలి గుండెలనిండా పీల్చుకుంటే అన్నీ మరచిపోతాం" అంది సరోజ.

అంటూనే చేతిలోని ప్రసాదాన్ని రాజుకీ, నారాయణకీ అందించింది.

ప్రసాదం తిని, రాజు గడ్డిమీద ఆకాశం వేపు చూస్తూ పడుకున్నాడు.

నారాయణ పక్కనే గాలికి ఊగుతున్న గులాబీలను చూస్తున్నాడు.

సరోజ రాజునే దీక్షగా చూస్తూ ఆలోచనలో పడింది.

రాజు హఠాత్తుగా అడిగాడు "నారాయణ గారూ! అసలు మనుష్యులకు పుట్టుకనిచ్చిన దేవుడు, చావునెందుకు సృష్టించాడంటారు? "

ఒక్కక్షణం ఆలోచించాడు నారాయణ. తర్వాత నెమ్మదిగా అన్నాడు.

"నేను భగవద్గీత అక్కడక్కడా చదివానే కానీ మీలాగా గట్టిగా చదివినవాణ్ణి కాదు. మీ ప్రశ్నకు సరైన జవాబు నేను ఇవ్వలేనని నాకు తెలుసు. అయినా సాహిత్యంతో పరిచయం ఉన్నవాడిగా ఒక్క మాట చెబుతాను. చాలా సంవత్సరాల క్రితం సముద్రాల రాఘవాచార్యగారు ఒక పాట రాశారు. దానిలో ఆయన కళ్ళకు కనిపించే ఎండమావులు చేతికెందుకు అందవనీ, సోయగమున్నా కొన్ని బతుకులకు సుఖమెందుకు ఉండదనీ ప్రశ్నిస్తారు. అలాగే భూమినించి పుట్టిన చెట్లకు కాసిన అన్ని పళ్ళలోనూ కొన్ని తినటానికి ఎందుకు పనికిరావనీ, మనసున నిండికూడా కొన్ని తలపులు బయటికెందుకు రావనీ అడుగు

తారు. తర్వాత సృష్టిలో ఒకదాన్నొకటి వ్యతిరేకించే విషయాలను తీసుకుని ఆ సృష్టిని చేసిన భగవంతుడ్ని నాశనాన్ని ఎందుకు సృష్టించావని ప్రశ్నిస్తారు. ఇందాక మీరు అడిగారే అదే ప్రశ్న మనుషులకు జీవితాలిచ్చిన దేవుడు చావునెందుకు సృష్టించాడని, అలాగే పలుకు నిచ్చినవాడివి మూగలనెందుకు పుట్టించావనీ, కనులనిచ్చినవాడివి గుడ్డివాళ్ళనెందుకు సృజించావనీ, వెలుగు నిచ్చినవాడివి చీకటినెందుకు సృష్టించావనీ ఆయన అడుగుతారు" అన్నాడు నారాయణ.

"అవును... ఆ పాట నాకు బాగా గుర్తుంది. భానుమతి పాడిందికదా" అన్నాడు రాజు.

"అవును... ఆ పాట చివరలో ఆయన అంటారు. ఎన్నో వేదశాస్త్రాలు చదివినవాళ్ళకే ఈ చావు పుట్టుకల సృష్టివిలాసం సంగతి పూర్తిగా అర్థంకాలేదు. అలాటిది బతుకంతా పలు ప్రశ్నలతో బతికేమనమెంత. బదులుకోసం వెతకటం మానేసి బతకటమే న్యాయం అంటాడాయన" అన్నాడు నారాయణ.

"అంటే... ఆ సృష్టి రహస్యం తెలుసుకోటానికి ప్రయత్నం చేయవద్దనా? ఈ హేతువాత ప్రపంచంలో అది మంచి సలహాయేనంటారా? " అడిగాడు రాజు.

చిన్నగా నవ్వాడు నారాయణ. "కాదు. అక్కడ చెప్పినదది కాదని నా ఉద్దేశం. ఆ ప్రశ్నలకు జవాబు అంత సులభంగా దొరికేది కాదనీ, ఆ జ్ఞానసముపార్జన కోసం మామూలు మనిషి ఒక జ్ఞాని అవాలనీ, అతని తెలివితేటలు ఆ పరిధులు దాటాక ఆ ప్రశ్నలకు జవాబులు వాటంతటవే తెలుస్తాయనీ. అంతర్లీనమయిన ఆ అర్థం భగవద్గీతలో కూడా వుంది. ఆ ప్రశ్నలకు జవాబులు దొరికేదాకా అశాంతితో బతకవద్దని కూడా ఆ రచయిత అభిప్రాయం కావచ్చు" అన్నాడు.

"అవును బాగా మండుతున్న అగ్ని కట్టెలను ఎలా భస్మం చేస్తుందో, అలాగే జ్ఞానమనే అగ్ని సర్వకర్మలనూ నాశనం చేస్తుందంటాడు భగవద్గీతలో. ఈ ప్రపంచంలో జ్ఞానంతో సరితూగే పవిత్రమైన వస్తువు మరొకటి లేదనీ, ఆ జ్ఞానం కలిగిన వెంటనే పరమశాంతి లభిస్తుందని అంటాడు కృష్ణుడు భగవద్గీతలో" రాజు ఆ మాటలు అని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

సరోజ అతని ఆలోచనా సరళిని గమనిస్తూ అతన్నే కన్నార్పకుండా చూస్తూ కూర్చుంది.

కొంచెం సేపయిన తర్వాత "బాగా చీకటి పడింది. ఇక వెళ్దామా" అన్నాడు నారాయణ.

"పదండి" అంది సరోజ లేస్తూ.



రాజునీ, సరోజనీ హాస్పిటల్లో దించి మర్నాడు పొద్దున్నే పదకొండు గంటలకు వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు నారాయణ. అతను వెళ్ళాక రాజు డల్లాస్‌లో సురేష్‌కి ఫోన్‌చేసి జరిగిన విషయమంతా చెప్పాడు.

సురేష్‌కి ఆ వార్త విభ్రాంతి కలిగించకపోయినా కొంచెం ఆశ్చర్యం కలిగించింది. అతను డాక్టర్ హోల్‌మన్ ఇంకా కొన్నాళ్ళ

ప్రయత్నం చేస్తాడని అనుకున్నాడు. ఒక్క క్షణం ఆలోచించాక ఆయన ఆంతర్యం అర్థమయింది. ఆయన తన పరిశోధనలవల్ల ఏమీ లాభంలేదనే నిర్ణయానికి వచ్చివుంటాడనీ, రాజుకి ఇక తగ్గదనే నిర్ధారణకు వచ్చి ఆ పరిస్థితిలో రాజు ఆ మిగిలిన కొద్దిరోజులూ తన కుటుంబసభ్యులతో గడపటమే ఉచితమని ఆ నిశ్చయానికి వచ్చివుంటాడని అర్థం చేసుకున్నాడు. అందుకే రాజుతో అన్నాడు.

"నేను రేపు పొద్దున్న ఎనిమిది గంటలకు డాక్టర్ హోల్‌మన్‌తో ఫోన్‌లో మాట్లాడతాను. నేను ఆయనతో మాట్లాడినందువల్ల ఆయన నిర్ణయం మారుతుందని అనుకోను. కాకపోతే ఆయన ఆంతర్యం తెలుస్తుందని. నేను ఆయనతో మాట్లాడాక, మీకు ఫోన్ చేస్తాను. మీరు బయల్దేరేది పదకొండుగంటల తర్వాత కదా" అన్నాడు సురేష్.

"అవును. సురేష్! ప్రకాష్‌తో కూడా చెప్పు ఈ విషయం" అన్నాడు రాజు.

"అలాగే. ఇప్పుడే ఫోన్ చేస్తాను" అన్నాడు సురేష్ ఫోన్ పెట్టేస్తూ.

తర్వాత సరోజ లలితను పిలిచి మర్నాడే ఢల్లాస్ వచ్చేస్తున్న విషయం చెప్పింది.

"పూర్తిగా తగ్గిపోయిందన్నారా? " ఆశగా అడిగింది లలిత.

ఒక్కక్షణం సరోజ బదులు చెప్పలేదు. తర్వాత నెమ్మదిగా అంది, "అలా అనికాదు. ఇక వాళ్ళు చేసేదేమీ లేదన్నట్టుగా చెప్పారు. చూద్దాం ఏమవుతుందో? "

ఆ మాటలు విన్న లలితకు ఒక్కసారిగా మనసు అదోలా అయిపోయింది. వళ్ళంతా చెమటలు పట్టాయి. ఏమనాలో తెలియలేదు.

"ఎవరూ అది అమ్మేనా? " అంటున్న వినీతకు ఫోన్ అందించి పక్కనే ఉన్న సోఫాలో కూలబడింది.

వినీతకు అమ్మా, నాన్నా ఇంటికి వచ్చేస్తున్నారనేసరికి చాలా ఆనందం వేసింది.

"రేపు మీరు ఇక్కడికి రాగానే స్కూలుకి వచ్చి నన్ను పికప్ చేయండి. పర్మిషన్ తీసుకుని ముందే వచ్చేస్తాను" అంది ఉత్సాహంగా.

"అలాగే" అంది సరోజ, అంతకన్నా వేరే ఏమీ చెప్పకుండా.



మర్నాడు పొద్దున్నే స్నానాలు చేశాక డల్లాస్ వెళ్ళటానికి సామాన్లు అన్నీ సర్దింది సరోజ. మిత్రులూ, శ్రేయోభిలాషులూ పంపించిన గెట్‌వెల్ గ్రీటింగ్ కార్డులన్నీ సూట్‌కేస్‌లో పడేసింది. కింద ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసుకి వెళ్ళి పేపరు వర్కు అంతా పూర్తిచేసుకువచ్చింది. రాజు మెడికల్ రికార్డు అంతా కాపీలు తీసి సిద్ధంగా ఉంచటంతో అవీ తీసుకుంది.

పైకి వచ్చి నర్సింగ్ స్టేషన్ దగ్గరకు వెళ్ళింది. అక్కడ వున్న నర్సులకీ, అందరికీ వెళ్ళిపోతున్నట్టు చెప్పింది.

అప్పుడే కొన్ని పుస్తకాలు తీసుకుని వచ్చారు కేథరీన్, ఎలిజబెత్. వాళ్ళతో కూడా చెప్పింది. ఇకమీదట వైద్యం డల్లాసులో చేయిస్తామని, అందుకే వెళ్ళిపోతున్నామనీ వాళ్ళు చదువుకోటానికి ఇచ్చిన రీడర్స్ డైజెస్ట్‌లాంటి పుస్తకాలను తిరిగి ఇచ్చేసింది. వాళ్ళు చేసిన సహాయానికి ధన్యవాదాలు చెప్పింది.

వాళ్లు వెళ్ళిపోయాక ఈ తతంగమంతా చూస్తున్న రాజు అన్నాడు.

"సరోజా! మనం ఇక్కడ ఉన్నది నాలుగు వారాలు మాత్రమే. అంతలోనే పరిచయం అయినవాళ్ళందరి దగ్గరా వీడ్కోలు తీసుకుంటున్నాం. ఓట్ ఆఫ్ థాంక్స్ చెబుతున్నాం. అందరి దగ్గరా సెలవు తీసుకుంటున్నాం. అలాటిది నేను" ఆ మాటలు అంటున్నప్పుడు రాజు గొంతు వణుకుతున్నది.

సరోజ చటుక్కున లేచి అతని నోరు తన

గాజుల చేత్తో, సుతారంగా మూసింది.

"నాకు తెలుసు నీ ఆలోచన. అంతకన్నా వ్యాఖ్యానం అక్కరలేదు. అనవసరంగా అలా టివి ఆలోచించకు" అంది చిరుకోపంతో.

ఆమె మనసులోని బాధ కోపంగా మారి, అలా బయటకు వచ్చిందని తెలిసిన రాజు ఇక మాట్లాడలేదు.

ఇంతలో ఫోన్ మోగింది. సురేష్.

"రాజూ నేను డాక్టర్ హోల్‌మన్‌తో మాట్లాడాను. ఆయన చెప్పినట్టు మీరు డల్లాస్ వచ్చేయండి. అవసరమైతే మళ్ళీ వెళ్ళవచ్చు. మిగతా విషయాలు ఇక్కడికి వచ్చాక మాట్లాడుకుందాం" అన్నాడు సురేష్.

అప్పుడే అక్కడికి వచ్చాడు నారాయణ.

"అప్పుడే రెడీగా ఉన్నారే" అన్నాడు సర్దిన సామాను చూస్తూ.

"అవును. ఇక వెడదామా? " అన్నాడు రాజు.

సరోజ తలవూపి చేతిసంచి అందుకుంది.

నారాయణ సూట్‌కేస్ తీసుకుని బయటకు నడిచాడు.

★ ★ ★

మధ్యాహ్నం మూడు గంటలకు రాజునీ, సరోజనీ డల్లాస్‌లో వాళ్ళ ఇంటికి దగ్గర దించాడు నారాయణ. సూట్‌కేసు ఇంట్లో పెట్టి "అవసరమైతే పిలవండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఎప్పటినుంచో ఎదురు చూస్తున్నట్టుంది. లలిత బయట కారు ఆగటం చూసి చిరునవ్వుతో ఎదురువచ్చింది.

సరోజ చేతిలోనించి సంచి అందుకుంటూ రాజుతో అంది "పోయినసారి చూసిన దాని కన్నా మీరు బాగా చిక్కిపోయారు"

రాజు చిన్నగా నవ్వి "ఇక్కడ నీకు బాగానే ఉన్నదా. మేం వచ్చేశాంగా ఇంక ఫరవాలేదులే" అన్నాడు.

రాజుకి ఆరెంజి జ్యూస్ ఇచ్చింది సరోజ. అది తాగి మంచంమీద నడుం వాల్చాడు రాజు.

"లలితా! వినీతను తీసుకువద్దాం. స్కూలుకి వెడదాం పద" అంది సరోజ.

వినీత సరోజను చూడగానే పరుగెత్తుకుంటూ వచ్చి వాటేసుకుంది.

ఆరోజు రాత్రి భోజనానంతరం రాజుని చూడటానికి మిత్రులందరూ వద్దామని అనుకున్నారు కానీ రాజు త్వరగా పడుకుంటానని ఎవరినీ రావద్దన్నాడు.

అందరితో అలా అన్నాడు కానీ తన గదిలోకి వెళ్ళి ఏదో రాసుకోవటం మొదలుపెట్టాడు.

సరోజ, లలిత, వినీత ఫ్యామిలీ గదిలో కూర్చుని కబుర్లలో పడ్డారు. సరోజ అతను సీరియస్‌గా పనిచేసుకోవటం చూసిందికానీ అతని పనికి భంగం కలుగుతుందని అక్కడికి వెళ్ళలేదు.

రాజు ఒక గంటసేపు రాసుకుని ప్రయాణ బడలికతో అలసివుండటం వలన వెంటనే నిద్రపోయాడు.

కబుర్లు పూర్తయ్యాక వినీతను పడుకోబెట్టి సరోజ తమ బెడ్‌రూమ్‌లోకి వచ్చింది.

రాజు రాసిన కాగితాలు ఫాన్ గాలికి ఎగిరి కింద పడి వున్నాయి. అవి తీసి బల్ల మీద పెడుతూ, సభ్యత కాకపోయినా, కుతూహలంకొద్దీ ఆ కాగితాలు చదివింది.

దానిమీద "చేయవలసిన పనులు" అని రాసాడు. వరుసగా ఒకటి, రెండు, మూడు... అని నెంబర్లు వేసి ఒక లిస్ట్ తయారుచేశాడు. ఒకటి దగ్గర "వీలునామా" అని రాసివుంది. తర్వాత వరుసగా చాలా రాసి వున్నాయి. వాటిమధ్యలో ఉన్నికృష్ణన్ పేరు కూడా రాసి వుంది. అన్నీ తర్వాత వారం రోజుల్లో పూర్తిచేయాలని రాశాడు. వణుకుతున్న చేత్తో ఆ కాగితాన్ని ఎక్కడ వుందో అక్కడే వుంచి, సరోజ రాజు పక్కనే అతనిమీద చేయివేసి ప్రశాంతంగా వున్న అతని ముఖాన్ని చూస్తూ పడుకుంది.

★ ★ ★

మర్నాడు పొద్దున్న మంచంమీదనించి లేస్తూనే కడుపులో నెప్పి ఎక్కువగా వుందన్నాడు రాజు. సరోజ ఎమర్జన్సీని పిలుస్తానంటే వద్దన్నాడు. డాక్టర్ హోల్‌మన్ ఇచ్చిన టాబ్‌లెట్స్ వేసుకున్నాడు. ఇంటి దగ్గర వాడుకోటానికి ప్రిస్క్రైబ్ చేసిన నర్సింగ్ సర్వీసెస్‌కి ఫోన్ చేయమన్నాడు. సురేష్‌ని కూడా రమ్మని చెప్పాడు.

పిలిచిన పదినిమిషాల్లోనే వచ్చాడు సురేష్. "ఎలా వుంది? " అన్నాడు.

రాజుకి ఆ మాత్రలు వేసుకోగానే నెప్పి కొంచెం తగ్గింది. అదే చెప్పాడు.

"సురేష్! మరీ అత్యవసరమైతే తప్ప, నాకు ఇంక ఏ హాస్పిటల్‌కీ వెళ్ళాలని లేదు. బహుశా ఇంకో గంటలో నర్స్ వస్తుందనుకుంటాను. మాత్రలు, ప్రిస్క్రిప్షన్లు అన్నీ వున్నాయి. ఏమంటావు? "

సురేష్ రాజులోని ఇంకో మనిషిని మొదటిసారిగా చూస్తున్నట్టు చూశాడు. అంతలోనే తేరుకుని అన్నాడు.

"అవును... అదే మంచిది. అవసరమైతే డాక్టర్ బర్చ్‌ని కలవవచ్చు కూడాను. నేనూ దగ్గరలోనే ఉన్నాను కదా" అన్నాడు అతన్నే చూస్తూ.

"సురేష్! నేను చేయవలసిన పనులు చాలా వున్నాయి. వాటిని త్వరలో పూర్తిచేయటానికి, నువ్వూ ప్రకాష్ నాకు సహాయం చేయాలి. చేయగలరా? " రాజు అడిగాడు.

సురేష్ నొచ్చుకుంటూ అన్నాడు.

"అదేమిటి రాజా. మేము ఏంచేయాలో చెబితే... తప్పకుండా చేస్తాము. కాకపోతే... ఇప్పుడు కొంచెం విశ్రాంతి తీసుకోవటం మంచిది. ఈ లోగా నర్సు కూడా వస్తుంది" అన్నాడు సురేష్.

రాజు చిన్నగా నవ్వాడు. "విశ్రాంతా... ఇప్పుడుకాదు. ఇంకో రెండు వారాలు పోనీ. అప్పుడు తీసుకుంటాను. ఇప్పుడు పూర్తిచేయవలసిన పనులు చాలా వున్నాయి" అన్నాడు.

మాట మారుస్తూ సురేష్ అడిగాడు, "ఇప్పుడు నెప్పి తగ్గిందా? " అని.

"ఫరవాలేదు. చాలావరకూ తగ్గింది"

అప్పుడే వచ్చారు ప్రకాష్, కమల, అరవింద.

"వెలకమ్ బాక్ టు డల్లాస్, ఎలా వున్నావు? " అన్నాడు ప్రకాష్.

కమల కూడా "బాగున్నారా? " అని అడిగింది.

"ఇదిగో ఇలా ఉన్నాను" అన్నాడు రాజు బలహీనంగా నవ్వుతూ.

"మీరు బాగా బరువు తగ్గిపోయారు. ముఖంలో చాలా అలసట కనిపిస్తోంది" అంది కమల రాజుని దీక్షగా చూస్తూ.

"గడ్డం బాగా పెరిగిపోయింది. గడ్డం తీసేయ్... ముఖం కాస్త తేటగా ఉంటుంది" అన్నాడు ప్రకాష్.

రాజు మందహాసం చేశాడు.

కమల లోపలికి వెళ్ళింది సరోజ, లలితలతో మాట్లాడటానికి.

"ప్రకాష్! నీకొక లాయర్ తెలుసని చెప్పావ్ కదా. ఆయనకి ఫోన్‌చేసి, ఎల్లుండి సోమవారానికి ఎపాయింట్‌మెంట్ తీసుకుంటావా... వీలునామా రాద్దామనుకుంటున్నాను" అన్నాడు రాజు.

ప్రకాష్‌కి రాజు ఆలోచన వెంటనే అర్థమయింది. అందుకే "సోమవారం పొద్దున్న వాళ్ళు ఆఫీసు తెరవగానే ఫోన్‌చేసి, మధ్యాహ్నానికి ఎపాయింట్‌మెంట్ తీసుకుంటాను. ఇక్కడికి వచ్చి నిన్నూ, సరోజనీ అక్కడికి తీసుకువెడతాలే" అన్నాడు ప్రకాష్.

అప్పుడే సుధ కూడా వచ్చిందక్కడికి. పరామర్శలయాక అంది.

"వచ్చే గురువారం ఇక్కడ క్రిస్‌మస్ పండగ. అందుకని నేనొక ప్రపోజల్ పెడుతున్నాను. మేమూ, ప్రకాష్ కుటుంబం, నారాయణగారి కుటుంబం, వసంత్ ఇక్కడ లంచ్ చేద్దాం. పాట్‌లక్. మనందరం డిషెస్ తీసుకువద్దాం. ఆ రోజున పండగ




సందర్భంగా, ఇక్కడ రాజుగారి ఆధ్వర్యంలో పూజచేద్దాం"

"అయిడియా చాలా బాగుంది. మనం చేసుకునే పండగ కృష్ణమస్ అన్నమాట" అన్నాడు ప్రకాష్ నవ్వుతూ.

"సురేష్! నువ్వు ఆరోజు అఫిషియల్ విడియోగ్రాఫర్‌వి" అంది సుధ.

"అలాగే" అన్నాడు సురేష్.

"రాజుగారు సరే అంటే... లోపలికి వెళ్ళి, ఒక ఎనౌన్స్‌మెంట్ ఇస్తాను" అంది సుధ.

రాజు "అలాగే చేద్దాం" అన్నాడు సుధ మనసులోని ఆంతర్యం అర్థంచేసుకుని.

"ఆరోజు విడియో కోసం గడ్డం చేసుకుని, నువ్వు అన్నట్టు, కొంచెం తేటగా కనిపిస్తాలే ప్రకాష్" అన్నాడు రాజు నవ్వుతూ.

సుధ "థాంక్స్" అని కిచెన్‌లోకి వెళ్ళింది సరోజ, కమలలతో మాట్లాడటానికి.

"థాంక్స్ సురేష్. అలా శుభప్రదమైన పూజా సమయంలో మనందరం కలిసి తీసుకున్న విడియో తర్వాత మీ అందరికీ ముఖ్యంగా సరోజ, వినీతలకు చక్కటి మధురస్మృతిలా చిరకాలం మిగిలిపోతుంది. థాంక్స్" అన్నాడు రాజు.

ఈలోగా నర్స్ వచ్చింది. "నా పేరు మార్గరెట్. నర్సింగ్ సర్వీసెస్‌నించి వచ్చాను" అంది.

రాజుని అతని కడుపునెప్పి గురించి కొన్ని ప్రశ్నలడిగింది. టెంపరేచర్, బ్లడ్‌ప్రెజర్ చూసింది.

"ఒక బాటిల్ సెలైన్ ఇస్తే మంచిది"

అని, బయటకు వెళ్లి కారులోనించి, ఒక స్టాండ్ తదితర సామగ్రి తెచ్చింది. అన్నీ అరేంజ్ చేసి ప్లాస్టిక్ బాగ్‌లోని సెలైన్ అయిపోగానే ఏంచేయాలో, ఎలా అవన్నీ తీసివేయాలో రాజుకీ సరోజకీ చూపించింది. అవసరమైతే పేజ్ చేయమని, నెంబర్ ఇచ్చి వెళ్ళిపోయింది.

ప్రకాష్ తన కారు డిక్కీలోనించి తను తెచ్చిన క్రిస్‌మస్ చెట్టుని లోపలకు తెచ్చాడు.

సరోజ అది చూసి అంది. "ఎప్పుడూ డిసెంబరు మొదటివారంలోనే పెట్టేవాళ్ళం క్రిస్‌మస్ చెట్టు. ఈసారి హ్యూస్టన్ ప్రయాణంతో ఆలస్యమయింది. అసలు ఆ సంగతే మరిచిపోయాను. థాంక్స్ ప్రకాష్" అంది.

లోపలికి వెళ్ళి డెకరేషన్ అయిటమ్స్ వున్న పెట్టె తీసుకువచ్చింది. వినీత, అరవింద, లలిత, కమల, సుధ ఆ చెట్టుని అందంగా అలంకరించారు.

కమల తన హాండ్‌బాగ్‌లోనించి ఒక కాసెట్ తీసి రాజుకి ఇచ్చింది.

"ఇది ఘంటసాల పాడిన భగవద్గీత కాసెట్. ఆయన తన హృదయం విప్పి ఎంతో భావయుక్తంగా పాడిన శ్లోకాలు. నాకెంతో ఇష్టమైనవి. మీరు వింటే మన శ్శాంతిగా ఉంటుందని మీకోసం తెచ్చాను" అంది కమల.

రాజు కృతజ్ఞతా పూర్వకంగా కమలను చూసి, "చాలా థాంక్స్" అన్నాడు.

తర్వాత అందరూ కాసేపు కూర్చుని వెళ్ళిపోయారు.

ఆ మధ్యాహ్నం రాజు ఉన్నికృష్ణన్‌కి ఫోన్ చేశాడు. తన హ్యూస్టన్ ట్రీట్‌మెంట్ వివరాలు చెప్పి, ఇండియానించి మందు వచ్చిందా అని అడిగాడు.

"జనవరి రెండవతారీకున ఎర్నాకులం నించి నా స్నేహితుడు పరమేశ్వరన్‌నాయర్ వస్తున్నాడు. అతనితో మీకు మందు పంపిస్తున్నారు వైద్యయార్ పంకజాక్షన్. మూడవ తారీకు పొద్దున్నే నేను ఆ మందు తీసుకుని మీ ఇంటికి తెచ్చి ఇస్తాను" అన్నాడు ఉన్నికృష్ణన్.

"సరే... చాలా థాంక్స్" అని ఫోన్ పెట్టేశాడు రాజు.

తర్వాత మెడికల్ బిల్స్ అన్నీ ముందువేసుకుని, అన్నీ పరిశీలించి, పంపించవలసిన చెక్స్ అన్నీ రాసి కవర్లలో పెట్టి పోస్ట్‌చేయటానికి సిద్ధంచేశాడు. పక్కనే టేపురికార్డర్‌లో ఘంటసాల భగవద్గీత సన్నగా వినిపిస్తోంది. చేస్తున్న పని అంతా అయ్యాక అలసిపోయి నిద్రపోయాడు రాజు.



శని, ఆదివారాలు ఇండియాకి ఫోన్‌చేస్తే చౌక కనుక, రాజు ముఖ్యులయిన చుట్టాలని, స్నేహితులనీ పిలిచి, చాలాసేపు ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు.

తెనాలిలో రమణతోనూ, అత్తగారితోనూ, లలిత పిల్లతోనూ చాలాసేపు మాట్లాడాడు. లలిత ఎంత సహాయం చేస్తోందో పదేపదే చెప్పాడు. తర్వాత లలిత కూడా మాట్లాడింది. కానీ వాళ్ళకి అసలు విషయం మాత్రం చెప్పలేదు.

రాజు తనతో మాట్లాడిన తర్వాత అతని అక్కయ్య దుర్గ అడిగింది. "ఏమిట్రా, ఈసారి నీ మాటలు చాలా కొత్తగా ఉన్నాయి" అని.

రాజు నవ్వి "కొత్తేముంది. నలభై ఏళ్ళనించి నీతో ఇలాగే మాట్లాడుతున్నాను" అన్నాడు.

"ఏమో... నాకలా అనిపించటంలేదు" అంది దుర్గ ఏదో అనుమానం మనసులో తొలిచేస్తుంటే.

ఫోన్ పెట్టేశాక రాజు తలవంచుకు కూర్చుని బాధపడుతుంటే సరోజ అతనికి దగ్గరగా జరిగి, "మనవాళ్ళమధ్యన వుంటే కొంత బాగుంటుందేమో. మనమందరం ఇండియా వెడదామా?" అని మళ్ళీ అంతలో తనే సర్దుకుని అంది "వద్దులే! ఈ

పరిస్థితిలో నువ్వు ప్రయాణం చేయటం మంచిది కాదు" అంది.

"అవును! ఇక్కడ ఉంటేనే మంచిది. నేను అన్ని గంటలు విమానంలో కూర్చుని, ప్రయాణం చేసే స్థితిలో లేను" అన్నాడు రాజు.

రాజు తలను తన భుజంమీద ఆన్చుకుని, అతని జుట్టుని ఆప్యాయంగా నిమిరింది సరోజ.

★ ★ ★

ఆదివారం పొద్దున్న కంప్యూటర్‌లో తన స్టాక్సు, మ్యూచ్యువల్ ఫండ్సు, బ్యాంక్ బాలన్సులూ, ఇంటి లోన్, కారు లోన్‌లాటి అన్ని విషయాలు సరోజకి చూపించాడు. అన్నీ ఇద్దరి పేర్లమీద ఉన్నాయనీ, తన తదనంతరం అవి కాష్ చేసుకోటానికి ఏమీ సమస్యలు ఉండవనీ చెప్పాడు.

రాజు "నా డెత్ సర్టిఫికేట్ చూపిస్తే చాలు, బ్యాంకులో ఏమీ ఇబ్బందులు రావు" అన్నాడు అనాలోచితంగా.

అప్పటిదాకా తన మనసులోని బాధను ఆపుకుంటున్న సరోజ, ఒక్కసారిగా దుఃఖం తన్నుకువచ్చి బావురుమన్నది. రాజు ఆమెను దగ్గరికి తీసుకున్నాడు.

సోమవారం పొద్దున్న, రాజు తన లైఫ్ ఇన్సూరెన్స్ కంపెనీకి, ఇంటి మార్ట్‌గేజ్ కంపెనీకి, బాంక్‌కీ, వాళ్ళ ఆఫీసు క్రెడిట్ యూనియన్‌కీ ఫోన్‌చేసి చాలాసేపు మాట్లాడాడు. ఆఫీసులో ఎకౌంట్సు డిపార్టుమెంటుకీ, పర్సొనెల్ ఆఫీసుకీ ఫోన్‌చేసి, ఆఫీసు వాళ్ళు ఇచ్చే తన లైఫ్ ఇన్స్యూరెన్స్, డిసెబిలిటీ, తదితర విషయాలు మాట్లాడాడు.

తన మానేజర్ డానీ బేకర్‌కి ఫోన్ చేసి విషయం చెప్పాడు. తనిక బహుశా ఆఫీసుకి రాలేనేమో అన్నాడు. అతనితో చాలా స్నేహపూరితమైన వాతావరణంలో పనిచేయగలిగినందుకు, అతని మంచితనానికి ధన్యవాదాలు చెప్పాడు. ఆ మాటలు విన్న డానీకి నోటమాట రాలేదు. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తను ఆరోజు సాయంత్రమే రాజు వాళ్ళ ఇంటికి వచ్చి కలుస్తానని చెప్పబోతూ, ఆ వాక్యం కూడా పూర్తిచేయలేకపోయాడు డానీ.

ఫోన్ పెట్టేసి, తను కూడా కళ్ళు తుడుచుకున్నాడు రాజు.

ఆరోజు మధ్యాహ్నం రెండుగంటలకు వచ్చాడు ప్రకాష్. రాజునీ, సరోజనీ, లలితనీ లాయర్ ఆఫీసుకి తీసుకువెళ్ళాడు. రాజు తన ఆస్తినంతటిని తన తదనంతరం సరోజకు చెందాలనీ, సరోజ తదనంతరం వినీతకు చెందాలనీ వీలునామాలో రాశాడు. ప్రకాష్, లలిత సాక్షి సంతకాలు చేశారు. దాన్ని నోటరైజ్ చేసి, రెండు కాపీలు రాజుకి అందించాడు లాయర్‌గారు. సరోజ మొదట్లో ఈ విషయాలకు బాధపడినా, గుండె దిటవుచేసుకుని, ధైర్యంగానే ఉంది. లలితకు కూడా అంతా కొత్తగా ఉంది. ప్రతి నిమిషం, సరోజ పక్కనే నిలబడి, ఆమె చేయి పట్టుకుని ఆమెకు అండగా నిలబడింది.

సాయంత్రం ఆరుగంటలకు ఆఫీసునించి సరాసరి రాజు దగ్గరకు వచ్చారు డానీ బేకర్, అమాండా, క్రిస్.

డానీ పెద్ద పూలగుత్తి తీసుకువచ్చాడు. రాజుని కావలించుకుని, రెండుమూడు నిమిషాలు కదలకుండా, మాట్లాడకుండా అలాగే నుంచున్నాడు.

అమాండా ఒక కేక్ తీసుకు వచ్చింది. రాజుని కావలించుకుని, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా అతని బుగ్గమీద ముద్దుపెట్టుకుంది. "ఉయ్ ఆల్ లవ్ యు రాజూ" అంది.

క్రిస్ ఆఫీసులో అందరూ సంతకాలు చేసిన ఒక పెద్ద పోస్టర్‌లాటి గ్రీటింగ్ కార్డు ఇచ్చాడు. రాజుకి ఒక హగ్ ఇచ్చి "మే గాడ్ బ్లెస్ యు" అన్నాడు.

ముగ్గురూ ఒక అరగంట కూర్చుని, రాజుకి ధైర్యం చెప్పి, వెళ్ళిపోయారు.

ఆరోజు రాత్రి ఇంట్లో రాజు, వినీత, సరోజ, లలితలతో చాలా సరదాగా గడిపాడు. మాట్లాడుతూనే, అలసిపోయి నిద్రలోకి జారుకున్నాడు.



క్రిస్మస్‌రోజు పొద్దున్నే పదిన్నరకల్లా వచ్చారు అందరూ. పూజా సామాగ్రితోనే కాక, రెండు కూరలు కూడా చేసి తీసుకువచ్చింది కమల. అలాగే అందరూ ముందే అనుకున్నట్టుగా తలొక వంటకం తీసుకువచ్చారు.

వసంత్ ఇండియన్ షాప్‌నించి స్వీట్లు కొనుక్కొచ్చాడు.

రాజు కూడా పొద్దున్నే గడ్డం చేసుకుని, స్నానంచేసి చాలా ఆరోగ్యవంతంగా కనపడుతున్నాడు.

నారాయణ, శ్యామల కొంచెం ఆలస్యంగా వచ్చారు.

"పూరీలు చేసేటప్పటికి ఆలస్యమయింది" అంది శ్యామల.

"నాచేత వంద పూరీలు వత్తించింది ఇవాళ" అన్నాడు నారాయణ చేతులు విరుచుకుంటూ.

"ఎలెక్ట్రిక్ పూరీ ప్రెస్సర్‌మీదేగా. ఆ మాత్రందానికి అంతగా కూచిపూడి స్టయిల్లో మీరు చేతులు విరుచుకోవటం ఎందుకు?" అంది శ్యామల నవ్వుతూ.

సుధ కన్నడ వంటకం, బెసిబెళ్ళా బాత్ చేసి తీసుకువచ్చింది.

సరోజ అన్నం, పులిహోర, సాంబారు చేసి సిద్ధంగా వుంది.

సురేష్ అందరూ రావటం దగ్గరనించీ విడియో తీస్తున్నాడు. ఎక్కువసేపు రాజు, సరోజ, వినీత, లలితలనే తీస్తున్నాడు.

సరోజ, రాజు, వినీత, లలిత, అరవింద దేవుడిముందర కూర్చుని పూజ చేస్తుంటే కొంచెం వెనగ్గా కూర్చున్నారు కమల, సుధ, శ్యామల. వాళ్ళకు వెనుకగా కూర్చున్నారు ప్రకాష్, నారాయణ.

సరోజ తలమీద స్నానంచేసి పట్టుచీర కట్టుకుని పూజచేస్తుంటే, దిగివచ్చిన మహాలక్ష్మిలా ఉంది రాజు కళ్ళకి.

పూజ చేయటం పూర్తయి ఫ్యామిలీ రూమ్‌లోకి వచ్చాక, రాజుని అడిగాడు సురేష్. "ఎలావుంది ఇప్పుడు?" అని.

"బాగానే ఉంది. నిన్నా ఇవాళా అసలు నొప్పి తెలియలేదు. పొద్దున్న మాత్రం నొప్పి లేకపోయినా ఎందుకైనా మంచిదని, రెండు మాత్రలు వేసుకున్నాను" అన్నాడు రాజు.

తర్వాత భోజనాలు. వసంత్ వేస్తున్న జోకులతో చాలా సరదాగా గడిచింది సమయం.

నారాయణ, ప్రకాష్ ఇండియాలోని రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు.

నారాయణ అన్నాడు, "మన రాజకీయ వినాయకులలో మానవత్వం పూర్తిగా నశించిపోయింది. లంచాలు తినటం, కులాల, మతాల పేరుతో జనాన్ని విడదీసి, తమ స్వార్థంచూసుకోవటం. మనదేశం ఎప్పుడు బాగు పడుతుందంటారు?"

ప్రకాష్ ఏదో అనబోతుంటే రాజు అన్నాడు.

"రాత్రి భగవద్గీతలో విన్నాను. దాంట్లో

కృష్ణుడు అంటాడు. 'ఇంద్రియాణాం హి చరతాం యన్న నోనువిధీయతే, తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి' అని. సుడిగాలి చుక్కాని లేని నావని దిక్కు తోచకుండా చేసినట్టు, ఇష్టానుసారం ప్రవర్తించే ఇంద్రియాలకు లొంగిపోయిన మనస్సు, మనుష్యుని బుద్ధిని పాడుచేస్తుంది అని అర్థం. అలాగే ఇంకొకచోట శ్రీకృష్ణుడు అంటాడు. 'ఎవడు కోరికలు లేనివాడై, పవిత్రుడై, పక్షపాత రహితుడై, భయం వదిలేసి, కర్మఫలత్యాగియై, నాకు భక్తుడవుతాడో, అటువంటివాడు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడవుతాడు అని. ఇక్కడ గమ్మత్తేమిటంటే ఇలాటి వినాయకులంతా పైకి దైవభక్తులమని చెప్పుకుంటారు. మరెందుకు ఆ దేవుడికి ప్రీతిపాత్రులవవలసిన పనులేవీ చేయకుండా స్వలాభాపేక్షతో ఆ సంగతే మరచిపోతున్నారో"

"బాగా చెప్పారు" అన్నాడు నారాయణ.

ప్రకాష్ నవ్వుతూ అన్నాడు, "కమలా... నువ్విచ్చిన భగవద్గీత అప్పుడే బట్టీపట్టేశాడు రాజు. మా ఇంజనీరింగ్ కాలేజీలో కూడా ఇంతే... అన్నీ బట్టీపట్టేసి నూటికి నూరు మార్కులు తెచ్చుకునేవాడు"

రాజు కూడా నవ్వుతూ. "ఆ విద్య నీ దగ్గరే నేను నేర్చుకుంది" అన్నాడు.

అందరూ నవ్వారు.

మూడు గంటలకు కాఫీలు తాగి ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఎలావుంది? అలసటగా ఉందా? " అడిగింది సరోజ, మంచంమీద నడుం వాల్చిన రాజుతో.

"కాసేపు పడుకుంటే ఈ అలసట తీరుతుంది. బట్...ఐ హేడ్ ఎ వండ్రఫుల్ టైమ్" అన్నాడు తృప్తిగా.

సరోజ అతనివేపు ప్రేమగా చూసింది.

★ ★ ★

మర్నాడు సాయంత్రం సరోజ, లలిత కూరలు, పాలు మజ్జిగలాటివి కొనటానికి సూపర్‌మార్కెట్‌కి వెళ్ళారు. వినీత టివి చూస్తూ కూర్చుంది. దాంట్లో వస్తున్న షో నచ్చినట్టులేదు. "బోరుకొడుతోంది" అంది రాజుతో.

రాజు వినీతను దగ్గరకు తీసుకుని నెమ్మదిగా అడిగాడు.

"నేను ఇంకా ఎక్కువ రోజులు ఉండను. నీకు గుర్తుందా ఆ విషయం"

వినీత తన పెద్ద కళ్ళను విప్పార్చి చూసి, "గుర్తుంది. ఇంకెక్కడా నయం చేయటం కుదరదని అన్నారా? " అని అడిగింది.

"అవును... ఇక మనం చేసేదేమీలేదు" అన్నాడు రాజు.

వినీత ఒక్కక్షణం ఏదో ఆలోచించి, అతనికి బాగా దగ్గరగా జరిగి, అతనికి హత్తుకుపోయింది.

"వినూ! అమ్మ నీకు హోంవర్క్‌లోనూ, ఇంటి దగ్గరా బాగా సహాయం చేస్తుందిలే. నువ్వు మాత్రం బాగా చదువుకోవాలి"

"నేను డాక్టర్‌నవుతాను. కాన్సర్‌లో రీసెర్చిచేస్తాను" అంది వినీత.

"తప్పకుండాను. నువ్వు మంచి తెలివైనదానివి. బాగా చదువుకుని, డాక్టరయి, కాన్సర్‌లో రీసెర్చిచేయాలి. అప్పుడే అమ్మకి తృప్తిగా ఉంటుంది"

"మరి నీకు? "

"నాక్కూడాను. మన హిందూ మతం ప్రకారం నా శరీరం పోతుందేకానీ నా ఆత్మ బతికే ఉంటుంది. నేను అన్నీ పైనించి చూస్తూనే ఉంటాను"

"హిందూ మతంలోనేకాదు, ఇక్కడ కూడా అంతే. మే యువర్ సోల్ రెస్ట్ ఇన్ పీస్ అంటారందుకే"

"అలాగా... అవును. నువ్వు చెప్పింది నిజమే"

వినీత తల పైకెత్తి రాజు బుగ్గమీద ముద్దుపెట్టుకుని, "ఐ లవ్ యు డాడీ" అంది.

రాజు కాసేపు మాట్లాడలేకపోయాడు.

మౌనంగా వినీతనే చూస్తూ కూర్చున్నాడు.

వినీత రాజు చేయి పట్టుకుని, మృదువుగా నిమిరసాగింది.

"వినూ! అమ్మ ఒక్కత్తే ఇంటిపనితో, ఆఫీసు పనితో సతమతమవుతుంటే, నువ్వు సహాయం చేస్తావా మరి"

వినీత చేస్తానన్నట్టుగా తలవూపింది.

రాజు చూశాడో లేదోనని తనే అంది. "నువ్వు అమ్మని ఎలా చూసుకుంటావో, నేనూ అలాగే చూసుకుంటాను. ఐ ప్రామిస్" వినీ తల వంచుకుని ఉండటంవలన, ఆ పిల్ల ముఖంలోని భావాలు రాజుకి కనపడలేదు. కానీ ఆ మాటలు వినగానే,

పూర్తిగా చలించిపోయాడు. వినీతను గాఢంగా కావలించుకుని ముద్దుపెట్టుకు న్నాడు. "ఐ లవ్ యు హనీ... ఐ లవ్ యూ" అన్నాడు, పక్కకు తిరిగి కన్నీళ్ళు తుడుచుకుంటూ.

★ ★ ★

మర్నాడు మధ్యాహ్నం నర్స్ వచ్చింది. చేయమన్న పరీక్షలన్నీ చేసింది. అప్పుడే రాజుకి పెద్దగా వాంతులయి కడుపునొప్పి మళ్ళీ వచ్చింది. మెలికలు తిరిగిపోయి, చాలా బాధపడ్డాడు. వెంటనే నర్సు డాక్టర్ బర్చ్‌కి ఫోన్ చేసింది. ఆయన ఫార్మసీని పిలిచి కొత్త ప్రిస్క్రిప్షన్ ఇచ్చి అది వాడమన్నాడు. ఫార్మసీకి ఫోన్‌చేస్తే మరో నర్సు ఆ మందులు తెచ్చింది.

రాజు ఆ మందు ప్రభావంతో నిద్రపోయాడు.

ఆరోజు సాయంత్రం రాజు నిద్రలేచాక సరోజ బెడ్‌రూంలోకి వచ్చి అతని పక్కనే కూర్చుంది.

"రాజూ... మధ్యాహ్నం ఎంత భయపడ్డానో తెలుసా?" అంది అతని చేయి గట్టిగా పట్టుకుని.

"సారీ సరోజా... మిమ్మల్నందర్నీ"

చటుక్కున అతని నోరు మూసింది సరోజ. తర్వాత మౌనంగా ఉండిపోయింది.

"సరోజా... నిద్రపోతున్నవాడిని, ఇందాక ఎందుకు లేచానో తెలుసా... ఎవరో, ఎక్కడినించో... నన్ను రమ్మని పిలుస్తున్నట్టుగా అనిపించింది. చటుక్కున కళ్ళు తెరిచి చూస్తే ఎవరూ లేరు"

సరోజ అతన్ని చురుగ్గా చూసి "నన్ను

ఏడిపించటానికి అలా అంటున్నావు కదూ" అంది.

రాజు ఏమీ మాట్లాడలేదు.

రెండు నిమిషాలు ఆగి అన్నాడు, "సరోజా! నువ్వు ఏ పరిస్థితులలోనూ చదువు ఆపకు. చేతిలో పైసా లేకుండా ఇక్కడికి వచ్చాం. మన దేశంకాని దేశంలో మనల్ని ఆర్థికంగా నిలబెట్టినది నా చదువే. నీ చదువే నీకు అండ. వినీత పెద్దయేదాకా నువ్వే దానికి అన్నీను. నీలో ఆ ధైర్యం, తెలివితేటలూ ఉన్నాయని నాకు తెలుసు. ఈ చిన్న వయసులో నిన్ను వదిలి, సంసారభారమంతా నీ మీద వదిలేసి ఇలా వెళ్ళిపోతున్నాను" ఆగాడు రాజు.

సరోజకు ఆ మాటలు బాధగా వున్నా, అతని మాటలకు అడ్డం రాలేదు. మనసులోని విషయాలు పైకి చెప్పినందువల్ల అతని మనోవేదన తీరుతుందని నిశ్శబ్దంగా వుంది.

"నేను పోయాక, నువ్వు ఇండియాకి వెళ్ళిపోతావా? " అడిగాడు రాజు.

సరోజ జవాబు చెప్పలేదు.

"నీ ఇష్టం. నీకూ వినీతకి ఎలా బాగుంటుందనుకుంటే అలా చేయండి. నా లైఫ్ ఇన్సూరెన్సు డబ్బు కనీసం నీ చదువుకీ, కొన్నాళ్ళు ఇంటి ఖర్చులకీ సరిపోతుంది" అన్నాడు రాజు.

కళ్లల్లో నీళ్ళు పమిటచెంగుతో ఒత్తుకుంటూ, తలవూపింది సరోజ

అప్పుడే పక్కగదిలోకి వెడుతున్న లలితను పిలిచాడు రాజు.

లలిత అతను ఎందుకు పిలిచాడో తెలియక "ఏమిటి బావగారూ... బత్తాయి రసం తెచ్చేదా? " అంది.

"వద్దు లలితా... ఇలా కూర్చో" అన్నాడు రాజు మంచంమీద కొంచెం పక్కకి జరుగుతూ.

"లలితా... ఇక్కడ నువ్వు కొన్నాళ్ళు ఉండగలవా. రవణకూ పిల్లలకూ అక్కడ కష్టమవుతుంది నాకు తెలుసు. కానీ నేను వెళ్ళిపోయాక సరోజకూ వినీతకూ కొన్నాళ్ళు నువ్వు అండగా నిలబడటం అవసరం" అన్నాడు.

లలితకు ఆ మాటలు విన్న తర్వాత నోట మాటరాలేదు. రెండు నిమిషాలు అయ్యాక తమాయించుకుని అంది. "ఉండటానికి నాకేమీ ఫరవాలేదు. ఆయన, పిల్లలు అక్కడ మానేజ్ చేస్తారులెండి. కానీ మీకు ఆ ఆయుర్వేదం మందుతో తగ్గుతుందని నా నమ్మకం. మీకేమీ అవదు. మళ్ళీ ఆరోగ్యం పుంజుకుంటారు"

"లలితా! అలా జరిగితే మంచిదే. కానీ... ఆ అవకాశం ఇక లేదని మనమందరం గ్రహించటం మంచిది. నువ్వు కూడా నా అంతిమయాత్రకి సిద్ధమవటం అవసరం. సరేనా? " అన్నాడు రాజు నెమ్మదిగా.

అతనివేపు సూటిగా చూస్తున్న ఆమె కళ్ళల్లో నీటిబిందువులు మెరుస్తున్నాయి. ఆ నీటిబిందువుల మధ్యనించి రాజు వ్యక్తిత్వం ఎంతో ఎదిగిపోయి అతను చాలా ఉన్నతంగా కనిపిస్తున్నాడు లలితకి.

కొనగోటితో కళ్ళు తుడుచుకుని తలవూపింది.

"అక్కయ్యనీ, వినీతనీ నా ప్రాణంలో ప్రాణంగా చూసుకుంటాను" అంది లలిత ముంచుకువస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

సరోజ లేచి లలితను దగ్గరకు తీసుకుంది. ఇద్దరిలోను ఒక్కసారిగా తెలియని బాధ పైకి తన్నుకువచ్చి, ఒకరికొకరు హత్తుకుపోయి బావురుమన్నారు.

★ ★ ★

తర్వాత రెండురోజులూ రాజు శారీరకంగా చాలా బాధపడ్డాడు. ఏమీ తినలేకపోయాడు. లలిత జావలాగా చేసి అన్నం, మజ్జిగ కలిపి ఇచ్చింది. అది కూడా తిన్న కాసేపటిలో బయటకు వెళ్ళిపోయింది. నర్సు వచ్చి సెలైన్ ఇచ్చింది. సరోజ హాస్పి




టల్‌కి వెడదామంటే రాజు వద్దన్నాడు.

కొంచెం తగ్గాక బెడ్‌రూమ్ తలుపు వేసుకుని చాలా ఫోన్ కాల్స్ చేశాడు.

ఆ సాయంత్రం ఆఫీసునించి సరాసరి రాజు దగ్గరికి వచ్చాడు ప్రకాష్.

రాజు అతన్ని బెడ్‌రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు.

"ప్రకాష్! నీకొక పని అప్పచెబుతున్నాను" అని ఒక కాగితం అందించాడు.

దానిలో వాళ్ళ ఇంటికి కొంచెం దగ్గరలో ఉన్న ఫ్యూనరల్ హోమ్ అడ్రస్, ఫోన్ నెంబరు, డేవిడ్ విలియమ్స్ అనే పేరు రాసి ఉన్నాయి.

"ప్రకాష్! నేను ఇందాక ఈ ఫ్యూనరల్ హోమ్‌కి ఫోన్ చేశాను. నా క్రెడిట్ కార్డు నెంబరు ఇచ్చి కట్టవలసిన డబ్బులన్నీ కట్టేశాను. ఈ కాగితంలో వాళ్ళ అడ్రసూ, ఫోన్ నెంబరూ ఉన్నాయి. అక్కడి సూపర్‌వైజర్ పేరు కూడా ఇక్కడ రాశాను. ఆ అవసరం రాగానే వాళ్ళకి ఫోన్ చేయి. వాళ్ళే వచ్చి అన్నిపనులు చేసుకుపోతారు. ఇక్కడి గుడికి కూడా ఫోన్ చేశాను. పూజారిగారు వచ్చి అక్కడ మన పద్ధతిలో కార్యక్రమం నిర్వహిస్తారు. ఫ్యూనరల్ హోమ్ వాళ్ళకి కూడా ఏమీ అభ్యంతరం లేదని చెప్పారు. ఆ సహాయం నువ్వు చేయగలవా? " అన్నాడు రాజు.

ఒక్కసారిగా బిత్తరపోయాడు ప్రకాష్. ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేకపోయాడు. అతనిలో దుఃఖం బయటకు తన్నుకువచ్చింది. రాజుని కావలించుకుని "రాజూ... రాజూ" అంటూ విలపించాడు.

"నీ అంతిమయాత్రకి ప్రయత్నాలు నువ్వే చేసుకున్నావా రాజూ" అంటున్న అతని మాటలు, ఎక్కడో నూతిలోనించి వస్తున్నట్టుగా ఉన్నాయి.

★ ★ ★

ఆరోజు రాత్రి ప్రకాష్ తనలో తను బాధపడటం చూసి, "ఏమిటలావున్నావు" అని అడిగింది కమల.

"నా కిష్టమైన కవి దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి పుస్తకం దేవులపల్లి కృతులు తీసుకువస్తావా" అన్నాడు ప్రకాష్.

ఆ సమయంలో అతనలా అడగటం కొంచెం అసందర్భంగానూ, ఆశ్చర్యంగానూ అనిపించినా ఆ పుస్తకం తెచ్చి అతనికిచ్చింది కమల.

ప్రకాష్ గబగబా పేజీలు తిప్పి ఒక పేజీ దగ్గర ఆగాడు. "ఈ కవిత చూడు. మొదట్లో నేనిది చదివినప్పుడు ఇదేదో కవి ఊహాపరంగా రాసినదే. కానీ ఇలాటివి నిజ జీవితంలో ఎక్కడయినా జరుగుతాయా అనుకున్నాను. కానీ నేనే ఈ సంఘటన కళ్ళారా చూస్తాననుకోలేదు" అన్నాడు.

కమల ఏమీ మాట్లాడకుండా అతను చెప్పబోయే విషయం ఏమిటా అని ఆలోచిస్తూ, అతన్నే దీక్షగా చూస్తూ కూర్చున్నది.

ప్రకాష్ ఆ కవిత చదవటం ప్రారంభించాడు.

"ఏను మరణించు చున్నాను, ఇటు నశించు
నా కొరకు చెమ్మగిలు నయనమ్ము లేదు
నా మరణశయ్య పంచుకొన్నాను నేనె!
నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను!
నేనె నాపయి వాలినా, నేనె జాలి
నెద నెద గదించినాను, రోదించినాను!
బతికియున్న మృత్యువునై ప్రవాస తిమిర
నీరవసమాధి గ్రుళ్లి క్రుంగినపుడేని
నిను పిలిచినాన, నా మూల్గునీడ ముసిరి
కుములు నేమొ నీ గానోత్సవముల ననుచు
ఇదియె నా చితి, పేర్చితి నేనె దీని
వదలిపోని నా యవసానవాంఛగాగ...!"

ప్రకాష్ గొంతు బొంగురుపోయింది.

ఇక చదవలేక పుస్తకం పక్కన పడేసి ముఖం చేతులకడ్డంగా పెట్టుకున్నాడు.

కమలకి రాజు ఇంట్లో ఏం జరిగిందో

అంతా అర్థమయిపోయింది.

ప్రకాష్ తల నిమురుతూ అలాగే కూర్చుంది.

కొంచెంసేపటికి కాస్త సర్దుకుని నెమ్మదిగా అన్నాడు ప్రకాష్, "రాజుకి అంత ధైర్యం ఎక్కడినించి వచ్చిందో. లోలోపల ఎంత కుమిలిపోయాడో"

"అవును. నాకాయన్ని చూసినప్పుడల్లా అదే అనిపిస్తుంటుంది. ఆయనలోని మనోధైర్యం చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంటుంది. తను కృష్ణపక్షపు వెన్నెలలా క్షీణించిపోతున్నా... తన భార్యాపిల్లలకు చేయవలసిందంతా క్రమబద్ధంగానే చేయటం వాళ్ళను రాబోయే పరిస్థితులకు సిద్ధం చేయటం" సాలోచనగా అంది కమల.

ప్రకాష్ మాట్లాడలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఆయనకి వున్న ఆ మనోధైర్యమే ఆయనకి ప్రాణం పోస్తుందనిపిస్తున్నది నాకు" అంది కమల.



జనవరి మూడోతారీకు సాయంత్రం. రాజు సోఫాలో కూర్చుని ఏదో ఆలోచనలో ఉన్నప్పుడు కాలింగ్‌బెల్ మోగింది.

వినీత వెళ్ళి తలుపు తీసింది. ఉన్నిక్రిష్ణన్.

లోపలకు వస్తూనే రాజుని చూసి "ఎలా ఉన్నారు? " అని అడిగాడు.

రాజు మందహాసం చేసి తల ఊపాడు.

"మీరు బాగా బరువు తగ్గిపోయారు" అంటూనే తన చేతిలోని సంచీలోనించి, ఒక సీసాతీసి బల్లమీద పెట్టాడు.

"మనం అనుకున్నట్టుగానే అనుకున్నరోజుకి కేరళనించీ మందు వచ్చింది. పరమేశ్వరన్ నాయర్ సారు తీసుకువచ్చారు" అన్నాడు ఉన్నికృష్ణన్.

సరోజ, లలిత కూడా వచ్చారక్కడికి. ఇద్దరికీ నమస్కారం చేశాడు ఉన్నిక్రిష్ణన్.

"మీకు చాలా శ్రమ ఇచ్చాను" అన్నాడు రాజు.

"అలా అనకండి. మీరు పడుతున్న బాధ ముందు, నేను చేస్తున్న సహాయం ఎంత? తోటిమనిషిగా నేను చేయగలిగింది నేను చేస్తున్నాను. అంతే" అన్నాడు ఉన్నిక్రిష్ణన్.

"ఈ మందు ఎలా వేసుకోవాలి? " అని అడిగింది సరోజ.

ఉన్నిక్రిష్ణన్ ఆమెకు అన్నీ వివరంగా చెప్పాడు. "రేపు పొద్దున్నే మొదలుపెడితే బాగుంటుంది" అన్నాడు.

సరోజ తల ఊపింది.

రాజు అడిగాడు "దీనికి ఖర్చు ఎంత అయిందో"

ఉన్నిక్రిష్ణన్ చిన్నగా నవ్వి "పెద్ద ఖర్చేమీ కాదులెండి. మీకు ఆరోగ్యం మెరుగవటం ముఖ్యం. మిగతావి తర్వాత చూద్దాం" అన్నాడు.

"ఉండండి. కాఫీ తెస్తాను" అంది సరోజ.

"నాకు కాఫీ అలవాటు లేదు. అదీకాక వేరే పనికూడా ఉంది. వెళ్ళాలి. మళ్ళీ కలుస్తానుగా.. ఈ మందు వాడటం గురించి మీకేమయినా ప్రశ్నలుంటే నాకు ఫోన్ చేయండి" అని రాజుకి షేక్‌హాండ్ ఇచ్చి వెళ్ళిపోయాడు ఉన్నిక్రిష్ణన్.







ఆరోజు అర్ధరాత్రి మంచి నిద్రలో ఉన్న ప్రకాష్, ఫోన్ మోగటంతో చటుక్కున లేచి, ఫోన్ అందుకున్నాడు.

లలిత వణుకుతున్న గొంతుతో అంది. "మా బావగారు స్పృహలేకుండా పడిపోయారు. మాట కూడా లేదు. అక్కయ్య ఏడుస్తున్నది. నాకేం చేయాలో తెలియటంలేదు"

ప్రకాష్ ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు. "మీరు గాబరా పడకండి. నేను ఎమర్జెన్సీని పిలుస్తాను. వాళ్ళు వచ్చి హాస్పిటల్‌కి. తీసుకువెడతారు. ఈలోగా సురేష్‌ని కూడా మీ ఇంటికి రమ్మంటాను. నేను హాస్పిటల్లో కలుస్తాను"

అంటూనే 911 నెంబరుకి ఫోన్‌చేసి, రాజు ఇంటి అడ్రస్‌తోసహా అన్నీ వివరంగా చెప్పాడు. ఏ హాస్పిటల్‌కి వెడితే బాగుంటుందో కూడా చెప్పాడు. తర్వాత సురేష్‌కి విషయం చెప్పి, రాజు ఇంటికి వెంటనే వెళ్ళమన్నాడు.

తను గబగబా బట్టలు వేసుకుని, ఆదుర్దాగా చూస్తున్న కమలతో "అవసరమైతే ఫోన్ చేస్తాలే" అని బయల్దేరాడు.

ప్రకాష్ హాస్పిటల్‌కి వచ్చేసరికే, రాజుని లోపలికి తీసుకువెళ్ళారు. రాజుతోపాటూ సరోజ కూడా లోపల వుంది. సురేష్ బయట నుంచుని ఉన్నాడు.

ప్రకాష్ రాగానే అతనితో అన్నాడు సురేష్ "రాజు కోమాలోకి వెళ్ళిపోయాడు. లోపల ఆక్సిజన్ ఇస్తున్నారు"

"సాయంత్రం ఫోన్ చేసినప్పుడు బాగానే ఉన్నాడే" అన్నాడు ప్రకాష్.

సురేష్ తల వూపాడు కానీ ఏమీ అన

లేదు.

ఒక అరగంట అయ్యాక, బయటకు వచ్చిన నర్సు "ఇంక ఏమీ ఫరవాలేదు. ఆయన కళ్లు తెరిచి చూస్తున్నారు. బాగా నీరసంగా ఉన్నారు. ఆయనకి ఐవి ద్వారా ఎలక్ట్రొలైట్లు ఇస్తున్నాం" అంది.

"లోపలికి వెళ్ళవచ్చా" అని అడిగాడు సురేష్.

నర్స్ వెళ్ళమన్నట్టుగా తల ఊపింది.

రాజు కళ్లు మూసుకుని ఉన్నాడు. సరోజ పక్కనే శిల్పంలా నిలబడివుంది.

అక్కడ వున్న డాక్టర్ సురేష్‌తో అన్నాడు. "ఇంకొక గంటసేపు అబ్జర్వేషన్‌లో ఉంచి, తర్వాత రూమ్‌కి పంపిద్దామనుకుంటున్నాం. కనీసం రెండు మూడురోజులు హాస్పిటల్లో ఉండటం అవసరం"

"ప్రమాదావస్థనించి బయటపడ్డాడా? " అని అడిగాడు ప్రకాష్.

రాజు టెర్మినల్ కాన్సర్‌తో అక్కడికి వచ్చాడని తెలిసిన డాక్టర్, ఏమీ జవాబు చెప్పకుండా సన్నగా నవ్వాడు.

ఆరోజు రాత్రి సరోజా, ప్రకాష్, సురేష్, హాస్పిటల్లో రాజు దగ్గరే ఉన్నారు.

మందుల ప్రభావంతో రాజు మత్తుగా నిద్రపోయాడు.

మర్నాడు పొద్దున్న నిద్రలేచిన రాజు, చాలా మౌనంగా ఉన్నాడు. సరోజ చేయి గట్టిగా పట్టుకుని మంచంమీద పడుకున్నాడు. అతను చెప్పిన ఒకేఒక్క మాట వినీతనూ, లలితనూ అక్కడికి రమ్మనమనీ, వచ్చేటప్పుడు భగవద్గీత తీసుకురమ్మని.

అతనికి మళ్ళీ ఐవి ద్వారా ఎలక్ట్రొలైట్లు ఇస్తున్నారు.

వినీతనీ, లలితనీ అక్కడికి తీసుకువచ్చింది సుధ. కిటికీలో టేప్‌రికార్డర్ పెట్టి, భగవద్గీత పెట్టింది. రాజు ఆ శ్లోకాలు వింటూ, వినీతను దగ్గరకు తీసుకుని కళ్లు మూసుకుని పడుకున్నాడు. అతని రెండవ చేతిలో సరోజ చేయి అలానే వుంది.

సాయంత్రం అయ్యేసరికి రాజు శరీరం చల్లబడటం ప్రారంభించింది.

నర్సు, డాక్టరూ వచ్చి చూసి వెళ్ళారు. ఏవో టాబ్‌లెట్లు ఇచ్చారు.

లలిత తనకు తెలిసిన వైద్యం ప్రకారం, రాజు అరికాళ్లను తన చేత్తో రాయటం మొదలుపెట్టింది.

రాజు కళ్ళు తిప్పి చుట్టూ చూశాడు.

సరోజ, వినీత, లలిత, ప్రకాష్, కమల, అరవింద, సురేష్, సుధ, నారాయణ, శ్యామల, వసంత్, ఉన్నిక్రిష్ణన్ కనపడ్డారు. అందరి ముఖంలోనూ మనసును తొలిచే బాధ, ఆవేదన స్పష్టంగా కనపడుతున్నాయి.

రాజు ఏదో అనబోయాడు. కానీ మాట బయటకు రాలేదు.

రెండు చేతులూ పైకెత్తి, అందరికీ ఒక్కసారిగా నమస్కారం పెట్టాడు.

అతని చూపు ప్రశాంతంగా ఉంది.

పక్కనే భగవద్గీత వినిపిస్తున్నది.

కవిం పురాణ మనుశాసితారం... పరం పురుష ముపైతి దివ్యమ్!

ఆ శ్లోకం తాత్పర్యం ఇలా ఉంది.

సర్వమూ తెలిసినవాడు, సనాతనుడు, సకలలోకాలనూ శాసించేవాడు, సూక్ష్మాతిసూక్ష్మమైనవాడు, సూర్యుడిలాంటి కాంతి కలిగినవాడు, అఖిల జగత్తుకూ ఆధారమైనవాడు, ఆలోచించటానికి శక్యంకాని రూపం కలిగినవాడు, అజ్ఞానాంధకారానికి అతీతడు అయిన పరమేశ్వరుణ్ణి, మరణకాలంలో మనస్సు నిశ్చలంగా వుంచుకుని భక్తిభావంతో, యోగబలంతో, కనుబొమ్మల మధ్య ప్రాణవాయువుని నిలిపి ధ్యానించేవాడు ఆ దివ్యపురుషుణ్ణి పొందుతాడు.

చూస్తున్న రాజు చూపు అలాగే నిలబడిపోయింది.

ఆ జీవనస్రవంతి అంతటితో ఆగిపోయింది.

అతని ప్రాణం అనంతవాయువులలో లీనమయిపోయింది.



# ఏరిన ముత్యాలు

★ దేవుణ్ణి నమ్మినవాడు దీనుణ్ణి సేవించాలి.

–స్వామి వివేకానంద

★ లోకంలో అన్నీ తెలికనుకొనేవాడు చాలా కష్టాలను ఎదుర్కొంటాడు.

–లావోసే

★ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోకుండా ఉంటే లోకంలో అసాధ్యమనేది ఉండదు.

–శ్రీ స్వామి వివేకానంద

★ గొప్ప వ్యక్తులు ఆశయాల కొరకు జీవిస్తే దుర్బలులు ఆశలకొరకు బతుకుతారు.

–సంస్కృత సూక్తి

★ శత్రువులను స్నేహితులుగా మార్చుకోవడానికి ముందుగా నియంత్రించాల్సింది పగ సాధింపు చర్యలని.

–గాంధీజీ

★ ప్రయత్నం చేయువానికంటే పాటుపడువాడు ఉత్తముడు.

–స్వామి వివేకానంద

★ తాము చేసిన తీర్పులకు ప్రతీ ఒక్కరూ అనుభవం అనే పేరునిస్తారు.

–ఆస్కార్ వైల్డ్

★ నీవు సంపాదించేకన్నా తక్కువ ఖర్చు చేయగలిగితే నిన్ను మించిన ఆర్థిక నిపుణుడుండడు.

–ఫ్రాంక్లిన్

★ ఒక పనిని చక్కగా చేయడమే చేసినందుకు ప్రతిఫలం.

–ఎమర్సన్

★ అతిభాష మతిహాని మితభాష అతి హాయి.

–శ్రీ సత్యసాయి

★ శక్తికి మాతృక వ్యక్తే.

–శ్రీశ్రీ

★ ప్రార్థించే పెదవులకన్నా సాయంచేసే చేతులు గొప్పవి.

–మదర్‌థెరిసా

★ మనిషి జీవితంలో అధిక సంతృప్తినిచ్చేది ఏదైనా ఉందంటే అది అతడు సాధించిన విద్యయే.

–విదురుడు

★ చర్చ విజ్ఞానాన్ని పెంచుతుంది. వాదన అజ్ఞానాన్ని పంచుతుంది.

రాబర్ట్ క్విల్లెన్

సేకరణ: శివప్రసాద్ పండా


ప్రయోగాత్మక విద్యాలయ కర్త రవీంద్రనాథ్

# మహాకవి కలలపంట

నడిచే విద్యాబోధనలు విన్నా, అక్కడి ఎర్రమట్టి రోడ్ల జ్ఞాపికలపై నడుస్తున్నా... మనం మామూలు ప్రపంచానికి దూరంగా ఆహ్లాదకరమైన ప్రశాంత ప్రపంచంలోకి చేరుకుంటాం.

అదొక రంగురంగుల పర్యాటక కేంద్రంలాకాక ఎన్నో తీపిజ్ఞాపకాలను మనముందుకు తెచ్చి ఆధునిక దృక్పథంతో కరడుగట్టిన మన హృదయాలను మెత్తబరచి, సేదదీర్చి, చారిత్రాత్మక సాకార స్వప్నవలయంలోకి తీసుకువెడుతుంది.

ఈ కలలు సాధారణ మానవుని కలలుకావు. రవీంద్రుని ఆధ్యాత్మిక దృక్పథాన్ని ప్రతిబింబిస్తూ విశ్వాన్ని ఆకర్షించిన సుస్వప్నసౌరభాలు. అవే ఆయన చేత 'శాంతినికేతన్' స్థాపనకు పునాదులు వేయించాయి.

రవీంద్రనాథ్ టాగూర్ స్థాపించిన 'శాంతినికేతన్' ఒక అపూర్వ ప్రయోగాత్మక విద్యాసంస్థ. విశ్వవ్యాప్తమైన కీర్తి నార్జించుకుని ఎందరో విద్యావేత్తలను ప్రపంచం నలుమూలలనుండి ఆకర్షిస్తోంది. ఇది విశ్వప్రేమ, శాంతి-సౌభ్రాతృత్వాలకై స్వప్నించిన ఓ మహాకవి కలలకు సాకారరూపం.

1941లో ఆయన జీవనయానంలోని ఆఖరి మజిలీగా స్థాపించిన శాంతినికేతన్ నేటికీ రవీంద్రుని మానవతా సిద్ధాంతానికి, ప్రేమ, శాంతి-సౌభ్రాతృత్వాలకీ ప్రతీకగా నిలిచిపోయింది. అక్కడ ఆశ్రమంలో అడుగుపెట్టి, చల్లని చెట్లకింద, పచ్చని ప్రకృతిలో

రవీంద్రుడు తన 'మనిషి యొక్క మతం' అనే గ్రంథంలో "ప్రేమ, ప్రవర్తనలు జ్ఞానసముపార్జనకు చక్కటి వాహకాలు. కానీ ఈ జ్ఞానం యొక్క గమ్యం పాండిత్య ప్రకర్షకు కాకుండా, వివేకాన్ని పొందడంకోసమే అయివుండాలి" అని రాశారు.

పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని బీర్‌భూమ్ జిల్లాలో స్థాపించబడ్డ శాంతినికేతన్ కలక





విద్యార్థులు, ఉపాధ్యాయులు కలిసి మెలిసి...

త్తాకు వందమైళ్ల దూరంలో వుంది. ఖరీదైన యూనివర్సిటీగా మారినా నేటికీ రవీంద్రుని ఆశయాలను ప్రతిబింబిస్తూనే నడుస్తోంది. రవీంద్రుని తండ్రి మహర్షి దేవేంద్రనాథ్ మొట్టమొదట ఆత్మావలోకనకూ, ధ్యాన సాధనకూ ఉపయోగించే ఒక స్థావరాన్ని ఇక్కడ నెలకొల్పారు. ఆయన చిన్న కుమారుడు రవీంద్రనాథ్ టాగూరు దానికి ఒక 'సృజనాత్మక విద్యావిధానాన్ని' కూడా జత చేయవలసిందిగా కోరాడు. తండ్రి దానికి ఒప్పుకోవడంతో రవీంద్రుడు తన భార్య మృణాళిని, తన సంతానంతోపాటు మరికొద్ది మంది స్నేహితులను కలుపుకుని ఒక ప్రయోగాత్మక పాఠశాలను 1901 డిసెంబరు 22వ తేదీన నెలకొల్పారు. అక్కడి చిన్నారులకు ఆధునిక విద్యకు సంబంధించిన పుస్తకాలు, పాఠాలతోబాటు, ప్రకృతి ఒడిలో స్ఫూర్తిపొంది తోటి విద్యార్థుల సహవాసంలో కొత్తకొత్త ఆలోచనలను పెంపొందించుకునే అవకాశం పరిపూర్ణంగా వుంటుంది.

అర్థంలేని అధికార దర్పానికి, ఒత్తిడులకు తన పాఠశాల గురికాకూడదనుకునేవారు టాగూర్. చిన్నప్పుడు అధ్యాపకుల కఠినమైన సూత్రాలని, కట్టుబాట్లను ఎదిరించేవాడు రవీంద్రుడు. విద్యాబోధనలో స్వేచ్ఛాయుత వాతావరణాన్ని ఆశించేవారాయన. ఓసారి చైనా పర్యటనలో ఆయన అక్కడి విద్యార్థులతో మాట్లాడుతూ "నా చిన్నతనంలో విద్యాభ్యాసం వదిలేసి పాఠశాలకు దూరంగా పారిపోయాను. అదే నన్ను కాపాడింది. ఈ రోజు నేను పొందుతున్న ఈ ఆనందం, ఈ నా సర్వస్వం నేనారోజు ధైర్యంగా ముందుకు వేసిన అడుగు ఫలితమే" అన్నారు.

"నన్ను శాసించడమేగాని, ఉత్తేజపరచలేని తరగతి గదులనుంచి దూరమయి, జీవితాన్ని గురించి, ప్రకృతి గురించి సున్నితమైన భావాన్ని పెంపొందించుకుని వాటి నుండి విద్యను పొందడం ప్రారంభించాను. మహత్తరమైన ఈ ప్రపంచాన్ని పట్టించుకోకుండా నా గ్రహణశక్తిని పుస్తకాల గుట్టల

కింద చదునుచేసి వుంటే అందమైన ఈ విశ్వాన్ని నేను పోగొట్టుకుని వుండేవాడిని" అన్నారాయన.

దూరంగావున్న, తెలియకుండా మరుగున వున్న విషయాలను తెలుసుకోవాలన్న విచిత్రమైన తపన ఆయనలో వుండేది. చిన్నప్పుడు తనని ఆకర్షించని బోధనాపద్ధతులపై దండెత్తిన ఉదంతాలు ఎన్నో వుండేవి. తన స్వీయ చరిత్రలో "నా చిన్నప్పుడు బెంగాలీ అక్షరాలను ఎంతో బాధతో నేర్చుకున్న ఆరోజు నాకు బాగా గుర్తుంది. నేను ఆ అక్షరాల కలయికను అనుకోకుండా ఓ పద్ధతిలో చూశాను. 'వర్షం పడుతోంది. ఆకులు వణుకుతున్నాయి' అని. ఆ అక్షరాలు అందించిన చిత్రాన్ని చూసి వివశుడనయ్యాను" అని రాసుకున్నారు.

పాఠశాలంటే చిన్న రవీంద్రుడికి బంధిఖానాయే. అతడిలో ఆ భావం రానురాను వృద్ధిఅయ్యేది. ఓసారి ఆయన ఇలా రాసుకున్నారు. "గడియారం 10 గంటలు కొడుతుంది. దూరంగా పచ్చి మామిడికాయలమ్మే వ్యక్తి గొంతు వినిపిస్తోంది నోరూరిస్తూ. ఇంకాస్త దూరంనుంచి ఇత్తడి సామాన్లమ్మే అబ్బాయిగొంతు వినిపిస్తుంది. పొరుగింటి మహిళ స్నానం చేసివచ్చి ఎండలో జుట్టు ఆరబెట్టుకుంటుంటే, స్కూలుకి వెళ్ళనవసరంలేని ఆమె ఇద్దరి చిన్న పాపలు నత్తగుల్లలతో వీధిలో ఆడుకుంటున్నారు. అబ్బా! ఆడపిల్లగా పుడితే ఎంత బావుంటుందీ? అప్పుడే ముసలి గుర్రం కట్టిన బండి నన్ను స్కూలుకు తీసుకువెళ్ళడానికి వస్తోంది. 10 గం॥ నుంచి 4 వరకూ నన్ను దేశబహిష్కరణ గావిస్తుంది" అని.

ఆయన మనోభావాలకు దర్పణమిది!

శాంతినికేతన్ విద్యాకేంద్రం తొలుత కేవలం అయిదుగురు విద్యార్థులతో ప్రారంభమయింది.

అందులో రవీంద్రుని పెద్దకొడుకు ఒక విద్యార్థి. గురుకుల సాంప్రదాయ పద్ధతిలో దానికి 'బ్రహ్మచర్యాశ్రమం' అని పేరెట్టారాయన. అందులోని అయిదుగురు అధ్యాపకుల్లో ముగ్గురు క్రైస్తవులు.


కొడుకు రతీంద్రనాథ్‌తో

అప్పటి సనాతన సాంప్రదాయవాదులు దీనిని గర్హించినా రవీంద్రుడు పట్టించుకోలేదు. ఆయన అటు సనాతనం నుంచిగానీ, ఇటు ఆధునికతనుంచిగానీ స్ఫూర్తిపొందలేదు. సంప్రదాయాన్ని, ఆధునికతను తనకు నచ్చిన పద్ధతిలో విడదీసి అనుసరించి తనదైన ఓ కొత్త పంథాను నిర్మించాడు. ఆయన యందభిమానమున్నవాళ్ళు ఆ పాఠశాలను 'ఓ కవి భావావేశం' అన్నారు. ఏది ఏమయినా ఆయన ఒంటరిగానే పయనించవలసివచ్చింది. అయినా తన ప్రణాళికను ఆచరణలో పెట్టడానికి




ధృఢనిశ్చయం చేసుకున్నాడు.

రవీంద్రుని కొడుకు రతీంద్రనాథ్ తన "ఆన్ ది ఎడ్జెస్ ఆఫ్ టైమ్"లో ఇలా రాసుకున్నారు.

"మేమెంతో ఆనందంగా వున్నాము. బాహ్యానికి లేమివున్నా మేమెప్పుడూ ధనవంతులమని తృప్తి పొందాము. ఎప్పుడైనా నాన్నగారు వస్తే తన హృదయాన్ని పాఠశాలపై విప్పి పరచేవారు. కొత్తకొత్త పాటలు పాడుతూ, పద్యాలు వల్లిస్తూ, మహాభారతంలోని కథలు చెబుతూ, పిల్లలతో ఆటలాడుతూ, నాటకాల రిహార్సల్స్‌లో పాల్గొంటూ, పాఠాలు కూడా చెబుతూ వాతావరణాన్ని ఉత్తేజపరిచేవారు. అధ్యాపకులు, మేము అంతా ఆనందాన్ని, విషాదాన్ని కలిసి పంచుకునేవాళ్ళం. ఎప్పుడయినా మేము చిలిపిపనులు చేసినా, అధ్యాపకులతో మేలమాడినా, ఆ పనుల వెనుక మాకు వారిపై గౌరవం, ప్రేమ వుందన్న గుర్తింపుతో వాటిని హాయిగా తేలికగా తీసుకునేవారు అధ్యాపకులు"



ప్రకృతి ఒడిలోనే బోధనలు

మొదటి ప్రపంచయుద్ధ సమయంలో రవీంద్రుడు పాఠశాలను విస్తరింపజేసి దానికి 'భారతీయ అతిథిగృహం' అని పేరు పెట్టారు. కాలక్రమేణా అది విశ్వభారతిగా పిలవబడింది. విశ్వభారతిఅంటే ప్రపంచ విశ్వవిద్యాలయం. దాని ధ్యేయం చిన్నా, పెద్దా తేడాలేకుండా అందరిలో సద్భావం, పరస్పర అవగాహననూ పెంచడమే. ముఖ్యంగా ద్వేషం, అనుమానాలు చెలరేగిన ఆ రోజుల్లో రవీంద్రుడు తోటి మేధావులతో "మనం మరొక గొప్ప శక్తిని కనుగొనవలసిన సమయం ఆసన్నమయింది. ఆ శక్తి మనకు త్యాగాలను చేసే స్ఫూర్తినిచ్చి, బాధలను తట్టుకునే బలాన్ని అందివ్వాలి. కానీ ఈ బాధలు మన బలహీనతవల్ల కాదు అని చెబుతూ మన ఔన్నత్యాన్ని, మనోబలాన్ని చాటిచెప్పాలి" అంటూ వుండేవారాయన.

బాధలలోనే పుట్టి ఊపిరి పోసుకున్న ఆయన అంతర్జాతీయ కేంద్రం నేడు ప్రపంచ ఖ్యాతిని ఆర్జించుకుంది. పాండిత్యం, కళలు, విజ్ఞాన విభాగాలు, ప్రాచ్య, పాశ్చాత్య దేశాలన్నిటినుంచీ మేధావులను ఆకర్షించాయి. ప్రకృతికి సన్నిహితంగా ఎలాంటి శృంఖలాలూ లేకుండా యధేచ్ఛగా నడుస్తున్న అక్కడి బోధనలు ప్రారంభంలోకన్నా ఎక్కువ ఉత్సాహపూరితంగా నడుస్తున్నాయి.

"పిల్లల మానసిక చైతన్యం, వారిలోని

ఆంతరిక స్పృహ... వృక్షం తనచుట్టూ వున్న వాతావరణంనుంచి ఆహారాన్ని సేకరించడంలాంటిది" అని రవీంద్రుడు నొక్కి చెప్పేవాడు.

ఆయనకున్న ఎంతోమంది విదేశీమిత్రులలో మరీ సన్నిహితంగా వచ్చినవారు ఛార్లెస్ ఫ్రీర్ ఆండ్రూస్, విలియం పియర్సన్ అనే ఇద్దరు అమెరికన్లు. తరువాత గ్రామ పునర్నిర్మాణ విభాగాన్ని రూపొందించడానికి రవీంద్రుని ఆహ్వానంపై వచ్చిన విదేశీయుడు లియొనార్డ్ ఎల్మిస్ట్. సెల్వియాన్ లెవీ అనే ఫ్రెంచి దేశీయుడు మొదటి విజిటింగ్ ప్రొఫెసర్‌గా శాంతినికేతన్‌కు వచ్చారు. ఆయన టిబెట్, చైనా అధ్యయనకేంద్రాలను నెలకొల్పాడు. రవీంద్రుడు ఆ కేంద్రంలో లెవీ ఇచ్చిన ప్రసంగాలను స్వయంగా వినేవాడు. 1921 డిసెంబర్ 23న విశ్వభారతి పద్ధతి ప్రకారం ప్రారంభించబడింది. ఆ తరువాత శాంతినికేతన్ ఓ నవయుగాన్ని చూసింది.

రవీంద్రుని జీవితం ఎన్నో ఉత్తేజకర సంఘటనలతో నిండిపోయింది. దేశంలో స్వాతంత్ర్యపోరాటం ఊపందుకుంది. రవీంద్రుడు దేశభక్తి పూరిత భావోత్తేజాన్ని వెలారుస్తూ ఎన్నో కవితలు వ్రాశాడు. దేశాధినేతలు తరచూ శాంతినికేతన్‌కు వచ్చి విద్యార్థులను 'దేశాన్ని స్వాతంత్ర్య స్వర్గానికి తీసుకువెళ్ళాల'ని ఉత్తేజపరచేవారు. గాంధీ, నెహ్రూ, సరోజినీనాయుడు... ఇంకా ఎందరో పెద్దలు వచ్చి రవీంద్రుని కలిసి వెళ్ళేవారు.

1930 నాటికి శాంతినికేతన్... ఆరితేరిన, మేధాశక్తి యుక్తులున్న విద్యార్థుల ఖజానాగా రూపుదిద్దుకుంది. తాను చేసిన విదేశీ పర్యటనలన్నింటిలోనూ సర్వమానవ సౌభ్రాతృత్వపు పిలుపునిచ్చి, ఇళ్ళు, దేశాల సరిహద్దు గోడలను బద్దలు కొట్టుకురమ్మని పిలుపునిచ్చేవాడు రవీంద్రుడు!


శాంతినికేతన్ లోని ఒక భవనం

శాంతినికేతన్‌లో నందన్‌లాల్ బోస్ వంటి చిత్రకారుల చిత్రాలు, పిఠాపురం సంగమేశ్వరశాస్త్రిగారి వీనుల విందయిన వీణానాదాలు చోటు చేసుకున్నాయి. ఉదయశంకర్ వచ్చి ప్రదర్శనలిచ్చేవాడు.

రవీంద్రుడు ఎప్పటికప్పుడు కొత్తకొత్త నాటికలు, పద్యాలు రాస్తూ వుండేవాడు. ప్రతి ఉషోదయం ఆదర్శంతో తొణికిసలాడుతూ వైతాళిక గానాలతో కొత్త మెళకువనిచ్చేది. చెట్లకింద పాఠాలు, చెప్పుల్లేని కాళ్ళతో ఎర్రమట్టి రోడ్లపై నడకలు ప్రతిదినం కనిపించే దృశ్యాలు. సంతాల్ జాతి గిరిజనులు శాంతినికేతన్ సరిహద్దులలోనే ఉండేవారు. బావుల్ పాటగాళ్ళు కోయిలతో తమ స్వరాన్ని శృతికలిపి వసంతకాలంలో పాటలు పాడేవారు.

ఠాగూర్ తన కవిత్వంలో శాంతినికేతన్ని పలు మలుపులలో ఒడిసిపట్టారు. వేసవి ఎండలోని క్రూరత్వాన్ని, వర్షగర్భిత




మేఘాలు శాంతినికేతన్ పై వెదజల్లే దీవెనల జల్లుల్నీ, అవి వెళ్ళగానే హేమంతంలో కాశపుష్పాల నృత్యాల్ని, చలిగాలుల తాకిడికి వణికి రాలిపోయే కొన్ని ఆకుల అసహాయ స్థితిని... ఇలా ఋతుగమనాల్ని తన కవితల్లో నింపే ఠాకూర్ హృదయస్పందనలకు సజీవ దర్పణంలా విలసిల్లుతోంది శాంతినికేతన్.

రవీంద్రుని వద్దకు అధ్యయనానికి వచ్చిన వారిలో ఇందిరా ప్రియదర్శిని, కూచ్ బీహార్ యువరాణి, మృణాళిని, బలరాజ్ సహానీ, సత్యజిత్‌రే మొదలైనవారెందరో వుండేవారు.

"నా ఆశ్రమవాసపు రోజులలోని నా గురుదేవుల జ్ఞాపకాలు ఎంతో మనోహరమయినవి. వాటికి ఏ ఆఘాతం వస్తుందోనన్న భయంతో నేను మళ్ళీ శాంతినికేతన్‌కు వెళ్ళను" అంటారు మృణాళినీ సారాబాయ్.

"గురుదేవులు ఇప్పటికీ నా హృదయంలో వున్నారు. నేను ఎక్కడికి వెళ్ళినా వారి ఆశయాలను తోడు తీసుకువెడతాను" అనేవారు సత్యజిత్ రే.

రవీంద్రునితో సహవాసం చేసిన కొందరు తమ జీవితాల్లో వస్తున్న మార్పులకు అలవాటుపడుతూ ఇంకా అక్కడే వున్నారు. "వ్యక్తిగతంగా ఆయనకి ఎలాంటి బాధ వచ్చినా మనసులో వుంచుకుని, దానిని సృజనాత్మక కార్యక్రమాలకు అడ్డురాకుండా చూసుకునేవారాయన" అంటారు ఇప్పుడు అక్కడున్న నందన్‌బోస్ ఆఖరి కుమార్తె జమున. రవీంద్రుని మనుమరాలు పూర్ణిమాఠాకూర్ "నేనెరిగిన శాంతినికేతన్ ఎప్పటికీ అస్తమించదు" అంటారు.

కొత్తతరానికి చెందిన నేటి విద్యార్థులు రవీంద్రుని బోధనలలో కొత్త అర్థాల్ని వెదుకుతుంటే, శాంతినికేతన్‌లోని పూర్వసభ్యులు వారికి రవీంద్రుని ఆశయాల్ని విడమరిచి చెపుతూ వుంటారు.

"రవీంద్రుడు శాంతినికేతన్‌లో ఓ బంగారు పంట వేసి వెళ్ళారు. మేఘాల చాటునుంచి తాను వదిలివెళ్ళిన సాకార స్వర్ణజగత్తును నేటికీ తిలకించి తృప్తిపడుతూనే వుంటారు" అంటారాయన అభిమానులు.


అందరిమధ్యా ఆశీనుడైన ఆచార్యుడు



# ఏరిన ముత్యాలు

★ పక్షులు పాదాల కారణంగా చిక్కుల్లో పడితే, మనుషులు నాలుకల కారణంగా చిక్కుల్లో పడుతుంటారు.

–థామస్‌పుల్లర్

★ ఉన్నతభావాలు తోడుగా ఉన్నవారికి ఒంటరితనమంటూ లేదు.

–సిడ్నీ

★ రాత్రివేళ సూర్యుడు కనపడటం లేదని కన్నీరు పెట్టుకునేవాడు నక్షత్రాల సౌంద ర్యాన్ని చూడలేని అంధుడవుతాడు.

–ఠాగూర్

★ మీ కొడుక్కి మీరు ఇవ్వగలిగిన ఒకేఒక్క అమూల్యమైన కానుక ఉత్సాహం.

–కుష్వంత్‌సింగ్

★ వికారమైన మనసుకంటే వికారమైన ముఖమే మంచిది.

–జేమ్స్‌ఎల్లిస్

★ మిడిమిడి జ్ఞానం వున్నవాడిని ఆ బ్రహ్మదేవుడు కూడా మెప్పించలేడు.

–భర్తృహరి

★ ప్రపంచంలో రెండే రెండు జాతులున్నాయి. మంచివారు, చెడ్డవారు. వీరు మళ్ళీ ఒకరిలో ఒకరు కలిసిపోతుంటారు.

–ఆండ్రో

★ పరిస్థితులను మన అదుపులో ఉంచుకోవడంలోనే గొప్పతనం ఉంది.

–గాంధీజీ

★ మార్పు అన్నది జీవితానికి రుచినిచ్చే మసాలాలాంటిది.

–కౌసర్

★ ఓర్పును మించిన తపస్సు లేదు.

–బ్రెస్సెల్

★ మనిషి జీవితంలో ఆనందం మనో వికారాలు లేకపోవడం కంటే వాటిని అదుపులో పెట్టుకోవడంలోనే వుంది.

–టెన్నిసన్

★ నిజం కానిది నిజంగా గొప్పది కాదు.

–జాన్‌సన్

★ సమదృష్టిగల మనస్సు అన్ని దుఃఖాలకు ఉత్తమ ఔషధం.

–ప్లాటస్

★ చెట్టు పైకి ఎక్కాలనుకున్నప్పుడు పూలను కాదు, కొమ్మలను పట్టుకోవాలి.

–కాళిదాసు

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతుర కథలు

## తెంగ్లీషు

టౌన్‌కు పది కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆ ఊరు పల్లె కెక్కువ బస్తీకి తక్కువ. అక్కడ వ్యవసాయం చేసేవాళ్లు, వివిధ వృత్తులవాళ్లు ఉన్నారు.

ఆ పల్లెలో ఒక మధ్యతరగతి కుటుంబం రావుది. రావు భార్య ఉమ. వాళ్ల ముద్దుల సంతానం గోపి. నాలుగెకరాల వరిమడికి రావు వారసుడు. మధ్య తరగతి వాళ్లే అయినా ఉన్నతంగా ఉండాలనేది ఉమ కోరిక. ఉన్నంతలో సర్దుకుపోవాలనేది రావు మనస్తత్వం. గోపీకి నాలుగేళ్లు దాటాయిగానీ ఆ పల్లెటూళ్లో బడికి పంపడం ఉమకి ఇష్టంలేదు. రావుకి మాత్రం కొడుకుని తమవద్దే ఉంచి ఆ ఊళ్లోనే చదివించాలనుకునేవాడు. చివరికి భార్య పోరు పడలేక పట్నంలో కాపురం పెట్టాడు.




తన కొడుక్కి ఇంగ్లీషు చదువులు చెప్పించాలనీ, వాడు ఆంగ్లంలో ధడ ధడా మాట్లాడుతూంటే పదిమందిలో హుందాగా తిరగాలనేది ఉమ కోరిక. గోపీని కనబడిన ఓ కాన్వెంట్‌లో చేర్పించింది. అంతగా దూరం కాకున్నా హోదా చూపాలని భర్త వద్దంటున్నా వినకుండా రిక్షా ఏర్పాటు చేసింది. మొదటిరోజు తాను కూడా కొడుకుతో పాటు స్కూలుకెళ్లింది. తన కొడుక్కి ఇంగ్లీషు బాగా వచ్చేలా, ధడ ధడా మాట్లాడేలా చేయాలని టీచర్లందరికీ మరీమరీ చెప్పింది.

రిక్షావాళ్లు కూడా ఇంగ్లీషులోనే మాట్లాడేవాళ్లయ్యుండాలనేది ఆ కాన్వెంట్ షరతు.

“అమ్మో! మాడమో! బాయిని తయారు చేసినావా? కానిమెంటుకి టయమైంది” పెద్దగా అరిచాడు రిక్షావాడు.

ఆ మాటలు విన్న ఉమ “మా బాయి లడీ” అని గోపీని తీసుకువచ్చి రిక్షా ఎక్కించింది.

“అమ్మా! వెళ్లొస్తా!” అన్న గోపీ మాటలు ఉమకు కోపం తెప్పించాయి. “ఒరేయ్! తెలుగులో మాట్లాడ్డానికా నువ్వు కానిమెంట్ లో



చేరింది " అని ఒక్క అరుపు అరిచింది.

తల్లి కేకకు జడుసుకున్న గోపీ "మమ్మో!తాటా" అంటూ చేతులూపుతూ ఉంటే రిక్షా బయలుదేరింది.

ఆ కాన్వెంటులో ఆయా కూడా ఇంగ్లీషు మాట్లాడ్డంలో దిట్ట. "బాయిలూ! గర్లుసూ! సిట్టండి. నో గలాబా" అంటూ పిల్లలందరినీ క్లాసులో కూర్చోబెట్టింది.

"బాయిసూ! గర్లుసూ! మంది ఇంగిలీసు కానిమెంటు. మనం ఆల్ ఇంగిలీసే మాట్లాడాలి" అంటూ ఆయా సుప్రభాతం మొదలెట్టింది.

మేడం గారు క్లాసులో అడుగు పెట్టిందో లేదో 'గుడ్డు మార్నింగ్ సీచర్' అంటూ పిల్లలంతా లేచి నుంచుని ఆహ్వానం పలికారు. "బాయిసూ! గర్లుసూ! సిట్. సిట్ ఐ స్పీక్ ఇంగిలీస్. యూ ఆల్ ఆల్సో స్పీక్" అంటూ పాఠం మొదలెట్టింది.

"యాయా" అంటూ పిల్లలంతా ఒక్కసారి అరిచారు. ఇంతలో ఒకపాప తనముందున్న బుడ్డోడి జుట్టు లాగింది.

వాడు "సీచర్! ఈ గర్లు నా జుట్టు పీకింగ్" అంటూ టీచర్‌కి రిపోర్టు చేశాడు.

"వాటు నాటీ గర్లు. వై యు దట్ బాయ్ జుట్టు పుల్లింగు" అని అడిగింది టీచర్ ఆ పాపని.

"మీరే సీచర్ ఇంతకుముందు 'పీకు పీకు' అన్నారు. అందుకే నేను బాయ్ జుట్టు పీకా"

ఆ చిట్టి మాటలకు పిల్లలంతా నవ్వారు. ఆ నవ్వులు పక్క గదిలోని పెద్ద మేడం వింది. రుసరుసలాడుతూ వచ్చి "వాటు మ్యాటరు టీచరమ్మా! వై స్టూడెంట్స్ లాఫింగు" అని అడిగింది క్లాసు మేడంని.

"స్టూడెంట్స్ లాఫింగు బట్ నాట్ గలాభాయింగ్" అనే సమాధానంతో పెద్ద మేడం శాంతించింది.

కొత్త సెల్స్ వేసిన గోడ గడియారం నాలుగ్గంటలకు గోల మొదలెట్టగానే పిల్లలు పరుగు లంకించుకున్నారు.

గోపీ రిక్షా దిగి ఇంట్లో అడుగుపెడుతూ 'అమ్మా' అని గట్టిగా పిలిచాడు.

"ఒరేయ్ అడ్డగాడిదా! మనం పట్నం వచ్చింది ఇందుకా? ఈసారి ఆ పిలుపు విన్నానో వాతలు పెడతా" అన్న మాటలకు గోపీ జడుసుకున్నాడు.

వెంటనే తేరుకుని "మమ్మో! నాన్నేడి? " అని అడిగాడు. తల్లి ఉగ్రరూపం ప్రదర్శించింది. గోపీ నాలిక్కరుచుకుని...

"మమ్మో! డాడీ వేర్? "అడిగాడు. ఉమ మురిసిపోయింది.

గోపీ ఏదో క్లాసులోకొచ్చేసరికి అంతా ఇంగ్లీషే. తెలుగు దాదాపు మర్చిపోయినట్లే. ఊరికి పోయి చాలాకాలమైందికదా అని ఉమ భర్తని, కొడుకుని తీసుకుని స్వగ్రామం బయలుదేరింది.

ముగ్గురూ బస్సెక్కి ముందు సీట్లో కూర్చున్నారు. ఇంతలో కండక్టరు 'టికెట్ టికెట్' అని అరిచాడు. ఉమ కొడుకువైపు చూసింది. 'టూ ఫుల్ ఒన్ ఆఫ్ గివ్వు టికెట్లు' అడిగాడు గోపీ కండక్టరుని.

గోపీ మాటలకు కొందరు బిత్తరపోతూ చూశారు. ఉమ మాత్రం ఉబ్బిపోయింది. మెడ వెనక్కి చాచి అటు తిరిగి "మా వాడే! ఇంగ్లీసు కానిమెంటులో చదువుతున్నాడులెండి" అంటూ కండక్టరుకు వివరించింది ఉమ.

"అమ్మా! ఏమనుకోనంటే ఒక్కమాట. ఇది ఇంగ్లీషూ కాదు తెలుగూ కాదు. ఎందుకమ్మా వాణ్ణి పనికిరాకుండా చేస్తారు" అన్న కండక్టరు మాటలకు ఉమ ముఖం ఎర్ర బడింది.

బస్సు దిగి ఇంటికి నడక ప్రారంభించారు ముగ్గురూ. "ఈ పల్లెటూర్లో ఒక్క రిక్షాకూడా లేదే? ఎట్లాఉంటారో ఏమో? ఈ పల్లెల్లో మనుషులు? " అన్న ఉమ మాటలు దారేపోయే వాళ్లు విన్నారు.

"చింతకాయల రాణి అంటే ఏమో అనుకున్నాం. ఇలాంటివాళ్ల వల్లే అలాంటి కథలు పుట్టాయి." అనుకుంటూ నోరెళ్లబెట్టుకుని ఆ ముగ్గుర్నీ వింతగా చూస్తూ ఉండిపోయారు.





గోపీ వాళ్లని "తెంగ్లీషు"లో పలకరించాడు. "వై యూ నాట్ షట్ దట్ మౌత్స్" అంటూ. వాళ్లు దడుసుకుని ఊళ్లోకి పారిపోయారు.

–వై. శ్రీపతిరెడ్డి

---

# వంద... ఇంద

"నిత్య శుభమంగళం..."

హరికథాకాలక్షేపం ముగిసింది. గత ఇరవైఒక్క రోజులుగా రామాయణాన్ని అద్భుతంగా చెప్పిన హరిదాసుకి తమకి తోచింది ఇవ్వమని భక్తుల్ని కోరాడో పెద్దమనిషి.

భక్తులు తమకి తోచింది తాము ఇవ్వసాగారు.

ఇరవై ఒక్క రోజులు విడవకుండా వచ్చి రోజుకి గంటన్నర పాటు దాన్ని శ్రద్ధగా విన్నాడు ఓ యువకుడు. అతను వచ్చింది రామభక్తితో కాదు. రమ్యభక్తితో. తన బామ్మకి తోడుగా వస్తున్న రమ్య అనే ఇంతిని కళ్లింత చేసుకుని చూడడానికి ఆ యువకుడు వస్తున్నాడు.




ఆ పెద్దమనిషి చెప్పాడు ఒకరిద్దరు వాలంటీర్లు లేచి డబ్బు కలెక్ట్ చేయమని. రమ్య కూడా లేచి అందరి దగ్గరా డబ్బు కలెక్ట్ చేయసాగింది.

అయిదు రూపాయల నాణెంనుంచి వంద రూపాయల నోటుదాకా అన్ని తరహాల చందాలూ ఆమె చేతిలోని అట్టపెట్టెలో పడసాగాయి.

రమ్య క్రమంగా అతని దగ్గరకు వచ్చింది. ఆ యువకుడు బ్యాక్ పోకెట్‌లోంచి డబ్బు తీసి అందులోంచి రెండు రూపాయలనోటు తీసి మిగిలినది మళ్లీ జేబులో పెట్టేసుకున్నాడు. రమ్యను చూసి చిన్నగా నవ్వి ఆ రెండు రూపాయల నోటును అట్టపెట్టెలో పడేశాడు.

ఇంతలో ఆ యువకుడి వెనక ఉన్నతను అతని బుజం తట్టి వంద రూపాయల నోటిచ్చాడు. ఆ యువకుడు క్షణకాలం హరిదాసు మీద తన వెనకతనికి గల ఔదార్యానికి ఆశ్చర్యపోయాడు. తర్వాత ఆ వంద రూపాయల నోటుని కూడా రమ్యచేతిలోని అట్టపెట్టెలో వేశాడు. రమ్య ఆ యువకుడివంక మెచ్చుకోలుగా చూసి వెళ్లిపోయింది.

ఆ యువకుడు వెనక్కి తిరిగి తనకా వంద నోటిచ్చినతనితో చెప్పాడు. "మీకు దైవభక్తి ఎక్కువనుకుంటాను"

"అందరిలా మామూలుగానే తప్ప పెద్ద

ఎక్కువేంలేదు. ఏం అలా అడిగారు?" అడిగాడాయన.

"వందరూపాయల నోటిచ్చారు కదా! అందుకని అడిగాను"

"వంద నేనిచ్చానా?" అడిగాడాయన క్షణ కాలం అయోమయంగా చూసి. తర్వాత స్ఫురించినట్లుగా చెప్పాడు.

"ఓ అదా! ఆ వంద నాది కాదు. ఇందాక మీరు బ్యాక్‌పాకెట్ లోంచి డబ్బు తీస్తుంటే మీ జేబులోంచి జారి పడ్డ ఆ వందనోటు తీసి మీకిచ్చాను."

ఆ యువకుడి మొహం పాలిపోయింది.

–యం. లిపి

---

## ఒనియో మేనియా

"అయితే ఈ అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నావన్న మాట." అన్నాడు శంకర్ అమెరికానుంచి వచ్చిన తన మిత్రుడు ప్రతాప్ అందించిన ఓ అమ్మాయి ఫొటోని పరీక్షగా చూస్తూ.

"య్యా! య్యా! నీ అభిప్రాయమేమిటి?" అడిగాడు ప్రతాప్.

"ఇంతకంటే మంచి అమ్మాయి దొరకలేదా నీకు?" ప్రశ్నించేడు శంకర్.

"అదేంటి అలా అంటున్నావు? ఈ అమ్మాయి క్యారెక్టర్ మంచిదికాదా? మీ ఎదురిల్లేకదా వాళ్లది?"

"ఛా! ఛా! నా ఉద్దేశం అదికాదు."




"పెళ్లి చేసుకోవడానికి సిద్ధమయ్యావుకదా. ఇంక నా అభిప్రాయం ఎందుకూ?" అని ఎదురు ప్రశ్న వేశాడు శంకర్.

"ఇంకా ఫైనల్ డెసిషన్ తీసుకోలేదుకదా! అందుకే నీ ఒపీనియన్ అడుగుతున్నాను." అన్నాడు ప్రతాప్ ఆ ఫొటో తీసుకుని షర్ట్ జేబులో పెట్టేసుకుంటూ.

"మరేమిటో చెప్పు."

"ఎదురిల్లే కదా! ఈ అమ్మాయివాళ్ల డాడీ, మా డాడీ మంచి స్నేహితుల్లే. డాడీ అప్పుడప్పుడు చెబుతూవుంటారు ఈ అమ్మాయి చాలామంచిదనీ, బ్రిలియంట్ అనీను. కానీ..."

"ఆగిపోయావేం. చెప్పు. ఈ అమ్మాయికి పైకి కనిపించని జబ్బేమీ లేదుకదా!" ఆత్రుతగా అడిగాడు ప్రతాప్.

"అబ్బే. అలాంటి లోపాలేమీ లేవు."




"మరి? "

"ఏంలేదు. ఈ అమ్మాయికి షాపింగ్ పిచ్చి కొంచెం ఎక్కువ. చూశాక నచ్చిందల్లా కొనేస్తూవుంటుంది. ప్రతిరోజూ షాపింగు చేసి ఇంటికి తిరిగి వస్తూ ఒకటో, రెండో పాలితిన్ బ్యాగ్‌ల నిండా ఏవేవో వస్తువులు,బట్టలు మోసుకురావడం చూస్తూనే వుంటాను. అదో మానియా ఆమెకి. దీన్ని ఒనియో మానియా అంటారు. ఈమధ్యనే పేపర్లో చదివాను." అంటూ అసలు విషయం బయటపెట్టాడు శంకర్.

"ఈ షాపింగ్ పిచ్చి ఆడవాళ్లందరికీ సహజమే! అదో పెద్ద ప్రోబ్లెమ్ కాబోదనుకుంటాన్లే. ఏమైనా ఈ విషయం గురించి నాకు ముందుగా చెప్పినందుకు చాలా థ్యాంక్స్." అని మిత్రుడికి కృతజ్ఞతలు తెలియచేసి వెళ్లాడు ప్రతాప్.

ప్రతాప్ మేనకని పెళ్లిచేసుకుని అమెరికా వెళ్లిన ఆర్నెల్లకి శంకర్‌కి ఓ ఉత్తరం రాశాడు.

"హాయ్ శంకర్!

నేను, మేనక కులాసాగా ఉన్నాం. మేనక ఇక్కడికి వచ్చాక కూడా తనకిష్టమైన షాపింగ్స్ మానలేదు. రోజూ అదే పని. మేనక కొన్న నగలతో, బట్టలతో, ఇతర వస్తువులతో ఇంట్లో వార్డ్‌రోబ్స్, అల్మైరాస్ అన్నీ నిండిపోయి పొర్లిపోతున్నాయి. మేనక మేనియా గురించి నువ్వు చెబితే విన్నాను కదా! అడ్డు చెపితే పట్టుదల పెరిగి షాపింగ్ మరీ జోరు చేసే అవకాశం ఉంది. దానికి మందు నేను పల్లెత్తు మాట అనకుండా ఉండడమే అనుకుని అలాగే చేశాను. సరిగ్గా నేను అనుకున్నట్టుగానే జరిగింది. తాను కొన్న వస్తువులే ఇంట్లో స్థలమంతా ఆక్రమించి ఎక్కడపడితే అక్కడ దర్శనమిచ్చేసరికి మేనకకి తను షాపింగ్ చేసి కొన్న వస్తువుల మీదే మోజు తగ్గిపోయి షాపింగ్ మానేసింది.

కాస్త ఉడికిద్దామని నేనీరోజు వందడాలర్లిచ్చి "షాపింగ్‌కి వెడదాం రెడీ అవు" అన్నాను.

"వెధవ షాపింగ్, ఎందుకులెద్దురూ! ఇక్కడి ఇరుగుపొరుగుకు బుద్ధిలేదు. ఎవరూ రారు నేను కొన్నవి చూసి మెచ్చుకోడానికి. ఇంక కొనడం ఎందుకూ? దండుగ" అంది. మిత్రమా! అదీ సంగతి."

—ఎ.వి. చంద్రశేఖరరావు

## ప్రభుత్వోద్యోగి కథ

ఉదయం 9.00- పెందరాళే ఆఫీసుకి చేరి కార్డుని పంచ్ చేశాను.

9.35- సిగరెట్ తాగి నా సెక్షన్ లోకి వెళ్లాను. ఒక్కపార్టీ కూడా నాకోసం ఎదురు చూడడంలేదు. ప్చ్

10.45- ఈరోజు క్లియర్ చేయాల్సిన ఫైల్స్ కోసం వెదికాను. 11.10-ఫైల్ తెరిచిన మరుక్షణం బి.టు సీట్ సుబ్బారావు టీ తాగొద్దామని పిలిచాడు. రోజుకి పదహారు ఫైళ్లు క్లియర్ చేయాలని రూలు. అయినా 'నో' అనలేం కదా!

11.25- పక్క సెక్షన్‌లోని 'మిసెస్ రత్నకుమారి ప్రెగ్నెంటా?' అన్న విషయం మీద కేంటిన్‌లో రసవత్తరమైన చర్చ జరుగుతోంది. చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంది.

12.00- తిరిగి సెక్షన్‌కి వచ్చేసరికి పదకొండున్నరకొచ్చే టీ కెటిల్ వాడు వచ్చి వెళ్లిపోయాడని తెలిసి వాడి కోసం కేంటిన్‌కి వెళ్లాను.

12.30- పని మొదలెడితే మధ్యలో లంచ్ బ్రేక్‌కి ఆగాలి. కాబట్టి ఫైల్ తెరవకుండా ఆగాను.

12.40- టాయ్‌లెట్‌కి వెళ్లాను. ఎదురుగా గోడమీద అమ్మాయి బొమ్మ బావుంది. ఎవరు గీశారబ్బా? ..."

12.50- విసుగ్గా ఉండి ఫైల్ తెరచి నోట్

ప్యాడ్‌లో ఓ వాక్యం రాశాను. ఆలోచించి దాన్ని కొట్టేసి ఇంకోటి రాశాను. మళ్లీ ఆలోచించేసరికి తల నొప్పి వచ్చింది. బయటకివెళ్లి చెట్టుకింద నిల్చుని సిగరెట్ అంటించాను.

12.45- తిరిగొచ్చి ఇంటికి ఓ ఫోన్‌కాల్ చేసుకున్నాను. రాత్రికి వంట ఏంచేయాలో మా ఆవిడకి వివరంగా చెప్పాను.

12.55- మా అన్నయ్యనుంచి ఫోన్‌కాల్ రెండుతర్వాత చేయమన్నాను. ఇడియట్ లంచ్ అవర్‌లో ఫోన్ చేస్తాడే.

2.10- సెక్షన్‌కెళ్లాను. డి.ఏ పెరుగుతుందో లేదో అని అందరూ చేరి ఆసక్తిగా చర్చిస్తున్నారు.




2.15- సిగరెట్‌పెట్టి, అగ్గిపెట్టె తీసుకుని బయటకి వెళ్లాను.

2.25- టాయిలెట్ గోడమీద అమ్మాయి బొమ్మకి మీసం గీశాను.

3.05- అనుబంధ ప్రాధమిక చికిత్స కేంద్రంలో డాక్టర్ వద్దకెళ్లాను అనుమానం కలిగి. థాంక్‌గాడ్! నాకు మలబద్ధకం లేదు.

3.25- వేడివేడి టీ వచ్చేసింది కెటిల్‌తో. తాగితే ఎంత హాయిగా ఉందో.

3.55- వెధవపని రోజూ ఉండేదేకదా అని టీ అవగానే చెట్టుకింద చేరి సిగరెట్ ముట్టించాను.

4.00- రేషన్‌కార్డు పనుందని పర్మిషన్ తీసుకున్నాను.

4.30- నా మొహంచూసి “ఈవాళ పదహారు ఫైళ్ల తాలూకు పార్టీలవాళ్లు వచ్చినట్టున్నారు? మొహం బాగా అలిసిపోయినట్టుంది.” అని అడిగింది మా ఆవిడ. జవాబు చెప్పలేదు నేను.

4.35- “ఇదేమిటీ? ఒక్క పార్టీ రానట్టుందే?” అంది విడిచిన నా దుస్తుల జేబులు ఖాళీగా ఉండటం చూసి.

—మల్లాది వెంకట కృష్ణమూర్తి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78